ఓం

నారాయణాయ నమః

# గణపతి రామాయణసుధ

## సుందరకాండ







గణపతిశాస్త్రి

ఓం

నారాయణాయ నమః

# గణపతి
# రామాయణసుధ

## సుందరకాండ



చర్ల గణపతిశాస్త్రి

వెల : రూ॥ 15-00

దుందుభి - సంక్రాంతి
మొదటి ముద్రణ : 1983
ప్రతులు : 1000

దొరకు చోటు :

చర్ల గణపతి శాస్త్రి,
33, కిర్లంపూడి బీచ్ క్వార్టర్సు,
ఆంధ్రా యూనివర్సిటీ,
వాల్తేరు - 3.

ముద్రణ :

లలితా ఆర్ట్ ప్రింటర్స్,
విశాఖపట్నం.

శ్రీ తిరుపతి దేవస్థానము వారిచే ప్రారంభించబడిన

ధార్మిక గ్రంథ ప్రచురణ సహాయ ప్రణాళికక్రింద

ఇయ్యబడిన విరాళముతో

ముద్రింపబడినది.

అడుగకుండ తమంత తాముగా ఉదారముగా ఇచ్చిన

/ వి రా శ ము లు /

చి॥ ఆకుండి రాధాకృష్ణమూర్తి 3000—00

తమ తల్లిదండ్రులు శ్రీమతి నాగవరపు సీతారామమ్మ,
శ్రీ నాగవరపు వెంకటరామయ్యగార్ల స్మృతిచిహ్నముగా
వారి కుమారులు శ్రీ నాగవరపు సూర్యనారాయణగారు 600—00

కీ॥ శే॥ శ్రీ నంబూరి రంగారావుగారి స్మృతిచిహ్నముగా
వారి ధర్మపత్ని వెంకటరమణమ్మగారు 558—00
(అర్ధ వేయినూట పదహార్లు)

—o—

# సుందరకాండ

## — సౌందర్యముల తీరు —

సుందరే సుందరో రామః, సుందరే సుందరీ కథా
సుందరే సుందరీ సీతా, సుందరే సుందరం వనం
సుందరే సుందరం కావ్యం, సుందరే సుందరః కపిః
సుందరే సుందరం మంత్రం, సుందరే కిం న సుందరం.

సుందరకాండలోనఁ గవి చూపిన రాముఁడు సీత, సుందరుల్
సుందరకాండలోని కథ సొంపును, మారుతి సుందరుల్ గదా
సుందరకాండ కావ్యము నశోకవనంబును సుందరంబులే
సుందరకాండ మంత్రమును సుందర, మిందెవికావు సుందరాల్?

సుందరకాండను సర్వము
సుందరమై వఱలుచుంట సుందరకాండన్
సుందరకాండ యటంచును
నెందును సార్ధకముగ వచియింత్రు బుధేంద్రుల్.

పైని వ్రాయఁబడిన శ్లోకమును బట్టి సుందరకాండలో వర్ణింపఁబడిన విషయము లన్నియు సుందరములై యుండుటచే సుందరకాండ యని పిలువఁబడె ననియు అందుచే సుందరకాండ యని వాల్మీకియును దానికి పేరు పెట్టె ననియు మన మనుకొనవలెను.

వేద వేద్యేపరే పుంసి జాతే దశరథాత్మజే
వేదః ప్రాచేతసా దాసీత్ సాక్షాద్రామాయణాత్మనా.

వేదములచేఁ దెలియఁ దగిన పరమ పురుషుఁడు దశరథునికి కొడుకై పుట్టఁగా వేదమే ప్రాచేతసునుండి అనఁగా వాల్మీకినుండి సాక్షాత్తు రామాయణమైనది— అను దీని భావమునుబట్టి ఈ క్రింది భావము వచ్చుచున్నది.

తతో రావణ నీతాయాః సీతాయాః శత్రు కర్శనః
ఇయేష పద మన్వేష్టుం చారణాచరితే పథి. సుందరకాండ 1-1

"రావణునిచేతఁ దీసికొనిపోఁబడిన సీత జాడను శత్రుదమనుడైన హనుమంతుఁడు చారణులు తిరుగు ఆకాశముగుండఁబోయి వెదకఁగోరెను" అన్నది ప్రస్తుత కథకు సంబంధించిన యర్థము. ఈ ప్రస్తుతార్థముతోపాటు "సత్పురుషుల నేడ్పించు (రావయుతి) కామక్రోధ దేవతచే స్వస్థానమునుండి తీసికొని పోఁబడిన పరాశక్తిని (గాయత్రిని) చారణులు అనఁగా ఆచార్యులు నడచిన మార్గమగు హృదయాకాశమున జిజ్ఞాసువు వెదకఁ గోరెను" అను అప్రస్తుతార్థము కూడ స్ఫురణకు వచ్చుచున్నది. అట్లు వెదకఁగోరి–

దుష్కరః నిష్ప్రతిద్వంద్వం చికీర్షన్‌కర్మ వానరః
సము దగ్రశిరోగ్రీవో గవాంపతి రివాబభౌ.

సుందరకాండ 1–2

అను పద్యములోఁ జెప్పఁబడినట్లు దుష్కరము, నిష్ప్రతి ద్వంద్వము అనఁగా సుఖదుఃఖాది ద్వంద్వములకు అతీతమైన కర్మను చేయఁగోరి వానరుఁడైన అనఁగా కించిద్జ్ఞుఁడైన నరుఁడు ధ్యానింపఁ గోరి వంచక నిదానముగా నుంచిన శిరస్సు మెడ కలవాఁడయి గో (ఇంద్రియములకు) పతివలె జితేంద్రియుని వలెఁ బ్రకాశించెను– అనునర్థము భావనావీధికి వచ్చుచున్నది.

స సూర్యాయ మహేంద్రాయ, పవనాయ స్వయంభువే
భూతేభ్య శ్చాంజలిం కృత్వా, చకార గమనే మతిం.

సూర్యునితోఁ గూడిన మహేంద్రునికి వాయువునకు స్వయంభువునికి భూతములకు అంజలిపట్టి ఆ సీతను ఆ పరాశక్తిని పొందుటకై బుద్ధినుంచెను. లేక జితేంద్రియుడు అరిషడ్వర్గమును జయించిన సాధకుడు పరాశక్తిని (గాయత్రిని) పొంద గోరి సంసార సాగరమును దాటునట్లు– హనుమంతుడు సీత నన్వేషింప సముద్రమును దాటె నని యైనను మనము తలపవచ్చును. రామాయణము వేదమువంటి దైనపుడు సుందరకాండ మంత్రతుల్యము కనుక పవిత్రము. అందుచే దీనిని అర్థపూర్వకముగా పారాయణము చేసినచో పాపహరము పుణ్యప్రదము నగునని పూర్వుల తాత్పర్యము. కనుక పూర్వము నుండి పారాయణము చేయుచున్నారు.

ఇంక పై శ్లోకములో 'సుందరే సుందరో రామః' ఈమొదలుగా చెప్పఁబడినది. రామాదులు సుందరులు అనఁగా నేమి ? సుందరకాండలో రామాదుల సౌందర్యము ఏవిధముగాఁ జెప్పఁబడినది పరిశీలింతము.

సుందరుడనఁగా కేవల బాహ్యరూపముచేతనేఁగాక సుగుణములచేతఁ గూడ సుందరుఁడైనవాఁడే సరియైన సుందరుడగును. బాహ్యరూపమును చూచిన వెంటనే సుందరముగాఁ దోఁచినను మనస్సు గుణములు సుందరములుగా అనఁగా పవిత్రముగా సత్యముగా నుండనిచో అ బాహ్యరూపము వికృతముగా మారిపోవును,

రాముఁడు సుందరుఁడు రాముఁడు అవయవ సౌష్ఠవము గలసుందరుఁడే కాక సుగుణసుందరుఁడు కూడ.

"యాని లింగాని రామస్య లక్ష్మణస్య చవానర" రామునివి లక్ష్మణునివి యగు చిహ్నము లెట్టివి' అని హనుమంతుని సీత యడుగును.

చూడఁగానే కనిపించునవి కనులు. కళ్ళలోనే జీవను ఉట్టిపడును. చిత్రకారుఁడు శరీరావయవము లన్నిటిని చిత్రించును. కళ్ళను ఆఖరున చిత్రించును. కళ్ళతోనే చిత్రము పూర్తియగును. కళ్ళతోనే అందము వచ్చును. అందుచేత కళ్ళనే అవి యెట్లున్నవో యడుగవలయును. చెప్పవలసినవికూడ అవే. అందుకనియే రాముడు కమల పత్త్రాక్షుఁడు అని యనును. వెంటనే రాముని గుణములుతోచి సర్వసత్యమనోహరుఁడని, రూపదాక్షిణ్య సంపన్నుఁడని. తేజస్సులో సూర్యుని వంటివాఁడు ఓర్పులో భూమికి సముఁడు బుద్ధిలో బృహస్పతి యని. కీర్తిలో ఇంద్రుడు, జీవలోకరక్షకుఁడు, స్వజనరక్షకుఁడు స్వవృత్తరక్షకుఁడు, ధర్మరక్షకుఁడు అని యీమొదలగు గుణములను జెప్పి చివరకు అవయవ సన్నివేశములను హనువర్ణించును. ముఖ్యముగా రామునిలోనిసద్గుణములే యతనికి సౌందర్యమును గూర్చెను. ఈ సుగుణములకు శరీరావయవ సన్నివేశములు, శరీరావయవ సన్నివేశములకు సుగుణములు పరస్పర పోషకములై యాతని సౌందర్యాతిశయమును వృద్ధి పఱచినవి. రాముఁడు పురుషులను గూడ సామాన్యులనేగాదు విజ్ఞులగు వారినే గాదు సర్వసంగ పరిత్యాగులగు ఋషులను గూడ మోహింపఁజేయునంతటి సౌందర్యము గల

వాఁడు. ఇంక హనుమ చెప్పిన యవయవ సన్నివేశాదులను జెపి యిక్కడ పునరుక్తి నాపాదింపఁదలపలేదు.

ఇంక సీతదగ్గఱకు వత్తము. సీత మతినాంగియయి దుష్టుఁడై రావణుని వనములో రాక్షసస్త్రీల కాపలాలో ఉన్నది. ఉపవాసములతోఁ గృశియై యు నికి దూరమై దీనురాలై యున్నది. ఇట్టి స్థితిలో హనుమంతుఁడు సీతను చూచెను. ఆసీత-

దితిజకాంతల మధ్య అతికుళ్ళు చీరతో నుపవాశకృశత నిట్టూర్చుచు,ఇదె యదెయని గురుతిడఁదగి, పాడ్యమిని స్వచ్ఛ చంద్రునిరేఖ సాటి వెలుగుచు, మొగమున అశ్రువులుగాఱ మిగుల దీనురాలై యున్నది. కుక్కల మధ్యను బడిన లేడివలెనున్నది- జఘనమునంటు కొన్న ఒంటి జడతోఁ గనిపించినది. ఆమెను జూచి ఈమె సీతయైయుండునని హనుమంతుడూహించెను. ఈ దీన రూపుతోపాటు ఆమె కన్నీరు నిండిన క్రొన్నీలి వంకర కనురెప్ప కంటితోఁ జూచుచున్నట్లు ఉండెను. ఆ హనుమంతుఁడిట్లనెను.

శ్లో॥ “దుష్కరంకురుతే రామో య ఇమాంమత్తకాసినీం
సీతాంవినా మహాబాహుర్ముహూర్తమపి జీవతి”

ఇట్టి సీత లేకుండ రాముడంతటివాడు బ్రతికి యున్నాడంటే అది చాల దుష్కరమైన పని అని హనుమంతుడు అన్న వాక్యములు సీత సౌందర్యపరా కాష్టను తెలుపుచున్నవి.

“త్రైలోక్య రాజ్యంసకలం, సీతాయానాప్నుయాత్ కళాం” సకల త్రిలోక రాజ్యము కూడ సీత యొక్క యొక కళకైనను చాలదు అన్నాడు హనుమ. ఈచిన్న వాక్యమును బట్టి సీత యెందటి సుందరియో మనకు తెలియును. అట్టి సీతాన్వేషణ కథ, గాయత్రీయన్వేషణ కథవలె, ఆత్మ శక్తియన్వేషణకథ వలె ఎంత ఘనమైనదో చూడుడు. ఎంత సుందరమైనదో కనుడు. సకల ఋతుఫలములతో నిండిన వనము సహజ శోభలచే సుందరము. త్రిలోక ములలోని ఉత్తమ సౌందర్యముగల వృక్షము లేర్చి కూర్చినది. సరె. ఇంక ఇట్టికావ్యము సుందరము కాకుండ ఎట్లుండును.

ఇంక కపియా సుందరుఁడు ! కపిచేష్టలో సుందరము లెట్లు అగును ? అందులో సూర్యుని పండనుకొని ఎగిరి క్రిందపడిన వాఁడు. దవడ ఎముక విఱిగి వికారి యగుట వలననే హను (దవడ) మాన్ (గలవాడు) అను సార్థక నామముడయ్యెను. కపి, ఇంక ఆకపికి సౌందర్యమెట్లు అని ప్రశ్న ? కాని హనుమ జీవితము పరార్థమైనది. సముద్రమును దాటి అందులో మ్రింగుటకు వచ్చిన రాక్షస స్త్రీలతో యుద్ధము చేసిన వాఁడు ప్రాణమునకు తెగించి ఒంటరిగా మూఁడు లోకములకు అధిపతియైన రావణుని లంకకు వెళ్ళినవాడు. వెళ్ళిన వాఁడు సీతను చూచి వచ్చిన సరిపోవునుగద! దూతగా వెళ్ళినవాఁడు శూరుఁడై ధీరుఁడై, గూఢచారియై, మంత్రిగా, సేవకునిగా సర్వకార్యములను నెఱవేర్చి వచ్చెను. చనిపోవుటయైన మంచిదిగాని సీతను జూడక రావణుని సైన్యము సంగతి చూడక రాముని గొప్పదనము కనక వెనుదిరిగి వెళ్ళరాదని యన్ని పనులుచేసెను. అంతఃపురములో ఆడవాళ్ళ మధ్య తిరిగి స్త్రీలను ముఖముతో చూడరాదన్న నమ్మకమున్న వాఁడు. సీత ఆడది, ఆడదానిని అడవాళ్ళలో చూడకపోతే ఇంకెక్కడఁ జూచెదనని స్థితప్రజ్ఞుఁడుగా నైష్ఠిక బ్రహ్మచారిగా నుండి తిరిగి చూచెనే. ఇన్ని పనులు చేసిన హనుమ చూడదగిన వాఁడు కాక సుందరుడు కాకపోతే ఇంకెవడు సుందరుఁడగును.

ఇంక అశోక వనమా ? అన్ని లోకములు జయించి సుందరమైన వస్తువులన్ని ఒక ప్రోగుపెట్టి యుంచిన వనము ఇది ఎంత సుందరము.

ఇందులో గాయత్రీ మంత్రమును నిక్షిప్తము చేసి యుంచబడినది. గాయత్రీమంత్ర హృదయము సర్వమంత్రములలో శిరోభూషణమైనది. నగాయత్ర్యాః పరం మంత్రం అనిపించుకొన్నమంత్రము అత్యంత సుందరముకాదా.

ఇట్లు అన్ని సౌందర్యములతో నిండియున్న యీకాండము సుందరము ఎట్లు కాదు. ఇది అన్వర్థనామము గలది. రామాయణమును "సీతాయాశ్చరితం" అన్నాడు మహర్షి. సీత చరిత్రమును బట్టియే రామాయణమున కింతః ప్రాధాన్యము వచ్చినది. రాముఁడు సత్యపరాక్రముఁడు. సీతపతియే దైవతముగా గలిగినది. హనుమ రాముని భక్తుడు, వీరుడు, శూరుడు. హనుమ లేనిదే సీతాన్వేషణయే లేదు. ఇట్లు అన్నియు సుందరములే.

---

# రామాయణ సుధ - సుందరకాండ

## / విషయ సూచిక /

గణపతి

# రామాయణసుధ

## సుందరకాండ

### —: మహేంద్రగిరిపైని హనుమంతుని విహారము :—

* తరువాత రావణునిచే
హరియింపం బడిన సీత నన్వేషింపన్
అరిదమనుఁడు హనుమంతుం
డరుగఁ దలఁచె చారణు లెపు డరిగెడి పదవిన్. 1

** అతికష్ట మద్వితీయము
నతులం బగు కర్మ చేయ నాశించెడి యా
వ్రతి హనుమంతుఁడు తల మెడ
నతి పైకిడి గోపతి వలె నట భాసిల్లెన్. 2

---

* ఇందు హనుమంతుని సౌందర్యము, సీతారాముల సౌందర్యము, లంకా సౌందర్యము సీతా స్వరూపశక్తి సౌందర్యములు వర్ణింపబడినవి కాన సుందరకాండ అని పేరు కలిగినది. సీత=దైవీశక్తి, రావణుఁడు=దుర్గుణములు గలవాడు, అరిదమనుఁడు= అరిషడ్వర్గమును జయించిన సాధకుడు హనుమంతుడు. చారణులు= ఆచార్యులుదేవతలు, పదవి=ఆకాశమార్గము మోక్షపదవి అనిగ్రహింపవలెను.

** గోపతి=ఎద్దు, వాక్పతిజ్ఞానియు.

గణపతి

# రామాయణసుధ

## సుందరకాండ

### —: మహేంద్రగిరిపైని హనుమంతుని విహారము :—

* తరువాత రావణునిచే
హరియింపం బడిన సీత నన్వేషింపన్
అరిదమనుఁడు హనుమంతుం
డరుగఁ దలఁచె చారణు లెపు డరిగెడి పదవిన్. 1

** అతికష్ట మద్వితీయము
నతులం బగు కర్మ చేయు నాశించెడి యా
ప్రతి హనుమంతుఁడు తల మెడ
నతి పైకిడి గోపతి వలె నట భాసిల్లెన్. 2

---

* ఇందు హనుమంతుని సౌందర్యము, సీతారాముల సౌందర్యము, లంకా సౌందర్యము సీతా స్వరూపశక్తి సౌందర్యములు వర్ణింపబడినవి కాన సుందరకాండ అని పేరు కలిగినది. సీత=దైవీశక్తి, రావణుఁడు=దుర్గుణములు గలవాడు, అరిదమనుఁడు= అరిషడ్వర్గమును జయించిన సాధకుడు హనుమంతుడు. చారణులు= ఆచార్యులుదేవతలు, పదవి=ఆకాశమార్గము మోక్షపదవి అనిగ్రహింపవలెను.

** గోపతి=ఎద్దు, వాక్పతిజ్ఞానియు.

అటు వైఢూర్యము లుదకము
లటు భాసిలు పచ్చికల బయళ్ళను స్వేచ్ఛన్
అటు నిటు ఘనబలుఁడు హుంటా
హుంటి నాటోపమునఁ దిరిగె నుద్ధత వృత్తితో. 3

మఱి ద్విజతతి భయ పెట్టుచు
నురమునఁ బాదపములఁ గడు నుద్ధతిఁ గొనుచున్
పొరిఁబొరి మృగములఁ గొట్టుచుఁ
దిరిగెడి సింహంబువోలె దిరిగెను వడిగా 4

నలుపై యెఱ్ఱని వౌచుఁ బచ్చ వగుచున్ స్వచ్ఛంబులై నీలిపై
పలుచిత్రా లగుచున్ స్వభావయుతమై భ్రాజిల్లు నాధాతువుల్
అలరన్, గామపురూపు గల్గి సుర తుల్యంబైన నాగాళి యు
క్షులు గంధర్వులు కిన్నరుల్ గల గిరిన్ శోభిల్లె నాతం డొగిన్. 5

పదివేల యేనుఁగులు గల
హ్రదమున మదవారణంబొ యన నాతండున్
కుధర తల చిత్రధాతులఁ
బదెపదె నాగాది నడుమ భాసిలుచుండెన్. 6

అతఁ డాదిత్యునికిన్ మహేంద్రునికి దేవారాధ్యుఁడౌ బ్రహ్మకున్
అతిభక్తిన్ వడిఁ దూర్పుమోమయి కడున్ హస్తంబులన్ మోడ్చి యు
ద్ధృతి నాదక్షిణదిక్కు కేగ నభివృద్ధిం జెంది లం ంప నా
యితమై పర్వపు సంద్రమట్టులు విజృంభించెన్ ధృతిన్ రాముకై 7

మితియేలేని శరీర మూని జలధిం బెంపారి లంఘింప దీ
క్షితుఁడై బాహులతోడఁ బాదములతోఁ గ్రేళ్ళుబ్బి యాయద్రి ను
ద్ధతి దట్టించుచు నిట్టటుల్ త్రుటియె భాధల్ పెట్ట నాయద్రి సం
తత మెంతో యచలంబ యయ్యు చలమై తబ్బిబ్బు లయ్యెన్ గడున్. 8

గిరి రాలి వాసనల్ విఱఁజిమ్మ పువ్వులు
క్రమ్మ గిరి సుమమయమ్మె యయ్యె
వీరుండు మారుతి పీడింప నగ్గిరి
మదహస్తి మద మట్లు వదలె జలము
హనుమ త్రొక్కి తిరుగ నామహేంద్ర మహాద్రి
పసిడి కాటుక వెండి పాలు జార్చె

మధ్యమ జ్యోతి వహ్ని ధూమాళి నట్లు
మణిశిలల నొప్పు శిలల రాల్చెను మహాద్రి
గిరిని విహరింప నణఁగిన దరుల నున్న
ప్రాణులు ప్రకృత స్వరముల వడిగ నఱచె. 9

గిరిని హనుమ త్రొక్క నఱచెడి జంతుల
ధ్వనులతో దిశ లుపవనులు నిండె
పడగలు గల విష్ణుపాదా లగపడఁ బా
ములు విష ముమియుచు శిలల గఱచె
అలిగి విషము గ్రక్కి శిలలఁ గఱవ శిలల్
విప్పు లుమిసి వేయి యప్పుడయ్యె
శైల స్థితౌషధ జాలము లణఁచు న
వయ్యు సర్పవిషము నణఁచ వయ్యె

భూతములచేత నాగిరి ముక్కలయ్యె
ననుచు ఋషులు వెడలిరి; విద్యాధరులును-
సతులతోఁ బానశాలల స్వర్ణపాత్ర
లదరఁ బై పై కెగిరి యద్రి వదలి చనిరి. 10

వెలగల పాత్రలన్ విడిచి, వీడియు బంగరు గిన్నె గ్లాసులన్
పలుగతి లేహ్యముల్ వివిధ భక్ష్యములన్ జల మాంస భోజనం
బులు విడి, యెడ్లచర్మములు పూన్చిన జొళ్ళను పైడి పిళ్ళక
త్తులు త్యజియించి, పైకెగిరి తొందర తొందరనేగి రత్తటిన్. 11

సరముల్ వ్రేలఁ బ్రమత్తులై యరుణ పుష్ప స్రక్తతుల్ లేపముల్
వఱలన్, రక్తము తమ్మివంటి కనులన్ బ్రభావిల్ల విద్యాధరుల్
తఱచై మింటను జేర స్త్రీల్ వలయముల్ స్వర్ణాంగద శ్రేణి, నూ
పుర కేయూరములన్ ధరించి నగుచున్ బోదుర్ మహాశ్చర్యలై. 12

ఋషి విద్యాధరు లాత్మసిద్ధులను నెన్నోఁ జూపుచున్ మింట నో
న్నిమిషులై యాగిరిఁ జూచుచున్ రా విమలవహా మిన్నందు భావించు నా
ఋషులున్ సిద్ధులు చారణుల్ పలుకు నాయీ మాట లాలించి, రా
మిషతో మానుష లోక సంగతులు నెమ్మిన్ జూచు విద్యాధరుల్. 13

"ఇదిగో శైలమువంటి మారుతి మొన శ్శైపారి వేగాఢ్యమౌ
నుదధిన్ దాటఁగఁ గోరె, రాముపనికై, సోత్సాహులౌ క్రోతులన్
బ్రదికింపన్, బొనరింప లేనిది యొనర్పంబూని, దుష్ప్రాపమౌ
నుదధిన్ దాటెడు, నన్ నుడుల్ వినుచు దివ్యుల్ చూచి రా మారుతిన్.
14

గిరిబోల్ మారుతి రోమముల్ దులుపుచున్ గ్రేళ్ళుబ్బి కంపించెఁ, జె
చ్చెఱ మేఘంబటు గొప్ప ధ్వానము లొనర్చెన్ పైకి లంఘింపఁ గ్ర
మ్మఱ వాంఛించుచుఁ ద్రాచుపామును గరుత్మంతుండటుల్, వా
లము నాడించఁగఁ బక్షిరాణ్ముఖమునన్ సర్పంబటుల్ రాజిలెన్. 15

పరిఘల్ పోలిన బాహులన్ మిగుల నిష్పందంబు గావించుచున్
చరణంబుల్ కడు సంకుచించి, కటిపైఁ జక్కంగ వే గ్రుచ్చి యు
త్తటి సంకోచము చేసి కేల్ మెడయు, సత్త్వం బొంది వీర్యాప్తఁ జె
చ్చెఱ దవ్వౌ పథిఁ గాంచి మారుతియు దృష్టిన్ పైకి నిల్పెన్ గడున్.
16

వడినాకాశముఁ జూచుచుండి హృదిలోఁ బ్రాణాల్ నిరోధించుటన్
అడుగుల్ గట్టిగ నిల్పి కర్ణముల నత్యంతంబు జిక్కించి యూ
ర్ధ్వ వీర్యం డెగురం దలంచుచును నందే వానర శ్రేష్ఠులన్
కడు వీక్షించుచు నివ్విధంబుగను వక్కాణించె వీర్యంబుతోః 17

అనిల విక్రమ మొప్ప నారాము శరమట్లు
రావణు లంకను వ్రాలు దిపుడె
ఒకవేళ లంకలో నుర్విజన్ సీతను
గనకున్న దివికేగి కనెద వేగ
ఒకవేళ దివిఁగూడ నుర్విజన్ సీతను
గనకున్న రావణున్ గట్టి తెత్తు
అన్ని విధంబుల నాసీత నిటు తెత్తు
లేనిచో లంకనే వ్రీల్చి తెత్తు

అనుచుఁ గపులతో వచియించి యపుడు మదిని
ఏమియు గణింపక జవాన నెగిరి పైకి
తన్ను నాగరుత్మంతుఁగాఁ దలఁచి మిగుల
బలము కపికుంజరుం డట వెలయఁ జూపె. 18

హనుమ వడినెగుర, నద్రి మొల్చిన చెట్లు
నెల్ల కొమ్మలఁ గొని యెగిరెఁ బైకి
వడి హనుమ యెగురు తొడల వడిని చెట్లు
నెల్ల కొంగలఁ బూల నెత్తి యెగిరి
తొడల వేగంబునఁ ద్రుటిమాత్ర చెట్టులు
నాప్తుల హితు లట్టు లనుసరించె
తొడలవడి విఱిగి పడినట్టి పెనుచెట్లు
సైన్యా లధిపునట్లు చనియెఁ గూడ.

చివర విరిసిన చెట్టులు చెంత నుండ
హనుమ గిరి రూపుఁడై యయ్యె నద్భుతుడుగ
ఇంద్రు ధనుష్షుచే గిర్లు లబ్ధి ఝెనసినట్లు
స్థిరము లగు చెట్లు లవణాబ్ధిఁ జేరి మునిగె. 20

అలరు మొగ్గలు గ్రమ్మ జలధాభ మారుతి
మిణుగురులు గిరివోలెను దనర్చె
హనుమ వేగాన రాలిన పూలు పడినీళ్ళ
నరుగు సఖులకంటి యశ్రు లయ్యె
కపి వేగమున వార్ధిఁ గని రంగు రంగు పూల్
చుక్కలపథి నొప్పు చుక్కలయ్యె
పూలపంక్తులు క్రమ్మఁ బొలిచిన మారుతి
చదల మెఱుపు లొప్పు జలద మయ్యె.

హనుమ వేగానఁ బడిన పూలను జలంబు
చక్కనౌ చుక్కల దివంబు సరణి నొప్పె
హనుమ చాపిన చేతులు నంబరమున
అద్రి వెడలు నైదుముఖాల యహులఁ బోలె. 21

కెరటముల సముద్రం, బ
త్తఱిఁ గ్రోలెడు నటులఁ గ్రింది తలమున నేగెన్
మఱి యాకాశమ్మును న
త్తఱిఁ గ్రోలెడు నటుల నభ్రతలమున నెగిరెన్. 22

మెఱుపుఁ గాంతులఁ బోలె మించి తన్నయనము
లనిలపథి నగాగ్ను లటుల వెలిఁగె
పింగాక్ష ముఖ్యుని పింగాక్షు లుదిత మం
డలులగు సూర్య చంద్రులను మించె

తామ్ర నాసికచేత తామ్రమమౌ తన్ముఖ
మాసంధ్య సోకిన యర్కు మీఱె
మింటి కెగురు కపిమేటి తోక మిం
టిని తాక దివి నింద్ర ధనుసుఁ బోలె.

వాల చక్రాన శుక్ల దంతాలు గలుగు
హనుమ, పరివేష మలరిన యర్కు మించె
ఎఱ్ఱనౌ వాల మూలాన నెసఁగె హనుమ
ప్రీలు గైరిక ధాతుచే శైల మట్లు. 23

కపివరుఁ డంబుధిన్ గడచుచుండ భుజాలఁ
గల గాలి మేఘంబు వలెనె యుఱిమె
ఉత్తర దిశ నుండి యూడు నుల్క యటుల
వాలానఁ గన్పడె ప్లపగ గజము
పడుచున్న రవివోలెఁ బొడుగయి కపి యొప్పె
కట్టు గొల్పున దీర్ఘ కరియుఁ బోలె
పై నుండి జలధిలోఁ బడు తనుచ్ఛాయచే
కపి గాలిలో నౌక కరణి నొప్పె,

అబ్ధి నేయే స్థలి కరిగె నా కపీంద్రు
డది యుది తొడలవడి లేచునట్టులయ్యె
అద్రివంటి వారిధి తరంగావళులను
కొట్టుచును మహాకపి వడినిట్టె యెగిరె. 24

కపిగాలి మబ్బుగాలియు
నపు డురుఘోష గల వార్ధి నట వడఁకించెన్.
అపుడె పెను కెరటముల వర
కపి లాగుచు మిన్ను భువియు కడువిడ నెగిరెన్. 25

మేరు మందర తుల్య వారిధి లహరులు
  నెగుర నెక్కిడు నట్టు లెగిరెం గపియు
కపివేగమున లేచు ఘనయుత నీరము
  దీర్ఘశారద మేఘ దీప్తి నెసఁగె
తిమి నక్ర మకర మత్స్యములు కూర్మము లటు
  వగపడె నగ్నమౌ ప్రాణు లట్లు
మింట నెగురు కపి మేటిని గని సము
  ద్రోరగాలు విహగేంద్రుగఁ దలంచె
వెడలుపు పదియామడ, లింక పొడుగు ముప్ప
  దామడగల తచ్ఛాయ స్వచ్ఛాభ్రమయ్యె
ఆమహాకాయుఁ డత్యోజుఁ డాతఁ డాశ్ర
  యమొ గనని మింట తెక్కల యద్రి యయ్యె.

హనుమంతుండు బలుం డెటెట్లు చనునో యామార్గమందే తన
ర్చిన సంద్రంబు కటాహమో యనఁగఁ దోఁచెన్ బక్షిమార్గంబులో
వినతా పుత్త్రుఁ డటుల్ పయోద తతి వేవే లాగి యావాయు వ
ట్లును నొప్పెన్ వసు పెర్పు తెల్పు జలదాలున్ మీఱ నాకృష్టమై. 26

చిఱు మేఘంబులఁ జొచ్చుచు
మఱి మఱి మేఘములనుండి మసలి వెడలుచున్
పొరిఁబొరిఁ గనఁ బడక మరల
నరయఁ బడుచుఁ జంద్రుఁడువలె నాతఁడుతోఁచెన్. 27

ఎగురు వానరు విలోకించి గంధర్వ దే
  వ లసురుల్ కురిసిరి పుష్పవృష్టి
దాటు కపికి రవి తాపంబు గూర్చఁడు
  రాముపనికి గాలి ప్లవగుఁ గొల్చె

ఈతఁ డిక్ష్వాకు వంశ్యుఁడె యెల్ల నపుడు
మనకు నిక్ష్వాకు వంశ్యులు మాన్యులు గద
మనకు సాచివ్య మొనరింపు మనదు పనిని
దాటుచో సజ్జనులకుఁ గ్రోధమ్ము కలుగు. 31

నీటినుండి మీఁదకు లెమ్ము నీదు పైని
హనుమ యుండు, నాతఁడౌ వేఁడు మనకు నతిథి
స్వర్ణనాభ! గంధర్వ దేవార్చ్య ! యతఁడు
నీపయిని విశ్రమించి చనియెడుఁ బిదప. 32

ఆకపియు నీదు మీఁదకు నరుగుదెంచె
అనఘ రాము కరుణయు సీతాపహరణ
మాకపీంద్రు పరిశ్రమ నరసి నీవు
పైకి లేవఁదగుదువు మైనాక శైల ! 33

అపుడు మైనాకుఁ డబ్ధి పల్కాలకించి
ఘనతరు లతాన్వితుఁ డయి శీఘ్రముగ నెగిరి
వారిదముఁ జీల్చుకొని రవి వచ్చి నట్లు
అద్రిజలధిఁ జీల్చుకొని యప్పు డెగిరె. 34

గొప్ప యాత్మ గలిగిన యాగొప్ప కొండ
నీటఁ దడియు శృంగములఁ గన్పింపఁ జేసె
ఉరగ కిన్నరు లున్న బంగరు మహాద్రి
శృంగము లుదిత సూర్యుని నెంతొ పోలె. 35

అబ్ధి మింటి రాము నటుల నలర మిన్ను
పసిఁడి ద్యుతి శృంగముల శస్త్రవర్ణమయ్యె
అప్పు డెదుట లవణాంబుధి యందు లేచు
నద్రిఁ జూచి హనుమ విఘ్న మని తలంచె. 36

అట్లు పైకి లేచిన యద్రి నరసి హనుమ
కడఁగి వచ్చు తుపాను మేఘమును వోలె
పొట్టతో దాని వడిఁ బడఁగొట్టి వేయు
హనుమ వడిఁ దెల్సి గిరి యలరి మెచ్చె. 37

మనుజ రూపునఁ దన శృంగమునను నిల్చి
ప్రీతుఁడై గిరి పొంగి యీరీతిఁ బలికె
కపివరా! చేసినావు దుష్కరపుఁ గర్మ
స్వేచ్ఛగా నాదు శృంగాల విశ్రమింపు. 38

రాము వంశీయు లీసముద్రమును పెంచి
రందుచే రాముపనికి నిన్నబ్ధి గొలుచు
చేసినఁ దిరిగిచేఁత ప్రాచీన ధర్మ
మీతఁ డాతిథ్య మిడుము మన్నింపు మితని. 39

ఈకపియె వంద యామడ లెగురఁ బూనె
విశ్రమించి నీతటిఁ బైకి వెళ్ళఁగలఁడు"
అనుచు నీయెడ బహుమానమునను నన్ను
నిటులఁ బ్రేరెచె నిట విశ్రమించి వెళ్ళు. 40

ఇదె యీగిరి తావి రుచియు
పదెపదె యిడు కందమూల ఫలములు గలదై
ముదమును గూర్చును గావున
పదపడి కడు విశ్రమించి బైద్దేరు మిటన్. 41

లోకముల గుణ గ్రహణా
ఖ్యాక సుసంబంధ మద్ది కల దిటు నీతో
వీకన్ వేగమె యెగిరెడి
యీకపులందు నిను ఘనుఁగ నెంతుఁ గపీంద్రా ! 42

మింటిపై కెగిరెడి మేల్ మహౌజసుఁ గపిన్
ఋషి దేవ గంధర్వు లెంతొ పొగడి
యురగ యక్ష విబుధు లుత్తమకపి మెచ్చి
రల దేవ గంధర్వు లవల పొడి

రపుడె గురు హనుమంతు నంబు నిధియుఁ
గాంచి యిక్ష్వాకు కులు గొప్ప యెంచి తలఁచె
నేనె గనుకఁ గపికి సాయ మేని నిపుడు
చేయుకున్న నిందు్యఁడ నని చెప్ప జగము. 28

జగతి నిక్ష్వాకు విభుఁడైన సగరు చేత
వృద్ధిగంటి, నిక్ష్వాకుని యిట్టి మంత్రి
యిందు సెట్టి కష్టము గూడఁ బొందరాదు
ఇతఁడొ రాముని కెంతయు హితుఁడు గూడ. 29

ఈకపీంద్రు డెటుల విశ్రమించు, నటుల
సలుపఁ దగు, మీఁద నావయి శ్రమను బాసి
తక్కుగల మార్గమంతయు దాటు ననుచు
నరసి బంగారు మైనాకగిరిని బలికె. 30

పాతాళమున నున్న దైతేయులకు నిన్ను
ద్వారపు గడియుగా వజ్రి యుంచె
బలముతోఁ గ్రమ్మఱ బైకెగిరెడి వీరి
ద్వారంబుగా నడ్డుపడియు నుంటి
నడ్డంబుగాఁ బైని నతిక్రిందుగఁ బెరుగఁ
గలవు ప్రేరేచెదఁ గరము పెరుగు
ఇదె వానరేంద్రుఁడు నేగు రాము పనికై
వీనికి సాయము నేను జేతు

అతిథియొ పామరు డైనను
మతి ధర్మజ్ఞుని కితఁడు మాన్యుఁడు సుమ్మీ
క్షితి నిను బోటి యతిథి షం
గతి నీక వచియింప వలెనె తను కపివర్యా! 43

నీవో మహాత్ముఁ డగు నా
దేవ వరిష్ఠుఁ డనిలునకు దివ్యసుతుఁడవే
ఆవాయువునకు వేగము
తో వానరవర! తగిన బలుండవు సుమ్మీ. 44

నీవిఁకఁ బూజింపఁ బడిన
నావాయువుఁ బూజితుఁ డగు నవనీతలిలో
కావున నీవును పూజ్యుఁడ
వీ విషయమ్మున ని కొక్క హేతువు కలదున్. 45

మును కృతయుగమ్ములో నా
యనః పర్వతములకు రెక్కలున్నవి యుండెన్
మునువవి గరుడానిలజవ
మున సకల దిగాంతములకుఁ బోయెడివిసుమీ. 46

అవి యపు డేగుచు నుండగ
దివిజ గణంబులు ఋషులును ధృతి విడి మదిలో
అవి యెప్పుడు పడునో యని
మివులభయంబును గని కడు మెలఁగిరి జింతన్. 47

అది గని వజ్రాయుధుఁడును
పదపడి యా పర్వతముల పక్షంబుల వే
విధములు పటపట వజ్రా
యుధమున ఛేదించి వైచె మరుకోపముచే. 48

అతఁడో నసుగని యలుగుచు
శతధారల వజ్ర మెత్తి చటుకున రాఁగా
అతివడిగ మహాత్ముడు నీ
పిత వాయువె యీజలధిని వేసియుఁ గాచెన్. 49

కనుకన్ నాఱెక్కలతో
డనె దాగియు యుంటి నిచ్చటనె యీకతనన్
నిను మన్నించుచు నుంటిని
కనుమీ నీతండ్రి నాకుఁ గడు మాన్యుండౌ. 50

లోకముల మహా సుగుణా
ఖ్యాక సుసంబంధ మద్ది కల దిటు నీతో
ఓకపివర! కనుకనె యిక
నాకున్ జలధికి ప్రియ మొనర్పుమి యిపుడున్ 51

శ్రమఁ బాపికొనుమి గ్రహిం
పుము మాయాతిథ్య పూజ ముందుగఁ గపిస
త్తమ! నీదర్శనమునఁ దృ
ప్తిని బొందితి గారవింపు వెస మాప్రీతిన్. 52

అని మైనాకుఁడు పల్కఁగ
విని కపివరుఁడు గిరివరుని వేగమె పలికెన్
కనితిని ప్రీతి, నతిథిపూ
జ గొనితిని, ఈయలుకను జనఁబో విడుమీ. 53

త్వరపెట్టుఁ గార్యకాలము
మరి పగలు నతిక్రమించు, మసలఁగరా, ద
త్తఱిని బ్రతిజ్ఞ నొనర్చితి,
మఱి మధ్యగ తడయరాదు మన్నింపు మిఁకన్. 54

అని పల్కి చేతిలో గిరి
ననువుగఁ దట్టుచు ప్రసన్న మగు మోమున మిం
టి నట ప్రవేశించి బలం
బునఁ దనరుచుఁ గపివరుండు పోవం దొడఁగెన్. 55

నగ సముద్రాల సబహుమానముగఁ జూడఁ
బడిన వాఁడయి యాశీస్సు వచనములను
గొల్వఁబడి క్రిందఁ బై దవ్వు గూడ నెగిరి
జనకు పథి మింటఁ జనె గిరిన్ జలధి విడచి. 56

మఱియుఁ బై దారి పట్టి యాగిరిని గనుచు
పవన సుతుఁడు స్వచ్ఛమగు నభ్రమున చనియె
అద్వితీయ దుష్కర కర్మ నరసి సురలు
నెల్ల ఋషులు సిద్ధులు ప్రశంసించినారు. 57

అపుడు స్వర్ణమైనాకాద్రి యాచరించి
నట్టి పని కచ్చటి సురల్ సురాధిపతియు
మెచ్చి రట సంతసంబున మెచ్చి వజ్రి
స్వయముగాఁ బల్కె మైనాకశైల మరసి. 58

స్వర్ణనాభ! మైనాక! నీపనికి మిగుల
సంతసిలితి నుండు మభయసౌఖ్య మొంది
వందయామడ లెగురుదు భయము పడెడి
స్థలి భయపడ కేర్చు కపికి సాయపడితి! 59

రామునికి దూతఁ గపి రయమ యేగ
నాతనికి సాయపడితివి ప్రీతి గంటి
ననఁగ సురపతిఁ గని యద్రి హర్ష మొంది
శక్రుచే వరమొంది స్వాస్థ్యంబు నొందె. 60

హనుమంతుండు ముహూర్త మాత్రమున నీయంబోధి లంఘింప తా
విని గంధర్వ మహర్షి సిద్ధ సురలున్ వీక్షించి యాదిత్యు శో
భను నేపాలెడి నాగమాత సురసన్ వాక్రుచ్చి రీ శ్రీయుతున్
హనుమంతున్ గను మబ్ధి దాటు త్రుటి చేయుంబూనుమీ విఘ్నము. 61

గిరివోలెన్ గడు ఘోరమై యసుర మాడ్కిన్ మీఱు రూపూని, భీ
కర దంష్ట్రల్ గొని పింగనేత్రముల నుగ్రంబౌ ముఖం బొప్ప నం
బరమో యన్నటు నోరు విప్పు: కపి సామర్థ్యం బదే పాటిదో
యరయం బోదుము, యుక్తిఁ గెల్చునొ విషాదాంభోధిలో మున్గునో. 62

అని దేవుల్ కడు సత్కరించి యనఁగా నంభోధి మధ్యంబునన్
గన దైత్యాకృతి దేవి యాసురస లోకంబుల్ భయంపెట్టు నా
హనుమంతున్ వికృతున్ విరూపు ఘను నాయంబోధి లంఘించువా
నిని వీక్షించుచు దారి కడ్డముగనే నిల్చుండి యీలా గనెన్. 63

ఇటు లాహారముగా మహేశ్వరులు నాకీవేళ నిన్ జూపినా
రిట నిన్నున్ భుజియింతు నాముఖము నిటిన్ ప్రవేశింపుమం
చిటు వాక్రుచ్చెడి దేవినాసురసనే వీక్షించి శ్రీమంతుఁడై
పటువౌమారుతి యంతఁ గేల్మొగుచుచున్ వాక్రుచ్చె హృష్టాత్ముఁడై 64

దశరథసుతుండు రాముఁడు దండకలకు
భ్రాత లక్ష్మణుతో సీత భార్యతోడ
నరుగ నన్యకార్యాసక్తుఁడైన యతని
యతివ సీతను రావణుం డపహరించె. 65

సీతదరికి రామాజ్ఞచే దూత నగుచు
వెళ్లుదును, రామునికిని గావింపు సాయ,
మోసి రాజ్యవాసిని! యెట్టి గాసి యిడని
రామ, సతిఁ గాంచి చొత్తు నీమోము, నిజము. 66

అనుచు హనుమంతు డన నప్పు డనియె సురస
వేఁడు నను దాటరాదిది విధి వరము
అనిముఖము తెఱువ సుబుద్ధి యనిల సుతుఁడు
స్వాంగముల ముడ్చి బొటన వేలంత యయ్యె. 67

అతఁడు త్వరగ నామె ముఖమ్మునందుఁ జొచ్చి
ఘనుఁ డయి వెడలి యంతరిక్షమున నిల్చి
శ్రీయుతుం డయి యనియె దాక్షాయణీ! యిదె
నీకు నమసు నేఁ జొచ్చితి నీదు నోరు. 68

జనక సుత యున్న చోటుకిఁ జనెదవేగ
నీదు వరమును సత్యమై నెగడెఁ జుమ్మ
అనఁగ రాహుముఖమునుండి చనిన చంద్రు
నటు స్వముఖమునుండి వెడలు హనుమఁ జూచి 69

తనదు నిజరూపమును దాల్చి యనియె సురస
శ్రేష్ఠకపి; సౌమ్య! నీకార్య సిద్ధి కరుగు
ఆమహాత్ముఁడై వెలసిన రాముతోడ
జానకిని వేగ కలుపుము చనుము వేగ. 70

కపివరు తృతీయ దుష్కర కర్మఁ జూచి
మేలు మేలని భూతముల్ మెచ్చెఁ గపిని
దాటరాని సంద్రంబు దాటె హనుమ
హెచ్చి గరుడునివలె మిన్ను చొచ్చె నపుడు. 71

వారిధారల నొప్పి పక్షితతు లెగుర
నర్తకైరావత నాదమలర
శారూల సింహ కుంజర పతగోరగ
వాహనాలు విమాన వార మెగుర

వజ్రాశని సమ శబ్దము లొప్పు నగ్నులున్
పుణ్యాన దివ మొందు పూజ్య లొప్ప
హవ్యము గొను నగ్నిబాగుగ సేవింప
రవి చంద్ర నక్షత్ర గ్రహము లమర.

యక్ష గంధర్వ ఋషి నాగు లలరి తిరుగ
దేవరా జేభ విద్యాధరావృత మయి
కమలభవుఁడు నిర్మింపఁగ నమరి యున్న
యాకసమున గరుడివోలె హనుమ యేగి. 72

అన్ని యెడలఁ జూడఁబడిన హనుమ యపుడు
లంబ పక్షాద్రివలె-నిరాలంబమైన
యంబరంబునఁ జనఁ గపి నరసి వృద్ధ
కామరూప సింహిక రాక్షసి తలంచె. 73

ఇంత కాలంబునకు నే భుజింప నయ్యె
ఈ మహాసత్త్వ మీ నాటి కిట్లు దొరకె
అని మదిఁ దలంచి దాని ఛాయను గ్రహింప
అపుడు హనుమంతుఁ డిట్లని యాత్మఁ దలచె. 74

ఎదురు గాలిలో ఘన నౌక యెట్లు పడునొ
నే నటులె పడి పోయితిన్ వీర్య మేగె
అనుచుఁ బైని క్రిందఁ గనుచు హనుమ యపుడు
జలధిపైకి లేచిన మహా సత్త్వ మరసె. 75

ఆ వికార ముఖము గల యట్టి సత్త్వ
మరసి కపిరాజు సుగ్రీవుఁ డనిన యట్టి
ఛాయ గ్రహియించు నట్టి యా సత్త్వ మిదియొ
తప్పకుండఁ గావలె నని తలఁచె హనుమ. 76

ఆతఁ డా సింహికఁ గని తత్త్వార్థ మెఱిఁగి
వర్షకాలానఁ బెరుగు నబ్దంబు వోలె
గొప్ప కాయము మాని హనుమ యుప్పు డెదుగ
నామె పాతాళ మధ్యఁ బోల్ మోము తెఱచె. 77

అట్లు తెఱచి గర్జించుచు హనుమ పైని
పడఁగ నామె మహాస్యము నోడలు మర్మ
లరసి వజ్రము వంటి దేహంబు గలుగు
హనుమ మేను కుంచించి యయ్యాస్యమునఁ బడియె. 78

ఆమెనోటను బడుచున్న హనుమ నపుడు
సిద్ధ చారణు లచట వీక్షించినారు
పర్వముల రాహుచే మ్రింగఁ బడుచు నున్న
పూర్ణశశివోలె నాకాలమునఁ గరంబు. 79

పిదప నామె మర్మంబులు వీరుఁ డపుడు
వాఁడి గోళ్ళఁతో జీల్చియె వడిగఁ బైకి
నెగిరి దృష్టిచే ధృతిచేత నెంతొ శక్తిఁ
బడగ పైచి వర్ధిల్లెను వడిగ మరల. 80

హనుమ గుండెఁ జీల్చగ నార్తురాలై యఱుగుచు
నీళ్ళఁ బడఁగ సింహికఁ జూచి నింగిఁ దిరుగు
భూతములు పల్కె "భీమ మద్భుతపుఁ గర్మ
జరిపితివి స్వేచ్ఛ శుభమొంద నరిగి రమ్ము. 81

ధృతియు మతిదృష్టి దక్షత యెవరిదరిని
నీదరివలె నుండునో వాఁడు నిరత మెటను
తనదు కర్మల సిద్ధిపొందకయె పోడు
అన గరుడివలె నతఁ డేగె నర్చ లంది. 82

చాలవఱ కేగి యొన్లైదఁ [illegible] బుంచి
వందయోజనముల తుద వనపంక్తిఁ జూచి
అరసె మల యోపవనుల సాగరము తత్ప్ర
* దేశములఁ దరుల్ జలధి పత్నీ ముఖాలు. 83

ఆత్మవంతుఁ డతఁడు మహాబ్ద మట్టు
లలరు తనుఁ జూచి మిన్నును నడ్డ నట్లు
తను దలంచి యాఘనకాయమును జవంబు
కాంచి రాక్షసుల్ నన్ గాంత్రు కౌతుకమున. 84

అని తలఁచి కొండవంటి స్వతనువు ముడిచి
వీతమోహుఁ డాత్మయుతుఁ డట్లింక మరల
ప్రకృతి గని రూపు సంకోచ పఱచె మూఁడు
అడుగుల బలి నడఁచి యాగు హరినిబోలి. 85

వివిధ రమ్య రూపులఁ దాల్చి యవల చివర
జలధితటిఁ జేరి యొపరి కశక్యమైన
రూపు గొని, గొప్పదౌ తగురూపు చూచి
కొనుచు ప్రేలాడు నటులున్న కొండఁ జేరె. 86

వివిధ మగు నద్భుతముల సంపెంగ కొండ
గోగు కొబ్బరి చెట్లతోఁ గూడియున్న
యద్రి శృంగాల ప్రాలి మహాద్రి సముఁడు
లంకగనెఁ గొండ తుది నమరావతి నటు. 87

* జలధి పత్నులు=నదులు.

దాటఁగ రాని సంభ్రమును దాటి మహాబలుఁ డాంజనేయు డ
చ్చోటఁ ద్రికూట శైలమున శోభిలి స్వస్థత లంకఁ గాంచి యా
చోట లతాతరుల్ కురియు చొక్కపుఁ దావులఁ బుష్పవృష్టితో
దీటుగ నిండి పుష్పమయ దేహముతో హనుమంతుఁ డేర్పడెన్. 88

అటు నూఱామడ వాటి యుత్తమబలుండై మీఱి శ్రీమంతుఁడై
ఘటికుండౌ హనుమంతుఁ డుస్పురని యేగ్లానిన్ మదిన్ బొందకే
"యిటె నూఱామడ వార్ధి దాఁక నొక లెక్కే మింక వేయామడల్
త్రుటి లంఘించెద" నంచు నెంచుచు సముద్రున్దాటి లంకన్గనెన్. 89

నీలి పచ్చిక బయు ళ్లొలిఁ దావుల వనుల్
మధ్య బండ లగు ద్రుమాలు దాటి
తరువు లాచ్ఛాదించు గిరి శృంగములు చూచి
పుష్పించు వనరాజిభువులఁ గడచి
వనులఁ బూఁదోటల ననలెత్తు ఖర్జూర
* కర్ణికా రాది వృక్షముల మెలఁగి
విచ్చు సరళ కరవీర సప్తచ్ఛద
ముచుళింద కేతకంబులను తాకి

నీప కోవి దారాసన నీలఫలుల
అప్రియంగు ప్రియాళు రమ్యద్రుమాలు
హంస కారండ వాఢ్య జలాశయముల
సరసి జోత్పల సరసుల నరసె హనుమ. 90

---

* కర్ణికార = కొండగోగు, సరళ = తెల్ల తెగడ చెట్టు, కరవీర = గన్నేరు, సప్తచ్ఛద=ఏడాకులరఁటి, ముచుళింద=నిమ్మ, కేతక=మొగలి, నీప= కడిమి, కోవిదార = రక్త కాంచనము, అసన = వేగిస, ప్రియాళు = మోరటి చెట్టు.

పంకజోత్పలముల పరిఖలతోడుత
వలగొన్న బంగారు ప్రహరితోడ
సీతాపహరణ సుస్థిరుండు రావణు నాజ్ఞ
ధ్వనులొప్పఁ గాచు దైత్యాళితోడ
గ్రహములఁ బోలి శరన్మేఘ నిభ హైమ
భవనాల శ్వేతోర్ధ్వ వథులతోడ
కోటపెన్ బురుజుల నూటితో ధ్వజపతా *
కాళి బంగరు తోరణాళితోడ

దేవపురిఁ బోలి గిరిపైని దీప్తులొలుక
మింటినంటి మింటఁ దేలు మేటి పురము
కరణి, లంకాపురము విశ్వకర్మ రచిత
మధిక రమణీయ శోభల నలరు చుండె, 31

కోట ప్రాకారము మేటి నితంబము
పరిఖాచ్ఛనీరము పట్టుబట్ట
శూలశతఘ్నులు శోభిలు పాపిడుల్
కోటపెన్ బురుజులు కుండళములు,
కైలాస శిఖరము పీఠైన పోలిక
విశ్వకర్మ మనస్సు విజ్ఞ శిల్పి
మిన్నంటు బైకేగు మేటి ప్రాసాదముల్
మింటఁ దేలెడి మబ్బు మేలిమాల

గాగ నాగులతోడ భోగవతి కరణి
రాక్షసులతోడనిండి పూర్వము కుబేర
వాసమున చింత్యమయి గుహన్ బాహుబల్లు
శూల పట్టిస ధరు లొప్ప గ్రాలె లంక. 92

వ. అపుడు హనుమంతుడు లంక యుత్తర ద్వారము చేరె.

ఇంతటి లంకా రక్షణ
యంతటి విపులాంబునిధిని అంతటి రిపు ఘో
రాంతః కరణుని రావణు
స్వాంతమునన్ జింత చేసె హనుమంతుఁ డటన్. 93

ఇటకును వచ్చియు రాముఁడు
వటు బాహాబలుఁ డేమిపని గావించున్
ఇట సామ దాన భేదము
లెటులన్ బనిరావు రణమె యేపని చేయున్. 94

ఇందు మహాత్ములు వాలిజుఁ
డందలి యానీలుఁ డేను నాసుగ్రీవుం
డిందుఁ బ్రవేశింపఁ గల మిఁ
కిందెవరును నడుగు పెట్ట నెటు శక్యంబౌ. 95

సరె పోనీ సీతఁ గనిన
తరువాతనె యామె బ్రదికి తన జీవముతో
వరలెనొ లేదో తెలిసిన
తరువాతనె యటనె యెల్ల దగఁ జింతింతున్. 96

అని కపివరుఁడు ముహూర్తము
మనసునఁ జింతించి రాము మైథిలి క్షేమం
బును తలపోయుచు గిరి శృం
గమునం దాలోచనమును గావించె మదిన్. 97

బలవీర్యాన్వితు లైన రాక్షసులిటుల్ పాలించు నీలంక ని
ట్టుల నీరూపముతోడఁ బోవుటకు నెట్లున్ శక్యమే గాదు దై
త్యులు సుగ్రాజసులౌ మహాబలులు నెంతో వీరులుం గాన సం
ధిల వంచింపవలెన్ విదేహసుత నన్వేషించు కార్యంబులో. 98

కనిపించియుఁ గనిపింపని
యనువున నే రాత్రివేళ నమరులు నసురుల్
చనరాని లంకఁ గృత్యం
బును సాధింప వలయు నని పొంచెఁబోరిఁ దలఁచెన్. 99

ఎటులే నెట్టి యుపాయమేన్ జలిపి దైత్యేంద్రుండు దుష్టుండు ను
ద్భటుఁడౌ రావణు కన్నులం బడక సీతన్ జూతునో యొంటిగా
ఎటులన్ రాముని కార్యమున్ జెడని యట్లే సిద్ధి గాఁబోవు ను
త్కట కార్యంబులు పూర్తిచేయుదునొ గాదా నేను జాగ్రత్తగా. 100

క్రమతన్ జేయని దూతఁబట్టి నెఱవేఱన్ సిద్ధమై యున్న కా
ర్యము లెందున్ తగ దేశకాలములు వీలై యుండమిం జేసి స
ర్వము సూర్యోదయవేళఁ జీకటులటుల్ భ్రష్టంబులై పోవుఁ గా
ర్య మకార్యంబుల మధ్య బుద్ధి స్థిరమే యయ్యున్ ప్రకాశింపదున్. 101

ఇటు మేమే తెలివైన వార మని యెంతే మూర్ఖులై యెంచు చె
న్నటి దూతల్ పడిఁ గార్యముల్ చెఱుపుదుర్ నైపుణ్య మేపార ముం
దటఁ గావించిన కార్యమెట్లు చెడదో తత్కాల వైక్లబ్య మిం
దెటు కాకుండనొ వార్ధిదాటుట వృథాయే కాదొ యత్నించనా. 102

ఇట నేనే గనుకన్ గనంబడినచో నీరావణా నర్థమే
యిటు వాంఛించు కృతాత్మరాముని దియౌ యీకార్యమున్ వ్యర్థమౌ
ఇట నాదైత్యు లెఱుంగకుండ నటు లెట్లే నిందు నిల్చుండఁగా
నెటులన్ గష్టమె, దైత్య రూపమునఁ గాని యింక నేదేననేన్. 103

గాలియుఁ గూడఁ జూడబడకన్ జరియింపఁగ జాల దిందు నే
మూలయుఁ గాని శక్తులగు ముష్కర దైత్యు లెఱుంగరాని దీ
వేళను నింపులే, దిటను స్వీయపు రూపున దాగి యున్న నే
లీలనొ నష్టుఁడౌదు నవలీలఁగ నా ప్రభు కార్యమే చెడున్. 104

కనుకన్ నేనిటు నాదురూపమున నింకన్ రాత్రియే పొట్టివాఁ
డను నై రాముని కార్యసిద్ధి కయి యల్లల్లన్ ప్రవేశింతు, నె
ట్లును వేరున్ జొరరాని రావణుని యీ ప్రోలిన్ తగన్ రాత్రివే
ళనె చొత్తున్ భవనంబులున్ వెదకుచున్ రాట్పుత్రి నీక్షించెదన్. 105

అని యాలోచన చేసి యు న్నె సూర్యాస్తంబుకై వేచి యా
హనుమంతుండట సీతఁ గన్గొనుట కత్యంతోత్సుకుండౌచు నం
తనె సూర్యాస్తమయంబు కాఁగఁ దనువున్ సంకోచముం జేయుచున్
తన యాకారము పిల్లియంతగనె వింతన్ గూర్చె మూర్తంబులో. 106

హనుమంతుండు ప్రదోషమందెగిరి వీర్యంబారఁ దూర్ణంబ ప
త్తనముం జొచ్చియుఁ జక్కదిద్దు సువిభక్తం బైన యారాజ వీ
థిని, ప్రాసాదపు మూలలన్, బసిడిపై దీపించు స్తంభాలఁ జ
క్కని గంధర్వపురాభఁ గాంచన గవాక్షన్ లంకఁ గాంచెన్ వడిన్. 107

స్ఫటికముల్ దాపిన బంగారు పూసిన
యేడెన్మి దంతస్తు లెసగు మేఁడ
లమల సుధాధౌత ప్రకట నిమ్నోన్నత
స్థల విమానాఢ్యమౌ సౌధతతుల
అణిముత్యపు సరు లందమై ప్రేలాడు
వైడూర్య మణి చిత్ర భవనములను
కాంచనమయములై క్రమజాలంబులు
మీఱు రక్షోగ్రగృహ తోరణపులులను

అలర నద్భుతాకారమై తలప రాని
భీమ రాక్షస రక్షణన్ వెలుగుచున్న
రావణ భుజ పాలితమైన లంకఁ జూచి
హనుమ సీతఁ జూడఁగఁ గోరె నలతె ప్రసుక్కె: 108

అపుడు చంద్రుఁ డీతని స్నేహమందివోలె
లలిత నక్షత్రముల మధ్య నలరుచుండె
వెన్నెలల గమి లోకాన విస్తరించి
వేల కిరణాల నావిర్భవించు చుండె. 109

శంఖ సితము క్షీర మృణాళ సరస మగుచు
నుదితమై ప్రకాశించుచు నొప్పుచున్న
శశిని హనుమంతుఁ డంతట సరిగఁ జూచె
సరసిలోఁ దేలియాడు హంసమును బోలె. 110

కని శృంగమ్ములుతేలఁ దేలి తగు మేఘుం బట్టు లందాలు గ్రు
మ్మిన లంబం బను నద్రి నిల్చి ధృతితో మేధావి యైనట్టి యా
హనుమంతుం డట రాత్రివేళ రమణీయుం బైన నీరాలు కా
ననముల్ గల్గిన లంకఁ జొచ్చెను వినూత్నంబైన సత్త్వంబుతో. 111

జలధి సమధ్వనులె గల శరదభ్రాభ
భవనముల నబ్ధి వాయువులు గొల్చు
వరహస్తి చిత్రిత ద్వారతోరణ లంక
సలకను బోలె సైన్యములు గాచు
భోగి రక్షిత గుహ భోగవతివలె లం
క మెఱపు మబ్బు మార్గముల వెలయు
పసిఁడి ప్రాకారము పఱలు లంకను నింద్రు
నమరావతి నటు వాతములువీచు

స్వర్ణ కింకిణీ జాల ఘోషలు తనర్పు
బహు పతాకలు తల లూపుచుండంబు
లంక హనుమంతుడ ధనికరంబు మదిని
నద్భుతముగాక నెంతయో హర్ష మొందెం. 112

బంగారు ద్వారాల వైఢూర్య వేదుల
వజ్ర స్ఫటిక కవాట పంక్తితోడ
మదకుట్టిమంబులం బసిఁడి వెండిగజాల
మెఱయు వైడూర్యపు మెట్లతోడ
* స్ఫటిక మయాంగణ పాంసుల మినుచేరు
నటులున్న నాల్గిండ్ల తటులతోడ *
క్రౌంచ బర్హిణ కూజితాంచిత రాజహం
సల మృదుమధుర స్వనముతోడ

వాద్య భూషణ నిర్ఘోష ఫణితితోడ
పరలోకస్వర్గ సార యున్ వజ్రిపురిని
జాలి మింటిపై నెగురంగఁ బోవు నటుల
నలరు లంక వంక హనుమ యరసి మెచ్చె. 113

అటు లారాక్షస రాజు పట్టనపుఁ గళ్యాణంపు శ్రేష్ఠంబునా
పటువృద్ధిన్ గమనించి మారుతి యిటుల్ స్వాంతంబునం దెంచె ను
ద్భటుఁ డారావణుచేత నాయుధతతిన్ బాలింపఁగాఁబడ్డ యీ
పటులంకన్ మఱి యెవ్వరేని నెదురింప జాల రేరీతిగన్ 114

కుముదుం డంగదుఁడున్ సుషేణుఁడు నెదుర్కోరాని మైందుండు న
త్తమ సుగ్రీవుఁడు నేను నాద్వివిదుఁడున్ తత్క్రతుమాలుండు వి
క్రమ వంతుల్ కుశపర్వణుక్షులును తక్కన్ వేరు దినిన్ ప్రవే
శము గావింపగలేరు గాదె యెటులన్ చక్కంగ వీక్షించినన్. 115

రాము నపక్రమవిక్రమము లక్ష్మణు బాహుబలంబు నెంచుచున్.
ఆమహనీయ బాహువు బలాఢ్యుఁడు నా కపియెంతొ ప్రీతుడై
క్షామమణి ప్రభాఢ్యను, లసద్ధన కోశవతంస; యంత్రతన
ద్ధామ కుచన్ సమృద్ధఁ బ్రమదన్బలెఁ గన్గొని మెచ్చె నెమ్మదిన్. 116

అటులన్ భాసిలు మందిరాల గత గాఢాంధాత్మయౌ పట్టనం
బట వీఁకన్ హనుమంతుఁడున్ జొర స్వకీయంబైన రూపూని యు
త్కట వక్రాననయై కపీంద్రు నెదుటన్ తత్కాలమే లేచి పెన్
కటు ఘోరంబుగ నార్చి లంక యిటు వక్కాణించె నాక్రోశితో. 117

ఎవ్వఁడ వీవొ యేమి పని కిచ్చటకిన్ జనుదెంచినావొ నీ
విప్విధిఁ బ్రాణముల్ మెయి ధరించిన లోపున వాస్తవంబు వా
క్రుప్పుము, నీవు రావణు బలోద్ధతి రక్షిత యైన లంక నీ
వెవ్విధి నేని యిట్లు చొర నెప్పుడశక్యమె యెట్లు చొచ్చితో. 118

అపుడట్టుల్ వచియించి యెట్ట యెదురై యట్లున్న యాలంకిణిన్
విపులాకార, విరూపనేత్ర దనుజన్ వే యాతఁడుం బల్కె నిం
దె పురద్వారము గాయు నీవెవతవో నీవిట్లు నన్నాపి యిం
దిపుడేలా బెదరింతు దారుణ మనం జేపారఁ బాపాత్మవై. 119

వ, అని హనుమంతుండు పల్కంగా విని యాకామరూపి యైన లంకిణి కోపముతో నిట్లు పరుషముగాం బలికెను నే నామహాత్ముండైన రాక్షస రాజు రావణుని యాజ్ఞాను వర్తినిని. ఈ లంకా పురమును రక్షించుదానను నీవు నన్ను తిరస్కరించి నగరముం బ్రవేశింపలేవు. ఇపుడే నాచేం జంపంబడి ప్రాణములు పోవ నిద్రింతువు. నేను లంకానగరికి అధిదేవతను అన్నిపైపుల రక్షించుచున్నాను. ఇది నా సంగతి" అని యాలంకిణి చెప్పంగా విని ఇంకొక పర్వతమువలెం జలింపక స్థిరుండై యుండి మేధావియు సత్త్వవంతుండు నయిన హనుమంతుండు ఆవికృత ముఖిని జూచి యిట్లనియె. కోట బురుజులు ప్రాకార తోరణములు గల యాలంకానగరము చూత మని వచ్చితిని ఇచ్చటి వనములు ఉపవనములు అన్నియెడల నున్న ముఖ్యగృహములను జూచుటకై నాయీ రాక" అని యాతం డనంగా మరల నాలంకిణి యిట్లు చెప్పెను. ఓరీ దుర్బుద్ధీ! వానరాధమ! రాక్షసేశ్వరుండు పాలించెడి యీపురమును నన్ను జయింపక చూడ శక్యముగాదు అని యామె పలుకంగా ఆకపిశార్దూలుండు ఆరాక్షసిని జూచి ఓసీ! భద్రురాలా, నేనీ పురిని చూచి మరల వెళ్ళి నట్లె వచ్చె దను అని హనుమంతుం డనంగా నామె మహాభయంకర నాదము చేసి కొట్టంగా నతండును క్రోధ మూర్ఛితుండై ఎడమ చేతివ్రేళ్ళను సంకోచ పఱచి గుప్పి టితో నామెను కొట్టె ఈమె యాడది అని తలచి యెక్కువ కోప మూనకుండ నామెయు ఆదెబ్బతోనె విహ్వలాంగియై తన వికృతముఖమును జూపుచు వెంటనే భూమిపైని పడంగా ఆమెను చూచి స్త్రీయని యామె యెడ దయ దలంచి యుండ ఆరాక్షసి గద్గద స్వరముతో నెక్కువ యుద్వేగముతో గర్వము వీడి హనుమంతునితో నిట్లనియె.

ఓ మహాబాహూ! వానరశ్రేష్ఠా! సౌమ్య! రక్షింపుము. సత్త్వముగల మహాబలులు ఒక నియమమున నుందురు. నేను లంకానగరిని. నీవు విక్ర మముతో నన్ను గెల్చితివి. ఈ సత్త్వ వాక్యమును వినుము నాకుమున్ను స్వయంభువు వరమిచ్చెను. "ఎప్పుడైతే ఒకానొక వానరుండు విక్రమమున నిన్ను వశపరచుకొనునో అపుడు రాక్షసులకు భయము సంప్రాప్తమైనదని తెలిసికొనుము. నిన్ను జూచుటవల్ల ఆ స్వయంభు వేర్పఱచిన సమయము సత్యమైనది. అది మరియొకరీతిగా జరుగదు. దురాత్ముండైన రాక్షసరాజు

రావణునికి సర్వరాక్షసులకు సీతానిమిత్తమున నాశము సంప్రాప్తించినది. కనుక నీవు రావణపాలితమగు నీనగరిని ప్రవేశించి నీకిష్టమైన సర్వ కార్యములు నెఱవేర్చుము. శాపముచే నుపహతమైన యీ శుభపురమును ప్రవేశించి నీయిచ్ఛ ప్రకారముగ సాధ్వియగు సీతను అంతటను హాయిగా అన్వేషింపుము అని"

* సత మారీతిగఁ గాను రూప యయి రక్షాదక్షయౌ లంకిణిన్
అతి తేజుండగు వాయుజుండు భుజవీర్యం బొప్ప నోడించి స
న్మతితో ద్వారము గుండఁగాక విలసత్ప్రాకారమున్ దాటుచున్
జతురుండై రిపు పత్తిపై నెడమ కాల్ చల్లంగ నుంచెన్ వడిన్. 141

నిశయుం దాపురిఁ జొచ్చి సత్త్వమున, నెంతే పూవులున్ ముత్తియం
పు సరుల్ దిద్దిన రాజవీధి నరసెన్; జొత్తైన యాలంకలో
హసి తోత్కృష్ట నినాదముల్ విపుల తూర్యధ్వానముల్ భీకరాం
కుశ వజ్ర ధ్వని శ్రేష్ఠ గేహములు వెల్గున్ మింటి మేఘాలటుల్. 142

* కమల స్వస్తిక వర్ధమాన దను జాగా రావళుల్ శారదా
భ్రములో యున్నటు చిత్రమాల్యములఁ జిత్రం బొచుఁ గన్పట్టు స్వాం
తమునం దచ్చెరు వొందుచున్ హనుమ, సీతాన్వేష ణోత్సాహియై
స్వమనంబందుఁ బ్రహర్ష మొంది కనె నిశ్శంకన్ లంక శ్రీమంతుఁడై. 143

ఒకభవనమునుండి మఱిం
కొక భవనమునకు నరుగుచు నొకొక్కచోఁ బల్
రకముల రూపంబులు గల
రకరకపు భవనపు లాస్థలంబులఁ గనియెన్. 144

---

* పద్యములో 'స' బీజాక్షరము. శత్రు నగరమును ద్వారముగుండ ప్రవేశింపరాదు అని నీతి. శత్రు నగరిని ఎడమ కాలుంచి ప్రవేశింపవలె నని బృహస్పతి. కమలాద్యాకార గృహములు.

ఉరము కంఠము శిరసులనుండి వెలువడు
మంద్ర మధ్య తార స్వర మధుర గీతు
లప్సరసల ముఖమునుండి యట్టు లచటి
ఘన మద స్త్రీలనుండియు వినియె హనుమ. 145

ఒకెడ హనుమ వినె నురుకాంచి నూపుర
ధ్వని యూథ్యుల గృహ సోపాన రవము
ఒకెడ రాక్షసు లిండ్ల నురుబాహుల చఱపుల్
ఘన దైత్య సింహగర్జనలు వినియెం
ఒకెడ రాక్షసు లిండ్లనుండి జపించు మం
త్రములు స్వాధ్యాయ ఘోషములు వినియె
ఒకెడ రావణు మెచ్చి యురు గర్జనలు చేయు
దైత్యుల భీకర ధ్వనులు వినియె

రాజపథ మావరించిన రాక్షసాళి
నగర మధ్యస్థ సేనల నడుమ నున్న
గూఢ చారుల నందఱఁ గూడ నొకెడఁ
జూచె హనుమంతు డాలంకఁ జూచువేళ. 148

దీక్షతో జటిలులై తిన్నగ బోడులై
వృషభ చర్మము దాల్చి వెలయు వారి
కుశల గుప్పిడు లగ్ని కుండము లాయుధ
ములు ధరించియు పొలుచువారి
దండ ముద్గర కూట ధరులైన వారిని
ఒంటి కన్నొక చెవె యున్నవారి
వ్రేలాడు పొట్టలున్ బాలిండ్లఁ గలవారి
వికట కరాళుల వింతవారి.

బిట్టువంగు ఘోషములవారి, పొట్టివారి
అసిధరుల, ధన్వుల శతఘ్ని ముసలధరుల,
పరిఘ హస్తులను కవచధరుల ధ్వజుల
ఘన పతాకా ధరులఁ జూచె హనుమ యపుడు. 14,

అతి లావులేని వారల
అతి చిక్కిక యున్నవారి, నతి మరుగుజ్జున్
అతి పొడు గతిపొట్టి పొడుగు
నతి దెలుపతి నల్పు కాని యసురులఁ గాంచెన్. 148

వికృతాకారుల రమ్యరూపులను పల్వింతైన యాకారులన్
ఇఁక సద్వర్చసులన్ మహాంగుల మహావృక్షాశని క్షేపణీ
వికిర త్పట్టిస శక్తిపాశులను స్వగ్విశ్రేష్ఠ భూతాంగులన్
ప్రకృత స్వైర గతి ప్రకాశులఁ గనెన్ నానావేష లేపాంగులన్. 149

వరశూలంబులు వజ్రముల్ కరములం బాటించి నేల్వందలై
పురిలో నంతిపురంబు చుట్టును గరంబున్ శ్రద్ధతో రాక్షసే
శ్వరునాజ్ఞన్ శిరసావహించి పహరా జాగ్రత్తగా వేయు దు
ష్కర దైత్యాళులఁ దేఱిపాఱఁగనె శీఘ్రుం బాంజనేయుఁ డటన్. 121

గిరిపైని సౌవర్ణ వర తోరణములతో
వరలు రావణు ఖ్యాత భవన మరసి
తామర పూవులఁ దనరు పరిఖలతో
మీఱు రావణుని ప్రాకార మేగి
దివ్య నాకముబోలి భవ్య నాదములతోఁ
దగు హయ కరు లొప్పు ద్వారమేగి

పాండుర స్వచ్ఛ మేఘాల పటలి వంటి
ద్విరదములతోఁ జతుర్దంత కరుల మించి
మత్త మృగపక్షి చిత్రమై మహిత వీర
రాక్షసులు గాచు రావణాలయముఁ జొచ్చె. 122

గనుల జంబూనదిని బుట్టు కాంచనంపుఁ
బ్రహరి పటలి యమూల్య హారములతోడ
పరిగఁ దీర్చికాలాగురు చందనములఁ
బూయఁబడిన రావణునంతిపురముఁ జొచ్చె. 123

## —: చంద్ర వర్ణన :—

విమలాకాశము నడుమన్
అమలపు వెన్నెలలఁ గ్రక్కు నా శశి నడుమన్
అమలిన గోశాల నడుమ
ప్రమత్త వృషభము నటుగనెఁ బావని నడుమన్, * 124

జనముల పాప మణఁచుచున్
వనధి తరంగములు పొంగి పడునటు గనుచున్
ఘన భూతములఁ దెలుపుచున్
తనయెదుటను నగపడె శశి దివిఁజనుచున్. 125

* వివ: నడుమ= నడుమరాత్రి సమయమున.

భువి-శ్రీ-మందర మందున్
అవలఁ బ్రదోషంపువేళ నంబుధి యందున్
అవిరళ జలాబ్జ మందున్
దివిపై సొప్పారఁ జూచెఁ దెలిశశి యందున్. 126

మెఱయు హంసము వెండి పంజరమునందు
మెఱయు హరి మందరగిరి కందరమునందు
మెఱయు వీరుఁడు మత్తకుంజరమునందు
మెఱసెఁ జంద్రుఁడు నీలి యంబరమునందు. 127

వఱలు వృషము శృంగములన్
వఱలును శ్వేతాద్రి యుచ్చ వరశృంగములన్
వఱలుఁ గరి పొను శృంగములన్
వఱలెఁ జంద్రుఁడు పూర్ణ పదశృంగములన్. 128

భ్రష్ట శీతజల తుషార పంకుఁ డగుచు
భానుకిరణ గ్రహణ నష్ట పంకుఁ డగుచు
అమల తేజోద్యుతిని నిర్మలాంకుఁ డగుచు
అయి శశాంకుఁడు మెఱసె శుద్ధాంకుఁ డగుచు. 129

ఎంతొ గొప్ప శిలఁగని మృగేంద్రుఁ డట్లు
ఎంతొ గొప్ప వనిఁగని గజేంద్రుఁ డట్లు
ఎంతొ గొప్ప రాజ్యమున రాజేంద్రుఁ డట్లు
ఎంతొ గొప్పగ తగె నోషధీంద్రు, డట్లు. 130

---

వివ:- హరి=సింహము, శృంగము=శిఖరము, దంతము రశ్మి
పొను=పొన్ను బంగారము.

తొరగ శశిరాగఁ జీఁకటి దోషమరిగె
దుష్ట దైత్యుల సంచార దోషమరిగె
తొయ్యలుల విభుల్ విడఁ జిత్తదోష మరిగె
తొరగ శ్రీల స్వర్గమయి ప్రదోష మరిగె. 131

వీణరవము శ్రావ్యముగఁ బ్రవృత్తమయ్యె
విభుల యింతుల నిద్ర ప్రవృత్తమయ్యె
వేగ దనుజ రక్షణలు ప్రవృత్తమయ్యె
విస్మయంబు రౌద్రంబు ప్రవృత్తమయ్యె. 132

కూడి కపి కన నిటు దైత్యకులములయ్యె
అలరె మత్తప్రమత్త సంకులములయ్యె
వెలయు రథ హయ పీఠ సంకులములయ్యె
వీరలక్ష్మి వేడుకల వ్యాకులములయ్యె. 133

వ. అపుడు రాక్షసులు

అతిగా నొండొరు నాక్షేపింతురు
ప్రతి బలియు భుజము ప్రక్షేపింతురు
వృత మత్తోక్తుల విక్షేపింతురు
ధృత సమరాస్త్ర మధిక్షేపింతురు. 134

ప్రక్షేప పఱచెదరు రాక్షసులు పక్షముల
విక్షేపపఱచెదరు వెస నొడలు సతులపై
విక్షేపపఱచెదరు వివిధ రూపంబుల
ప్రక్షేపపఱచెదరు ప్రకటమౌ చాపముల. 135

---

వివ:- బలియు = బలిసిన.

గంప మలందికొను కాంతలం గొందఱ
అందును నిద్దుర నందెడి కొందఱ
నందపు మోముల నవ్వెడి కొందఱ
అందెగనె నలుక నార్చెడి కొందఱ. 136

ఎలరారె నచ్చోటు లేపారు కరులతో
ఎలరారె నచ్చోట నింక బూజ్య ఘనులతో
ఎలరారె నచ్చోట నిలనూర్చు బలులతో
ఎలరారె నట ప్రహదము నిట గొప్ప ఘనులతో. 137

మతిన్ ప్రబధానులన్ మధురాభిధానులన్
అతి ప్రధానులన్ నవతా ప్రధానులన్
మతిన్ విధానులన్ మహితాభిధానులన్
గతిన్ ప్రధానులన్ కనె యాతుధానులన్. 138

కనెన్ సురూపులన్ కరుణ స్వరూపులన్
ఘన స్వరూపులన్ కఠిన స్వరూపులన్
కనెన్ విరూపులన్ కటుతానురూపులన్
మనోనురూపులన్ మహితానురూపులన్. 139

హనుమంతుండు గనె నర్హసుభావల
దనుజుల కాంతలం దళదను భావల
ఘనపాన నిరత కనదురు భావల
వినమిత తారా విమల విభావల. 140

---

వివ: నందము=సుఖము.

వివ: యాతుధానుల=రాక్షసులను.

లలిత శ్రీయుత లజ్జా శిష్టల
లలిత నిశీథిని రమణాశ్లిష్టల
లలిఁగనె మారుతి ప్రమదాశ్లిష్టల
అలరుల గ్రమ్మ విహగులటు శ్లిష్టల. 141

చనెన్ గనెన్ నిశన్ స్వగృహోపవిష్టలన్
మనః ప్రీతి మోహులన్ మదనాభివిష్టలన్
విస్రమ మంత్రులన్ వినయోపవిష్టలన్
మన ప్రవిష్టలన్ స్వసుఖోపవిష్టలన్. 142

అమందోత్కృష్ట హైమ సువర్ణల
ప్రవిమల దేహల స్వర్ణ సువర్ణల
స్వాదిరహితత్రుల శశి సమవర్ణల
అలఁ గనెఁ గపి మనోహర వర్ణల. 143

శుచి ప్రియాత్మలన్ సుమనోభిరామలన్
వచోభిరామలన్ వరదేహరామలన్
కలాభిరామలన్ కనకాభిరామలన్
శుచౌ కపి కనెన్ శుభాభి రామలన్. 144

శశి ప్రకాశలన్ సరసాస్య మాలలన్
అసమాక్షి పక్ష్మల న్నవలోక మాలలన్
వెసన్ సుభూషలన్ విధి రమ్య శీలలన్
ఎసన్ గనెన్ శతహ్రదతుల్య మాలలన్. 145

---

వి.స: లలి=వేడుకతో; ప్రమద=సంతోషముచే; శ్లిష్టల=కలిసిన.

కనండటన్ పురిన్ ఘనవంశ జాతన్
మనోభి సంస్కృతం బరమాభిజాతన్
తనూ వికాసితన్ లతికా సుజాతన్
సునవ్యభావితన్ శుభశీల సీతన్. 146

ప్రాచీన పంథలోఁ బరమ ప్రవిష్టను
రామదర్శన మహాకామహృష్టఁ
బతిమనశ్శ్రీకర భావప్రవిష్టను
సర్వ సాధ్వులలోను సద్విశిష్ట
నురుదుఃఖయుత సంతతోష్ణాశ్రు కంఠిని
నమలోత్త మానర్ఘ హార కంఠి
నతిసక్ర పక్ష్మను నభిరక్త కంఠిని
నిజనృత్త నూతన నీలకంఠి

సంతతావ్యక్త రేఖను చంద్రరేఖఁ
బృథివి పాంసూప్త రేఖను హేమరేఖఁ
క్షతనిరూఢాస్త్ర రేఖను గంధరేఖ
రాము సఖిఁ జూడఁ డనిలచలాభ్రరేఖ. 147

కనక హనుమంతుఁ డా సీత జనక తనయ
రామజనపతి ప్రియు సక్రాంత వినయ
నన్నియెడల వెదకుచు నధిక సునయు
డెంతొ మనసున దుఃఖించెఁ జింత యెనయ.   148

అతఁడా వేశ్మలలో విమానములలో నాసీత నీక్షింపమిన్
మతి శోకించుచుఁ గామరూపధరుఁడై మౌనంబుతో సుల్వగా
మతి పుంతుండయి లక్ష్మివంతుఁడు హనూమంతుండు దైత్యేంద్రుక
ప్రమదాగారముఁ జొచ్చె సూర్యరుచిరప్రాకార దుర్వారమున్. 149

చెంత నడపి కాచు సింహంబులో యనఁ
గడు ఘోరరాక్షసుల్ గాచుచుండ
రజత నిర్మిత హేమరచిత తోరణములఁ
జిత్రకక్ష్యల ద్వారసీమ లలర
కరులెక్కి మంత్రులు ఘనశూరులును చేర
రథముల లాగు గుఱ్ఱాలు పఱల
పులుల సింహములతోళ్ళలర దంతపు వెండి
బంగారు రథములు వాగి తిరుగ

బహుళ రత్న సంకీర్ణమై భాజనముల
నుత్తమాసనములఁ జూడ నొప్పియున్న
వేలకొలది పక్షిమృగాల వినుతి కెక్క
రావణు భవన మరసె నాప్లవగవరుఁడు 150

ఒకచో రక్షకులైన రాక్షసులు నెంతో శ్రద్ధ రక్షింత్రు వే
రొకచో నుత్తమ ముఖ్య కాంతలు కరంబుత్సాహలై కొల్తు రిం
కొకచో భూషణ ఘోషలన్ జలధుల ట్లొప్పారి మ్రోగు వే
ఱొకచోఁ జందనధూపితాగురులచే నుప్పొంగుఁ బ్రాసాదముల్. 151

వ. ఇట్లు సింహంబులచే మహావనంబువలె మహాజనులచే సంకీర్ణమయి భేరీమృదంగ శంఖ ఘోషలతోడనిండి, సంతతము రాక్షసులచే నర్చితమై పర్వదినములందు హోమములు చేయఁబడుచు పూజితమై సముద్రమువోలె గంభీరము నిశ్శబ్దమునయి మహారత్నములచేఁ గప్పంబడి యున్న యొక మహావిభుని భవనంబును హనుమంతుఁడు చూచెను. అది గజాశ్వరథములచే సంకులంబయి శరీరము దాల్చి విరాజిల్లుచుండెను. అది లంకకే యాభరణమని హనుమంతుఁడు తలచెను. అట్టి రావణుని గృహ సమీపంబునఁ గల గృహము నుండి గృహంబునకును ఉద్యానములకుం జని నిర్భయముగా వీక్షించుచు నచటి ప్రాసాదములందును సంచరించెను. పిదప మహావేగుడయి యొగిరి

హస్తుని నివేశమును అటనుండి మహాపార్శ్వనివేశమును పరికించి, అట
ండి మేఘము వంటి కుంభకర్ణుని భవనంబును, విభీషణుని గృహమును అట
ండి మహోదరవిరూపాక్షుల గృహంబులం జూచి అవల విద్యుజ్జిహ్వ విద్యు
న్మాలి వజ్రదంష్ట్రుల గృహంబులఁ బరీక్షించి పిదప మహాతేజుఁడయి శుకుని
గృహమును ధీమంతుడైన సారణుని గృహమును తరువాత నింద్రజిత్తు భవన
మును వీక్షించెను. అట నుండి జంబుమాలి సుమాలిరశ్మికేతు సూర్యశత్రుల
గృహములఁ గనుగొని యటనుండి ధూమ్రగిరి వజ్రకాయుని, ధూమ్రాక్షుని,
సంపాతి భవనములను హనుమంతుడు చూచెను. తరువాత విద్యుద్రూప భీమఘన
ఘన శుక నాస వక్రశఠ వికటబ్రహ్మకర్ణ దంష్ట్రరోమశుల గృహంబులును,
యుద్ధోన్మత్తమత్త ధ్వజగ్రీవనాది విద్యుజ్జిహ్వేంద్రజిహ్వుల గేహంబులును,
హస్తిముఖ కరాళపిశాచ శోణితాక్షుల గృహములను జూచి దాటుచు ఆయా
మహార్హంబులయిన గృహంబులందలి సంపదలను జూచుచు లక్ష్మీవంతుఁడైన
హనుమంతుడు వానినన్నిటికిని అతిక్రమించి రాక్షసేంద్రుని నివాసంబునకు
వచ్చి రావణుని పిదప పరుసగా నిద్రించు వికృతేక్షణలగు రాక్షస స్త్రీలు
శూలముద్గరములను శక్తి తోమరములను ధరించి యుండఁజూచెను. 152

అటఁ దెల్పై మొలువై మహాజవముతో సల్లాడు గుఱ్ఱంబులం
బటు రూపంబులు నన్యహస్తి జయులౌ మత్తేభముల్, మవ్వ ముం
దట సైరావతమా యనన్ రణములో దర్పించి విద్వేషి యు
త్కట సైన్యంబులఁ జంపు వారణములన్ గాంచెం గరం బచ్చటన్. 153

కురియుం గాచ్చైన మబ్బులో యనఁ గడున్ ఘోషాలఁ బాటించు నా
గిరులో నా, జలవంబుల ఝుఱుముచున్ గ్రేళ్ళుబ్బి యుద్ధంబులన్
బర సైన్యంబులఁ జిత్తుచేయుకరులన్, బంగారు జాలాల భా
స్వరమౌటన్ దరుణార్కుఁబోల్ దనుజరాట్సైన్యంబులన్ గన్గొనెన్. 154

వివిధాకారముసైన పల్లకిలన్ బెంపౌ లతా గేహముల్
వివిధారామములన్ విలాస గృహముల్ క్రీడాగృహంబుల్ రతీ
భవనంబుల్ ధ్వజ యష్టులన్ శిఖుల యావాసంబున్ చాలఁ ద
ద్భవనంబున గాంచె మంచి శీర్ణమైన నిధులన్ భూతేశు వేశ్మన్ బలెన్. 155

ప్రహస్తుని నివేశమును అటనుండి మహాపార్శ్వనివేశమును పరికించి, అట నుండి మేఘము వంటి కుంభకర్ణుని భవనంబును, విభీషణుని గృహమును అట నుండి మహోదరవిరూపాక్షుల గృహంబులం జూచి అవల విద్యుజ్జిహ్వ విద్యున్మాలి వజ్రదంష్ట్రుల గృహంబులఁ బరిక్షించి పిదప మహాతేజుఁడయి శుకుని గృహమును ధీమంతుడైన సారణుని గృహమును తరువాత నింద్రజిత్తు భవనమును వీక్షించెను. అట నుండి జంబుమాలి సుమాలిరశ్మికేతు సూర్యశత్రుల గృహములఁ గనుగొని యటనుండి యెగిరి వజ్రకాయుని, ధూమ్రాక్షుని, సంపాతి భవనములను మారుతి చూచెను. తరువాత విద్యుద్రూప భీమఘన విఘన శుక నాస వక్ర శఠ వికటబ్రహ్మకర్ణ దంష్ట్రరోమశుల గృహంబులును, యుద్ధోన్మత్తమత్త ధ్వజగ్రీవనాది విద్యుజ్జిహ్వేంద్రజిహ్వుల గేహంబులును, హస్తిముఖ కరాళపిశాచ శోణితాక్షుల గృహములను జూచి దాటుచు ఆయా మహార్హంబులయిన గృహంబులందలి సంపదలను జూచుచు లక్ష్మీవంతుఁడైన హనుమంతుడు వానినన్నిటికిని అతిక్రమించి రాక్షసేంద్రుని నివాసంబునకు వచ్చి రావణుని పిదప వరుసగా నిద్రించు వికృతేక్షణలగు రాక్షస స్త్రీలు శూలముద్గరములను శక్తి తోమరములను ధరించి యుండఁజూచెను. 152

అటఁ దెల్లై రాయిపై మహాజవముతో సల్లాడు గుఱ్ఱంబులం
బటు రూపంబున నన్యహస్తిజయులౌ మత్తేభముల్, మప్పు ముం
దట శైలాకృతమో ఘనస్ రణములో దర్పించి విద్వేషి యు
త్కట సైన్యంబులఁ జంపు వారణములన్ గాంచెం గరం బచ్చటన్. 153

కురిసెం బొల్చెడి మబ్బులో యనఁ గడున్ ఘోషాలఁ బాటించు నా
గరులో నా, జలదంబుల ట్లుఱుముచున్ గ్రేళ్ళుబ్బి యుద్ధంబులన్
బర సైన్యంబులఁ జిత్తుసేయుకరులన్, బంగారు జాలాల భా
స్వరమౌచున్ దరుణార్కుఁబోల్ దనుజరాట్సైన్యంబులన్ గన్గొనెన్. 154

వివిధాకారములైన పల్లకిలన్ బెంపొందు లతా గేహముల్
వివిధారామములన్ విలాస గృహముల్ క్రీడాగృహంబుల్ రతీ
భవనంబుల్ ధ్వజయష్టులన్ శిఖుల యావాసంబుల్ చాలఁ ద
ద్భవుఁడై గాంచెన్ మఱి కీర్ణమైన నిధులన్ భూతేశు వేశ్మన్ బలెన్. 155

రావణు తేజుచే రత్నాల ద్యుతులచే
కిరణాల సూర్యుని కరణిఁ దనరి
బంగారు పాన్పులన్ భాజనంబులచేత
నాసనంబులచేత నలరుచుండి
మధు మద్యములఁ దడ్సి మణి భోజనము లొప్ప
వర కుబేర గృహము కరణి వరలి
కాంచి నూపుర మృదంగముల మహాఘోష
ములచేతఁ గడు మారు మ్రోగుచుండి

పెక్కు ప్రాసాదములచేత వెలయుచుండి
భామినీ రత్న శతములన్ వ్యాప్త మగుచు
కక్ష్యలను నిండు రావణాగార మెల్ల
చూచి హనుమంతుఁడును దానిఁ జొచ్చి వడిగ. 156

కపియుం గాంచెను గేహజాలము గరుడపచ్చల స్వర్ణ జాలము
వర్ష కాలపు మేఘజాలము వలెను వైద్యుత విహగ జాలము
వివిధ వాస పురమ్యశాలలు విశద శంక సుశస్త్ర శాలలు
రమ్య చిత్ర మహావిశాలలు ప్రథిత మందిర చంద్ర శాలలు. 157

తర్వాతఁ గపి చూచె ధన విరాజితములు
పుణ్య దేవాసుర పూజితములు
సకలదోషములచే సతత వర్జితములు
నావాసములు స్వబలార్జితములు
అవ్వల కపికనె నతి సమాహితములు
నెఱి మయుచేబలె నిర్మితములు
ధరలోపల సమస్త వర గుణోచితములు
రావణ పరివార రాజితములు

ఆపగిదిఁ జూచె ఘన మేఘ రూపహితము
లోక దృశ్య కాంచన చారు రూప కృతము
రుచిరమ్ము రాక్షస బలానురూప నుతము
శ్రుత భవనము ప్రతి రూప రూప సితము. 158

వివః- భవనము=పుష్పకవిమానమని వ్యాఖ్య.

క్షితిని స్వర్ణమువలెఁ బ్రకీర్ణ మగుచు
కేవలము శ్రీలచే రత్న కీర్ణ మగుచు
క్షితి రుహాల పూలను నవకీర్ణ మగుచు
గిరితుద వలె నుండె రజోవకీర్ణ మగుచుః 159

మానినులచేతవలె దీప్యమాన మగుచు
మబ్బు మెఱుపులచేవలె నర్చ్యమాన మగుచు
మహిత హంసలబలె వాహ్య మాన మగుచు
తాను మింటను నొప్పె విమాన మగుచు 160

చెలఁగి గిరి తుద బహుధాతు చిత్ర మట్లు
చెంది నభమును గ్రహచంద్ర చిత్ర మట్లు
చేరి కనె రాశి యగు మేఘచిత్ర మట్లు
చెలఁగెను విమాన మతిరత్న చిత్ర మట్లు. 161

భువులు పర్వత రాజిచేఁ బూర్ణ మయ్యె
భూధరములు వృక్ష వితాన పూర్ణ మయ్యె
భూగుహములు పుష్ప విమాన పూర్ణ మయ్యె
పుష్పములును సుకేస రంబు లయ్యె. 162

రచిత వేశ్మముల్ కడుఁ బాండురంబు లయ్యె
ప్రకట పుష్పాలు రస పుష్కలంబులయ్యె
ఘన సరోజములు సుకేసరంబులయ్యె
రమ్యవనములు కడు భాసురంబులయ్యె. 163

మహిత 'పుష్పక' మని భ్రాజ మాన మగుచు
మాన్య రత్న ప్రభా వివర్ధ మాన మగుచు
మహిత స్పృహణీయతో సుచ్ఛ మాన మగుచు
మనసు కనరొప్పెను మహా విమాన మగుచు 164

ఎలమి వైడూర్య మయమై విహంగమములు
అమరె రజత ప్రవాళ విహంగమములు
వరగెఁ జిత్ర వసువుల భుజంగమములు
ప్రాలె హరిగ శుభాంగ తురంగ మములు. 165

పసిఁడి పగడపు పుష్పా ల పుష్పములుగ
బాగుగా వంచి వంకర పక్షములుగ
ప్రకట రాముని ప్రత్యక్ష పక్షములుగ
పక్షులు సుముఖ మయ్యె సత్పక్షములుగ. 166

అమరుపఁబడె గరేణువు లమలహస్త
లమరె గేసరోత్పల పత్ర విమలహస్త
అమరుపఁబడె దేవియు లక్ష్మి యుభయహస్త
అందముగ నుండె పద్ముల నబ్జహస్త 167

మరల నిటుచేరి రావణుమందిరంబు
క్షితిధరమది సుందర కందరంబు
హెచ్చె సురభిళ రుచి యుత సుందరంబు
ప్రకట చిత్ర విచిత్రతా బంధురంబు. 168

లంకను గన్గొని రావణ పాలిత
ఇంకను వెదకి ను ధృతి జన పూజితఁ
గొంకక చని గనుగొనక సమర్చిత
శంకను వగచెను జనకజ దుఃఖిత. 169

అతఁ డామందిర మధ్యమందు మణి వజ్రాలంకృతం బై సుని
ర్మిత జాంబూనద జాల కృత్రిమ పశు శ్రేణీవిహంగాది చి
త్రితమౌ నొక్క విమానమున్ రవిపథిన్ శ్రీవిశ్వ నిర్మాత చేఁ
గృతమై సుప్రతిమైన దాని దివి యుందే చూచె సల్లక్ష్మగా. 170

అటఁ జేయుంబడ నట్టి దేదియును లేదందున్ మహారత్న సం
ఘటితంబై రచితంబు గాని దెదియున్ గాన్పింప, దందున్న యు
త్కట మైనట్టి విశేషముల్ దివమునందైనన్ గనన్ రావ, యందున్నవో
పటువై గొప్పవి కాని వెవ్వియయినన్ బ్రాప్తింప వెందెంచినన్. 171

అది తపోవీర్యాల నార్జితం బైనదై
చిత్ర సంకల్పిత స్థితులఁ దిరుగు
బహు సన్నివేశ విభాగ నిర్మిత మౌచు
సవిశేష తుల్య దర్శనము గలది
మనసు చెప్పిన రీతి ఘన వేగమునఁ బోవు
కవియ రానట్టి వాయు జవము గలది
ఘన సంపదలఁ గూర్చుకర్మలు గావించు
ప్రథిత మతుల మహాత్ముల వాస భూమి

అఖిల సంస్థా విశేష సమంచితంబు
వివిధ చిత్ర శృంగాలచే విపుల గిరియు
పోలె వివిధ సీమల చేతఁ బూజితంబు
శారదేందు నిర్మలము సుస్వాంత హితము 172

మోములందుఁ గుండలములు పొలుపు లీన
వ్యోమ చర నిశాచరుల ప్రపుష్ట తనులు
సమర నణఁగు గుండ్రని కండ్ల నలరి జనము
తనరు వేల భూతాల్ మీఱి దాని మోయు. 173

[illegible] పుష్పపు రాశివలె వెలింగె
[illegible] కంటె సుందరము నగుచు
[illegible] త్తమంబైన పుష్పక విమాన
[illegible] హనుమంతుఁ డపు డచ్చెరువు తోడ. 174

[illegible] శ్రేష్ఠంబయిన పుష్పక విమానమునకు మధ్య ఒక విశాల [illegible] కలదు. అది అఱ యామడ వెడల్పు ఒక యామడపొడుగుగల్గి [illegible]ది. అందు చాల ప్రాసాదములు ఉన్నవి. ఆయత లోచన యగు [illegible] వెదకుచున్న శత్రు సూదనుఁడైన హనుమంతు డక్కడ అన్ని [illegible] తిరుగుచు రాక్షసేంద్రుని నివేశమును చేరెను. 175

[illegible] మూఁడును నాల్గు చండ దంతము లొప్పు
గజము లాయుధ ధరుల్ గాచుచున్న
[illegible] రాక్షస ప్రమదలున్, బల్మిఁ దేఁ
బడిన రాట్కన్యలున్ వఱలి యున్న
[illegible] తిమింగిల మత్స్య నక్రోరగ
ప్రతతి నిండిన వార్ధి వలెను నున్న
[illegible] సురేంద్ర బహు వైభము లక్ష్మి
యమ వరుణుల లక్ష్మి యమరియున్న

[illegible] రాక్షస లిండ్ల మించియుండి
[illegible] హర్మ్యము మధ్య సలుపఁ బడిన
[illegible] నిటునటు మసలుచున్న
[illegible] భవనంబు హనుమ యరసె 176

[illegible] విశ్వకర్మ విశ్వ ప్రయత్న
[illegible] సమస్త రత్నాదికముల
[illegible] పుష్పక విమాన మా కుబేరు
[illegible] తపము చేయగ మెచ్చి యిచ్చె విధాత. 177

తన యోజను చేతఁ గుబే
రుని గెలిచియె రావణుండు లోఁగొనె దానిన్
నును వెండి బంగరు వృకము
లను దగి రావణుని సౌధరాజము వెలసెన్. 178

ప. ఆ సౌధము జ్వాల నార్కొని బోలినదై విశ్వ కర్మచే హేమ సోపానముల తోడను బంగరు లేడుల తోడను రచితమైన కనక స్ఫటిక జాల వాతాయనము గలిగి ఇంద్ర నీల మహానీల మణుల యరుగులు గలిగి రంగురంగుల పగడములు విలువైన మణులు దాపించి ముత్యాల జాలరులుకట్టి బంగారువంటి ఎఱ్ఱ చందనంబు పూసి కూర్చుబడియుండెను.

అప్పుడు వివిధాకారములు గల కూటాగారములచేత నలంకృతమై యున్న ఆ పుష్పక విమానమును ఆ హనుమంతుఁడెక్కి యందున్న పాన భక్ష్యాన్నముల నుండి వెడలు సుగంధమును మూర్తిదాల్చిన మారుతము వలె ఆఘ్రాణించెను. ఉత్తమబంధువువలె అగంధము రావణునిదరికిరమ్మని పిలుచు చున్నట్లుండెను. పిదప అతడు బయలు వెడలి రావణుని మనస్సున కిష్టమైన పరకాంతను బలె నున్న యొకశాలను జూచెను. 179

మణుల మెట్టులను హైమపు జాలములచేత
స్ఫటిక దంతముల చప్టాలఁ దనరి
పవడాల ముత్యాల బంగారు వెండివౌ
మణుల స్తంభంబుల మహిత మగుచు
ఋజువైన తిన్నని యెత్తైన స్తంభాల
ఱెక్కల నెగిరెడి చక్కఁదనరి
గిరి వార్ధి నది ముఖ స్థితి లక్షణాంకయౌ
కెంపుఁ గంబళిచే వికీర్ణ మగుచు

సరస పక్షి ధ్వనుల ధూప సౌరభముల
విలువ గల యాస్తరణముల వెలయుచుండి
సుమ విచిత్రమై హంసలన్ శుక్ల మగుచు
సురల గవి వోలె శ్రీలను గురిసె శాల. 180

ఈలాగున రావణుచే
పాలిత మగునట్టి శాల పంచేంద్రియముల్
ఈ లోకులఁ దృప్తి పఱచె
నేలాగున తల్లి సుతుని తృప్తు నొనర్చున్. 181

మది కాహ్లాదము గూర్చుచున్ రకరకంబౌ రంగు లేర్పర్చుచున్
వ్యథ పోఁగొట్టుచు శ్రీలఁ దీర్చునదియో యన్నట్టు లింపారె; ని
య్యది స్వర్లోకము స్వర్గమో మఘవు రమ్యంబైన పట్నంబొ యి
య్యది సిద్ధాత్ముల సిద్ధియో యని మనంబం దెంచె నాతం డటన్. 182

పెద్ద జూదర్ల వల్లను పెద్దజూద
మందు నోడింపఁబడి చేష్ట లడఁగి యున్న
జూదరులువోలె నచ్చోటఁ జొచ్చి పసిఁడి
దీపములు ధ్యానమందున్న తీరు తోఁచె. 183

దీపకాంతిచే రావణు తేజు చేత
నగల యర్చిచే శాల దగ్ధగఁ దలంచె
బహు విధాంబరములను గంబళులనుండి
వివిధ భూషలు గల స్త్రీల వేలఁ జూచె. 184

వ. అప్పు డా ప్రమదలు

నిశఁ ద్రాగి విహరించి నిద్రకు వశమయి
యర్ధరాత్రిని బల్మి నణఁగి పడిరి
పడి సోల భూషణ ధ్వనిలేక- కూయని
భ్రమర హంసల పద్మవనమె యయిరి

మురువు పండ్లను కండ్లు మూతలు పడిపోవఁ
దరుణీ ముఖాబ్జసురభిఁ జిమ్ము
పగటి పద్మాలఁ బోల్ వారి మోములు రాత్రి
మొగిడిన పద్మాల పొలుపు దాల్చె

విడిన తామర పువ్వుల వేడు భ్రమరు
లట్లు మత్తాళి ముఖ పంకజాళి వేడు
వీరి ముఖములు పద్మాల మీఱె ననుచు
చూచు హనుమంతు మనసునఁ దోఁచె నపుడు. ౧౮౫

ఆస్త్రీలచే శాల యల తారకలచేఁ బ్ర
సన్నమౌ శరదభ్ర సరణిఁ దనరె
నక్షత్రముల నుడునాథుఁ డట్టుల దైత్య
రాజు భామినులతో రాత్రి మసలె
పుణ్యమై పోవఁగ వ్యోమ నుండియు రాలు
నల తారలటు స్త్రీలఁ దలచె హనుమ
శుభకాంతి వెలిఁగెడి చుక్కల ద్యుతు లట్లు
సతుల ద్యుతి ప్రభల్ వెలిఁగె మిగుల

లీలఁ బాన విహారాల కాలమందు
నిద్రలకు లొంగి చిత్తాలు ముద్ర పడఁగ
చెల్ల చెదరిన నగలతోఁ బెల్లు వాడు
మాలికలతోడఁ బ్రమదలు సోలి రచట. ౧౮౬

కొందఱు బొట్టులు కొంత చెఱిగి పోయె
కొందఱు నూపురాల్ కొలఁది సడలె
కొందఱు మొడసరుల్ కొంకక తెగిపోయె
కొందఱు చేలముల్ కొసకుఁ బాఱె

కొందఱు చిఱుతలౌ గుఱ్ఱంబులటు మొల
త్రాళ్ళు త్రెంపియు వైచి ధరణిఁబడిరి
కొందఱు మాలికల్ కుండలాల్ తెగి పడ
ద్విపము త్రెంపి విరియు తీవ లైరి

కొందఱు ప్రమదల స్తనాలయందుఁ జంద్రు
కిరణములఁ బోలు హారముల్ కెరలి ప్రోగు
పడఁగ హంసలువోలె మఱఁ మిగుల
చూచువారి కన్నులకును జోద్యమయ్యె. 187

కొందఱి వైడూర్య గుణ హేమ సూత్రాలు
కాదంబ చక్రవాకముల మీఱు
కొంద ఱంచల సరుల్ గురుకోక కుచముల
పులిన జఘనల నేఱులను మింత్రు
కొందఱు యంగాల కుచములయగ్రాల
మేల్నగన్ తమ్మి తుమ్మెదల మీఱు
కొందఱు యూపిరికిం దగ నల్లాడు
వసనాంతములు కడు మెసలి యాడు

కొందఱు కింకిణీజాల కోశములును
స్వర్ణభూషల పద్మాలు భావ నక్ర
ములను కీర్తి తీరంబులు గలిగి నిద్ర
చెందు నదులవలె భాసిల్లినారు. 188

వివిధ వర్ణ సువర్ణ కువల యాక్షుల కంఠ
మాలాల ప్రభలు ధ్వజాలఁ బోలు
శుభకాంతి కల స్త్రీల శుభకుండలంబులు
నాస్య వాయువులచే నల్లలాడు

శర్కరాసవ గంధ సౌరభంబులు స్త్రీల
వక్త్రము వెడలి రావణుని గొల్చు
రావ ణాస్యమె యని రావణు కొందఱు
ముదితలు సవతుల ముద్దు గొంద్రు

రావణు ప్రియులు పాననిద్రా వశలయి
సవతులను ముద్దుగొని ప్రీతి సలుపు చుంద్రు
స్వర్ణ కంకణములఁ దాల్చు బాహువులును
వలువలు తొలగడలుగ నిద్రలను గాంత్రు. 189

ఒక తింకొక్కతె వక్షమం, దొకతె యూయొుప్పారు తద్బాహుపై
నొక తింకొక్కతె యంకమం, దొకతె యింకొక్కర్తె బాహున్ తొడన్
ఒక తింకొక్కర్తుక వీపు ప్రక్క నడు మన్యోన్యంపు టంగంబులన్
ఒక తింకొక్కళ్ళులు మత్తు మైత్రిఁ బడి యొుళ్లొళ్ళుంచి నిద్రింతటన్. 190

ఒక రింకొక్కరి బాహు సూత్రముల నన్యోన్యంబుగా స్త్రీల మా
లికగా నేర్పడి మత్త షట్పదములన్ ప్రేలాడు పూమాలయా
ఒక పూవింకొక పూవు గాలి కలుపన్ నొండొండులన్ గల్సి మా
లిక యట్లొను వసంతమందు; సతు లిట్లే గల్సినన్ మాలయా. 191

అట నారావణు స్త్రీవసం బఖిల మన్యోన్యంబు సంసక్తమై
పటువౌ స్కంధము లంగముల్ వలగొనన్ పారస్పరం బైన సం
ఘటనన్ తుమ్మెదలున్ కురుల్ గలసి పోఁగా నొక్కటే యౌచు నం
తట నాభూషణ గాత్ర వస్త్ర సుమ భేదంబేమి లేకుండెడిన్. 192

రావణుఁడు నిద్రవోవ నానా విధంపు
ప్రభలుగల స్త్రీలఁ గనక దీపములు చూచి
తగె ననిమిష లటు; పితృ గంధర్వ దైత్య
రాజ ఋషి సుతుల్ వశ లైరి రావణునికి. 193

రణకాషాయఁడె యయిన రా
వణుచేఁ గొందఱు హృత లయి పడసిరి యుచటన్
వనితలు కొందఱు స్మరుచే
తను మోహిత లగుచు వచ్చి తనరిరి యుచటన్ 194

వనితయొ యెవతెయు నట గుణ
మునసే కాని బలాత్కరించి పొందఁగఁ బడలే
దు, నితర కామయుఁ గాదును
జనకజ తక్క నెవ, రితర సక్తయుఁ గాదున్. 195

హీనయు, నసమర్థయు, నకు
లీనయుఁ గాని యుపచార రిక్తయుఁ గానీ
హీనబలయుఁ గాని, ప్రియుమె
కానిది కాని, యతని సతి కానంబడదే. 196

ఇట నీ దైత్య పతి సతులు
పటు వగు తమ భర్తతోడ బహుసుఖముగ ను
న్నటు రాము ధర్మపత్ని, య
చట సుఖముగ నున్న దైత్యు జన్మయు శుభమౌ." 197

అని సుబుద్ధియౌ హనుమకు మనసు కలిగె
మఱియు నిటు లార్తితో నెంచె మాన్య సీత
గుణముచే గొప్పది ధ్రువ మీయనఘ యొడ మ
హాబలుడు లంకపతి చెడు గాచరించె. 198

అట దంతాలవి పైఁడివై వివిధమౌ నంగాలు, పై ధూర్యపుం
బటు పీఠంబులు, గొప్ప యాస్తరణముల్, భద్రాసనశ్రేణి;యు
త్కటమై, రత్న విభూషితం బగుచు ముఖ్యంబౌచు దివ్యాంగ సం
ఘటితంబౌ శయనాసనం బతుల మొక్కండం దతం డారసెన్. 199

కనక చ్ఛాయల మీఁది సూర్య సన్నిభా కాంతిన్ విరాజిల్లి వి
చ్చిన బాగైన యశోక మాలికలలోఁ జిత్రించు శ్రేష్ఠాసనం
బునఁ గొండొక్క ప్రదేశంబందు రుచిరంపున్ మాలలన్ దీర్చు చ
క్కని శీతాంశుని బోలు వెల్గ గొడుగున్ గాంచెన్ హనుమంతుఁడటన్. 200

వ. మఱియు నతండు

బొమ్మలు వింజామ రమ్ములు వీవంగ
వర గంధ ధూపముల్ వఱలు చుండ
వర మాస్తరణముల మురువు గొజ్జెల చర్మ
కప్పఁ బూమాలిక లొప్పు చూప
శయ్యపై మేఘంబు సరణిఁ బరుండియు
నుజ్జ్వల కుండలాల్ ప్రజ్వలింప
అరుణాక్షు ఘనభుజాగవరంజిపుట్టము
నూని యెఱ్ఱని గంధ మూను వాని

మింట మెఱుపు సంజల మబ్బు మేని వాని
దివ్య భూషలు దాల్చిన దివ్య రూపు
కామగుని సుప్తి మందర గ్రాప సముని
కేళి విరతు రావణు సతిలోఁ గాంచె. 201

త్రాగి త్రాగియు మాని తగనిద్ర గొనువాని
రాక్షస భామినీ ప్రమద కరుని
రాక్షస శార్దూలు రమ్య స్వరూపుని
నఖిల దైత్యపతి లంకాధిపతిని
నిశయందు విహరించి నిద్రించు వానిని
రాక్షసీ ప్రియు నాభరణ శరీరు
భాస్వర శయన సుప్తాంగుని వీరుని
నురగంబువోలె నిట్టూర్చువాని

వెడలి రావణుం జేరి యుద్వేగమొంది
తత్కాలిని భీతుని యటులం దప్పుకొనుచు
మణౌక మెట్టెక్క చూడగా మరలి, మ...పు
టేన్గుపై సెలయే ఱట్టు లెసంగె హనుమ. 202

వ. అట్లు హనుమంతుడు ఉండి కాంచనాంగదములు ధరించిన యతని
బాహువులు నింద్రధ్వజమువలె నుండ వీక్షించెను. 203

ఎవ్వి యైరావత పృథువిషాణాలచే
వజ్ర చక్రాలచే వ్రణిత మయ్యె
ఎవ్వి బల్మిం పరిగ నేర్పడి యంసాల
లక్షణాంగుళి నఖ లక్షితములొ
ఎవ్వి పరిఘములటు వృత్తమై తొండంబు
లటు, పంచశీర్షాహు లటు వఱలె
ఎవ్వి చెవులపిల్లి యొఱుపు రక్తమువంటి
శీతచందనముల పూంత లందె.

ఎవ్వి యుత్తమ స్త్రీలచే మృదితమయ్యె
ఎవ్వి యక్ష గంధర్వ ప్రభృతి సురాసు
రాదులను నేడిపించెనొ యవ్వి యివియె
అనుచు రావణబాహుల నరసె హనుమ. 204

అవ్వి మందరగిరి మధ్య నలసిపోయి
యలుక పూనిన పాములయటుల నుండె
* ఆభుజముల రెంటను రాక్షసాధిపుండును
శృంగములచేత గిరివోలె చెలగె నపుడు. 205

* యుద్ధములోందక్క మిగిలినచోట్ల రావణునికి రెండుభుజములె వర్ణింపం బడెను.

అతఁడు మృష్టాన్న రసముల యుతుఁడై యగుచు
పాన గంధాలచే యుక్తుఁడైన యట్టు
లఁ దగిచూత పున్నాగ సౌరభము లొప్పు
అమల వకుళ సహిత మందర్పాదిఁబోలు. 206

వండి యున్న రాక్షససింహు వదనమందు
నుండి గృహము నిండించు గుబ్బాదవె నెంతొ
ముత్తెపుఁలు దాపిన పసిండి ముకుట మపుడు
కుండలంబుల మెరాముతోఁ గూడఁ గదలె. 207

అతఁ డందమయిన హారాళిని నెఱ్ఱగం
దము పూయువెడఁద వక్షమునఁ దనరి
తెలుపైన చెదరిన వెలగల కండువా
దనరఁగ నెఱ్ఱని కనుల వెలిఁగి
మినుప రాశివలెనై పెనుపాము టూర్పుచు
గాంగాంబులఁ బరున్న గజముఁ బోలి
మెఱుపుల ప్రోగుల మెఱయు మబ్బయి నల్ది
శను మించు దీపాలఁ దనువు మెఱయుఁ

బాన్పునఁ బరున్న రాక్షసేశ్వరుని
నామహాబలు ప్రియుభార్య నడుగులందు
చారు కుండల భాస్వరై సరస భూష
లచుర నృత్తజ్ఞలగు ఋభాస్యలను గనియె. 208

అటఁ గూర్చుండిన వాద్య నృత్త విదలౌ నారావణాంకస్థలౌ
పటుగాత్రల్ చెవులన్ ధరించిన లసద్వైడూర్య గర్భంబులై
యిటు లట్లూగు పసిండి కుండలము, లెన్నో సంగదంబుల్ హుటా
హుటిఁ గాంతుల్ పెదజల్లఁ గండ్లు మిఱుమిట్లొప్పన్ గనెన్ మారుతే. 209

వ. మఱియును నాహనుమంతుండు.

కుంకుమా కుందములఁ ధరించిన కళాపూర్ణాస్యలన్ మిన్నునుం
డఁగ తారావళి నట్టి-పుష్పక విమానంబున్ ప్రకాశింప న
త్తఱిఁ బ్రియాపతి కిన్నలై దనుజరాట్టిన్నాంగు లందందు ని
ద్రాపరకున్ లోఁగియు సోలి చెల్లచెదరై తూగాడి యుండన్ గనెన్. 210

నృత్తశాలిని యోర్తు నృత్యాల మృదులాంగ
హారాల నొడలెల్ల నలయు పోలే
నదిఁగొట్టుకొని పోవు నళినికి తెప్పను బోలె
యొకతె వీణియఁ బట్టి యొరిగి వ్రాలె
శ్యామలేక్షణ యోర్తు చంకఁ గంజీర నుంచి
బాలుఁ దాల్చిన తల్లివలెఁ బరుండె
ఒకసుందరి పటహం బొకటి గ్రుచ్చి పరుండె
చిరలబ్ధ ప్రియు గ్రుచ్చు చెలియ వోలె

ఒంటిగామిఁ గౌగిట గ్రుచ్చు నువిద వోలె
నొకతెఁ బిల్లన గోవిని నూని సోలె
ఒకతె బంగరువంటిదై యుబ్బి పొలుపు
మీసు నొడల మద్దెలఁ గౌగిలించుకొనియె. 211

భుజ పార్శ్వముల మధ్య జంకఁ బొడివి యున్న
పణవంబుతో సోలె బ్రమద యొకతె
పినవత్సుఁ గౌగింట గొనిన భామిని వోలె
డిండిమంబును గ్రుచ్చి పండె నొకతె
భుజముల చేగొట్టి భుజముల మధ్య వా
ద్యము గ్రుచ్చి పండెఁ బద్మాక్షి యొకతె
లలి వసంతానఁ బువ్వులఁ జిత్రమౌ మాల
వలెఁ బెట్టి బోర్లించి పండె నొకతె

పసిఁడి గిండి వంటి పాలిండ్లు భుజములఁ
గౌగిలించి నిద్రఁదూగె నొకతె
ఒంటి ఘన నితంబ నొగి గౌగిటను గ్రుచ్చి
యొక్క విహ్వలాంగి యొరిగి యుండె. 213

ఇటు చిత్రంబగు వాద్యముల్ ప్రమద లెంతే గుబ్బలం జేర్చి ము
చ్చటఁ గానాత్ములఁ గామినిన్ వలెనె స్వేచ్ఛా లింగనంబిచ్చి మి
క్కుటమౌ మోహముచేఁ బరుండి నటులన్ గ్రుచ్చంగ వీక్షించె ముం
దట నేకాంతపుఁ జోట బానుపున నిద్రంగొన్న ఓ రూపసిన్, 214

మణిముత్యంబులఁ గూర్చి యున్న నగలన్ భాసిల్లి స్వశ్రీలచే
ఘనమౌ నాభవనంబు నంతటను సింగారించి వెల్గించెనో
యనునట్టుల్ తగుగౌరిఁ గాంచన సువర్ణాంగిన్ మహాంతఃపురీ
శను మందోదరి రూపిణిన్ హనుమ యాశ్చర్యాన్వితుండై గనెన్. 215

ఇటు లాకాంతను రూపయౌవనయుతన్ వీక్షించి యాసీతగా
చటులాత్మన్ దలపోసి లోనఁ బరమాహ్లాదంబుతో వాయుజుం
డట వేసెన్ జిటికల్, స్వవాలమును నెల్లన్ ముద్దిడెన్, బాడె ఘుం
దటి స్తంబంబుల నెక్కి దూకెఁ గపిదౌ నైజంబు చూపించుచున్. 216

అని హర్షించుచు నింతలో నితరమౌ నాలోచనల్ తట్ట దా
నిని వెన్వెంటనె త్రోసిపైచి యిటుచింతించెన్ మదిన్, రాముఁగాం
చని యాసీత యిటుల్ పరున్నె తినునే సంతుష్టయై భూషలన్
గొనునే త్రాగునె యన్యుఁ గాదఁ యిఁక శక్రుంగాని లోనెంచునే. 217

సురలం దైన ను రాముతోడ సమునిన్ జూడంగ లేదీమె యె
వ్వరో యుంచున్ గపి నిశ్చయించి పిదపన్ బానంపుశాలన్ గనన్
దిరిగెన్, గొందఱు క్రీడలందు కడు గ్లాంతిం గాంత్రు గీతాలఁ గొం
దఱు నృత్తంబులఁ బానశాలల నలంతన్ గాంచి రవ్వేళలో. 218

* కొందఱు మురవంబుల యెడఁ
గొందఱును మృదంగములెడఁ గొందఱు దరిగొ
కొందఱు నాస్తరణంబులఁ
గొందఱు నాసనములందుఁ గూర్చుండి రటన్. 219

కొందఱితో సంభాషణఁ
గొందఱితో దేశకాల గుణవిషయాలన్
గొందఱితో రతిఁ దేలుచు
విందులఁ గొని కునుకు దితిజవిభుఁ గపి కనియెన్. 220

కరిణులతోఁ గానవమునఁ
జరియించు మహాగజమటు- సరసాక్షులతో
తిరిగెడి యాదైత్యాధీ
శ్వరు వేశ్మను పానశాల వర కపి దరిసెన్. 221

ఒకచోట మహిషాల మేకముల పందుల
మాంసంపు రాసులం బ్లవగుఁ డరసె
ఒకచో సగము తిన్న యురు హేమ పాత్ర స్థ
మాయూర కుక్కుట మాంస మరసె
ఒకచోట పెరుగులు నుప్పు వేసిన మేష
శల్య వరాహ మాంసములు గాంచె
ఒకచో సగము తిన్న క్రకర మత్స్య చకోర
మహిష భాగంబుల మాంస మరసె

* విస:- మురవము=వాద్యవిశేషము.

ఒక్కచో లేహ్య పేయ భోజ్యోరు వివిధ
లవణ మధు రామ్ల శుక్ల సర్షపము లింక
షడ్రసాన్విత మైన భోజ్యముల నరసి
హరివరేణ్యుఁడు హనుమంతుఁ డరసె, మిగుల. 222

తలక్రిందులై యున్న వెలగల యందెలు
హారాలు వలనూపురాళితోడ
రసములు తీసి తర్వాతఁ బోసపుఁ బాత్ర
లందుంచు వివిధ ఫలాలతోడ
అటనట నుంచియు నగ్ని లేకుండనే
యట వెల్గు శయనాసనాళితోడ
సంస్కార సంస్కృత సరస కుశలయుక్త
వివిధ రుచిరమాంస వితతితోడ

శర్కరాసవ మాధ్వీక సరస పుష్ప
ఫల రసాసవములతోడ ప్రకృతి సిద్ధ
సురలతోడుత కృత్రిమ సురలతోడ
పాన భూమి యలంకృత స్థానమయ్యె. 223

వివిధ పటు వాస చూర్ణముల్ వివిధ మాల్య
రాజి భూమి నొప్పె, స్ఫటిక రజత హైమ
భాజనములతోడ నందున్న పానకముల
సీధువుల నిండియుండియా క్షితి తనర్చె. 224

ఒకచో సగమ్ము మిగిలిన
నొకచోఁ ద్రాగఁబడి, త్రాగకొకచో నొప్పెన్
ఒకచో నానా భక్ష్యము
లొకచోఁ గొంతకును కొంత యురుపానములే. 225

ఒకచో మిగిలిన యన్నము
లొకచోఁ గదపిన ఘటమ్ము లొకచో జలముల్
ఒకచో భిన్నపుఁ గరకము
లొకచో మాల్యములు కనియె నొకచో ఫలముల్. 226

అచట వనితలు శుభ్రశయ్యలను తనరె
వార లొండొండఁ గౌఁగిటఁబట్టి యుండ్రు
వారు నిద్రించు నితరల వస్త్రమూని
లాగుకొనియు నబలత నిద్రలను గొండ్రు. 227

వారి యుచ్ఛ్వాసములఁ బుట్టు మారుతంబు
గాత్రముల యందు నున్నట్టి కట్టువస్త్ర
ములను మాల్యములనుగూడఁ గొలఁది చిత్ర
ములఁ గదపు మందవాయువుఁ బోలెవోలె. 228

అట శీతంబగు వాయువున్, మధురమౌ నాసీధు పానంబులున్
బటు మాల్యంబులు నైక ధూపములు నానారీతిగాఁ గొంచు ని
ట్లటు ప్రాంతంబులఁ జేరి పుష్పక విమానాభ్యంతరంబందు ము
చ్చటగా వీచె సుగంధముల్ విసరుచున్ సర్వత్ర వ్యాపించుచున్. 229

కొందఱు శ్యామలు శ్వేతలు
కొందఱు కృష్ణలు మఱియుఁ గొందఱు మిగులన్
గుందనపుం బొమ్మలు నయి
యుందురు రాక్షస గృహముల నున్న లతాంగుల్. 230

నిదురించిన పద్మిను లగు
మదవతుల సురూపము గడు మదనునిచేతన్
గదలింపఁగఁ బడి వెడలియు
మదయుతముగ నందములను మఱగెను మిగులన్. 231

ఇటులన్ రావణు నెల్లయంతి పురమున్ వీక్షించి తేజస్వియై
పటు వీర్యుం డగు వాయుజుం డచటి యాప ద్మాక్షులన్ జూచుచున్
ఇట ధర్మంబున లోపమయ్యె నని యెంతే శంకం జింతించె నే
నిటు నిద్రించిన యన్యభార్యలం గడున్ వీక్షించు టన్యాయమే. 231

ఇది ధర్మం బెటులైనం గా, దయిన నాయీచూపు గామంబుతో
డిది కాదే,పర దార సంగ్రహణమే లేదిందు నైనన్ గడున్.
మదిలోనన్ బరదార దర్శనమె సంప్రాప్తించె నంచున్ గడున్
మదిం జింతింపంగ నన్యచింత కలిగెన్ మాన్యుండయౌ వానికిన్. 233

ఇటులన్ స్వేచ్ఛగ నిద్ర చెందు నసురాధీశాంతఃపురం బెల్లం జూ
చుటయీలాగున సంభవించె నయినన్ శుద్ధంబయౌ నామదిన్
ఎటులం గాని వికారమే గలుగ లేదీ యన్నిటం జిత్తమే
పటువౌ హేతువు మంచిచెడ్డలకు నాభావంబౌ స్వస్థంబెయౌ. 234

ఇంక నారాముని సీత నెందయిన నన్వేషింప వాంఛించుచో
నొక యాస్త్రీలనె గాక యెం దరయంగా నొప్పున్, మఱిన్ స్త్రీలతో
నింక స్త్రీలన్ వెదుకన్ వలెన్, మృగుల నన్వేషింప వీలౌనె? యిం
తకు నేజాతిని నట్టి జాతి యెడం గానం జెల్లుం; గాదొండుచో. 235

ఇట శుద్ధంపు మనస్సుతోనె యిట నన్వేషించుచున్ నేనో ముం
గట నీరావణు సర్వ మంతపురమున్ గాలించితిన్ సీతనో
యిటం జూడం గద "యంచు నాహనుమ యెంతే స్వచ్ఛచిత్తంబుతో
నట గంధర్వ సురాహి కన్యలగనె, నైనం గనం డాసతిన్. 236

ఇటు లాసీతను గాంచ కన్యసతులన్ వీక్షించుచుం బోయి యం
తట నాచోటను దాటి ధ్యానమునం గాసన్ సాగె నావాయుజుం
డిటు లైనన్ గని తీరగా వలయు నంచెంతేని యత్నించు చ
చ్చటి యాపానపు భూమి వీడి వెదుకన్ సాగెన్ మఱియన్యస్థలుస్. 237

హనుమంతుం డపుడా మహాభవనమధ్యస్ జిత్ర గేహంబులున్.
నను దీపెల్ పొదరిండ్లు రేగృహము లెన్నో చూచెఁ గానీ యటన్
జనక క్ష్మాపతి కూతుఁ జూడఁ డపుడీ చందానఁ జింతించె నె
ల్లను వీక్షించితి సీతఁ జూడ, నిజ మారమ్యాంగి చావొందెనా. 238

తనశీలంబును గాచు తత్పరత శుద్ధంబైన మార్గాన నుం
డినదై దుష్టుఁడ యైన రావణుడు జాలేలేక చంపస్ గటా
చనిపోలేదుగదా, విరూపలయి దుష్టాచారలై దుష్టద
ర్శనలౌ రాక్షస కాంతలన్ గని భయాలన్ జచ్చి పోలేదుగా. 239

జానకి, జాడకుండఁ ఘనశౌర్యమునన్ విహరింపకుండ నెం
తేనియుఁ గాలముం గడిపి యాకపి బృందముతోడఁ బోయి యా
వానరరాజుఁ జూచు టెటు, వానర రా జతఁ డుగ్రదండుఁ డెం
తేనిబలంబు గల్గు ఘనుఁ డేమొనరించెద నిప్పు డక్కటా! 240

సకలాంతఃపురమున్ గనుంగొనితి రక్షఃకాంతలన్ గంటి జా
నకి మాత్రం బగపించ దిట్లు వృధగా నాకష్ట మెల్లన్ జనెన్
సకలజ్ఞుల్ కపు లేమిపల్కుదురొ యిచ్చన్ బోయి నీవేమి యిం
తతు సాధించితి చెప్పనన్ జనకజన్ గన్గొక యేమాడెదన్. 241

వననిధి దాటక యిట నే
నొనరినఁ బ్రాయోప వేశ ముందుర్ కపులున్
వననిధి దాటి నను నెదొ
యను నంగదజాంబవంతుఁ డాదిగ జనమున్. 242

ఉత్సాహం బదె శ్రీల కాది, యదియే యుత్కృష్ట సౌఖ్యం బగున్
ఉత్సాహం బిదె సంతతంబు సకలార్థోత్పత్తి గావించుఁగా
ఉత్సాహంబునఁ జేయు కర్మ యదె జన్మోత్కృష్ట సాఫల్యమౌ
ఉత్సాహంబున నిందుకే పొనరుతున్ యోగ్య ప్రయత్నం బిఁకన్. 243

అన్వేషించెద నింక రావణునిచే నారక్షిత ప్రాంతముల్
అన్వేషించితిఁ బానశాలలను పుష్పారామముల్ గేహముల్
అన్వేషించితిఁ జిత్రశాలలను క్రీడారామముల్ పెద్దలన్
అన్వేషించితి మందిరోపవను లాభ్యంత రాధ్వంబులన్. 244

అని యాలోచన చేసి మారుతియుఁ జైత్యంబుల్ ధరాగేహముల్
వనముల్ పట్టన బాహ్య నిర్మిత గృహవ్రాతంబు నన్వేషణల్
కొనసాగించు , దుముకున్ బడున్ బోవున్ గృహద్వారముల్
ఘన వాటాలు కవాటముల్ తెఱచు, నింకన్ జొచ్చువచ్చున్ జనున్ 245

ఇటు సర్వం బవకాశ మున్నవఱ కన్వేషించుచుండున్ హుటా
హుటిపోవున్ దనుజేశునంతిపురిలో నుండుండి వీక్షింపకు
న్నటువంటేస్థలి నాలు గంగుళములై నన్ గానఁగారాద, యు
త్కటమౌ వేదులఁ జైత్యదీర్ఘికలఁ బ్రాకారాంత రాధ్వాదులన్. 246

చూచున్ మారుతి రాక్షసాంగనల నచ్చోఁ బల్వికారాంగులన్
వేచూచున్ గపి మేన నప్రతిమలన్ విద్యా ధరాజ్ఞాక్షులన్
చూచున్ జంద్ర నిభాస్యలన్ హృతల నచ్చో నాగకన్యావళిన్
చూచున్ సర్వము, చూడఁ డాజనకజన్ శోధించి వీక్షించియున్. 247

ఇటు లాపావని చూడకే వదలు స్త్రీలే లేర, యీరీతి ని
ట్లటు వీక్షించిన వారినే గనుచుఁ దానాసీత నీక్షింపకే"
పటువౌ వానరనాథ యత్న మటు లాపాథోధి లంఘించుటల్
ఇటు వ్యర్థంబనుచున్ విమానము దిగె న్నెంతో విపష్టాత్ముఁడౌ. 248

కని యాపుష్పక మందునుండి దిగి ప్రాకారంబుపై నెక్కి మ
బ్బునినుండిన్ దిగి మబ్బుచేరు మెఱుపుంబోలెన్ హనుమంతుఁ డా
జనకక్ష్మాపతి పుత్రిఁ జూడక మదిన్ సంతాప మేపారఁగా
తన చిత్తంబున నిట్టులన్ దలఁచె సీతాన్వేషణాసక్తుఁడై. 249

రాము ప్రియంబు చేయఁగఁ దలంచెడి ... లంకలోపలన్
ఆమిథిలాత్మజాతకయి యింతటఁ గాల్వ ... పౌర్వ్వపుం
భూములఁ గొండలన్ వెదకి పూర్తిగ ధ్యా ... జూచితిన్
ఏమియు సీతజాడ గనిపింపద యిం కిప ... యుదున్. 250

జనకక్ష్మాపతి పుత్త్రి రావణుని వేశ్మన్ ... యుండె నం
చును సంపాతియె గృధ్రరాజు కని ... ముగాఁ జెప్ప విం
టిని, నేఁ డాజనకాత్మజాతఁ దెలియన్ లే ... రా
వణు నాసీతయు దిక్కులేని దయి కొల్వన్ ... దే కటా ! 251

రాము శరంబులున్నఁ గడు త్రాసము ... సీతఁ గాంచు నా
వ్యోమముగుండ తీసికొని పోవుచు నుండఁ ... సంతభీతయై
యామిథిలేశపుత్త్రి పథియందు వడిన్ ... మోనేమొ లే
కామెను తీసికొంచుఁ జనుసప్పుడు ... గూలెనా. 252

రావణు నూరుల రయమున భుజమధ్యఁ
బడి తనజీవముల్ విడెనా యేమొ
పైపైకి నెగురుచు వార్ధి దాటెడి వేళ
దొర్లుచు వార్ధిలో దొర్లెనేమొ
నిజ శీలమును గాచి నిర్బంధు వగు దీన
ఘననీచు దైత్యుచేఁ దినఁగఁ బడెనొ
దుష్ట సతులచే నదుష్టయౌ యసితాక్షి
భక్షింపఁబడి భువి వ్రాలెనేమొ

ప్రకట పూర్ణేందునిభుఁ బద్మపత్రనేత్రు
రాము ధ్యానించుచు విడెనో ప్రాణములను
అయ్యొ ! రామ ! హా లక్ష్మణా ! హా యయోధ్య !
అనుచు విలపించి సీత దేహమును విడెనొ. 253

ఒకవేళన్ సతి సీత దైత్యగృహమందో, పంజరస్థాపి శా
రికవోలెన్ విలపించుచున్నదియొ; దుష్కృత్యుండయౌ రావణాం
తిక గేహంబున రాముపత్ని సతి యానీలోత్పలాభాక్షి జా
నకి యారావణభూతి కెట్లు వశమౌ, నమ్మంగలేన్ దీనినిన్. 254

జనకక్ష్మాపతి పుత్త్రి నష్ట యునియో చావొంది భ్రష్టాత్మయౌ
ననియో భక్షితయై ప్రణష్ట యునియో యారాముతో నిష్టభా
ర్యునితోఁ జెప్పఁగ నొప్పుఁ జెప్పినను నెంతో దోషమే చెప్ప మ
న్నను దోషంబె యగున్ మఱేమొ నరుతున్ గర్తవ్యమే తోఁచదే. 255

ఇటు లీకార్యమె యిట్లు కాఁగ నిపుడే దీర్ఘప్రాప్తకాలంబు, యక్కట !
యంచున్ మఱియున్ గపీంద్రుఁ డిటులన్ కాంచందొడంగెన్ మదిన్
ఇటు లీసీతను జూడకుండ పురికే యేనిప్పుడే పోయితే
నెటులౌ నీపురుషార్థసిద్ధి యుతకా లీయున్ని వ్యర్థంబెకా. 256

కని సుగ్రీవుఁడు వానరుల్ దశరథక్ష్మాధీశపుత్త్రుల్ కటా !
నను కిష్కింధను జేర, నేమనుదురో, నన్జూడ నే వెళ్లి రా
మునితో 'చూడఁగ లేదు సీత' ననుచో ముందే విడున్ ప్రాణముల్
మనసున్ క్లేశము పెట్టి సీతవిషయం బాలించి జీవింపఁడున్. 257

అతఁడున్ స్రుక్కఁగఁ బంచతన్ తనువు సంప్రాప్తింపఁ ద
గ్గతచిత్తుఁ డగులక్ష్మణుండును చనున్ తర్వాతఁ దద్భ్రాతలున్
మృతులై పోవఁగ వారి తల్లులును వారింబట్టి సుగ్రీవుఁడున్
సతియౌ నారుమ పైని తారయును తత్పుత్త్రుఁడే నుందురే. 258

వరకపి రాజు నిట్లు తన ప్రాణములన్ విడఁగోరఁ గ్రోతు లా
తురులయి తాము గుప్పిడులతో నఱచేతులతో శిరస్సులన్
కర మట మొత్తుకొంద్రు పతి కన్గొని యూరడఁజేయు మున్ను చె
చ్చెఱ దయ గన్నవారలు త్యజింపరె దేహముః వానరుల్ కటా! 259

వనములఁ గొండలన్ గుడుల వానరకుంజరులేమి క్రీడలన్
మునుగక మంత్రి దార జనముల్ చనుదేర నగంబులెక్కి క్రిం
దను బడిపోదురే విషముత్రాగియొ తా ఘురిపోసి కొంచు న
గ్ని నిబడి కంఠముల్ నరికి నిత్రుపవాసమ యుండి చత్తురే. 260

ఇక ఘోరంబుగ రోదనంబులవి వ్యాపించున్, వరేక్ష్వాకు స
ర్వకులంబున్ గపివంశముల్ క్షయ మగున్ అంకన్ విసర్జించి ప్రో
లికిఁ గిష్కింధకుఁ బోను పోయి యట సుగ్రీవున్ ప్లవంగేశు- జా
నకి లేకుండఁగఁ- జూడలేను సెటులైనం గాని యిందుండెదన్. 261

వ్యథచేఁ నేఁజన కిమ్యోడన్ నిలచి పోవన్ ధర్మమూర్తుల్ మహా
రథు లోజస్వులు రామలక్ష్మణులు ధైర్యంబూని యాసీత నె
వ్విధినో చూడఁగ వచ్చు నంచు మదిలోఁ బేరాశతో నుండుచుం
ద్రబకుల్ దాల్తురు గాన నిద్దె సరియౌ మార్గం బటం చెంచెదన్. 262

ఇఁక సీతం గనకున్న హస్తములయందే పడ్డ దానిన్ ముఖా
నకు లబ్ధం బగుదానినో తినుచు వానప్రస్థుండై యుండెదన్
ఇఁక లేదా ఫలమూల నీరములతో నేపారు నీవార్ధికిన్
నికటంబందె చితన్ రగుల్చుకొని యందే నేఁ బ్రవేశించెదన్, 263

మఱిపోనీ మెయి శుద్ధి చేసెడి మతిం బ్రాయోపవేశంబునన్
వఱలన్ గ్రద్దలొ కాకులేని పులులో భక్షించుఁబో సీతనే
యరయంజాలనిచో జలాలఁబడి దేహంబిద్దిచాలింతు నీ
వరమార్గంబు మహర్షులొప్పిరి వరంబౌ నిట్టి నిర్యాణమున్. 264

ఇటు సీతం గనకుండనే యిట శుభంబేయాదిగా చంద్రురా
కటచే బాగయి నాకుఁ గీర్తినిడు నీకళ్యాణమౌ రాత్రి యి
చ్చటనే యిట్లు సమాప్త మయ్యెను తపస్సుం బూని వృక్షాలనే
యిట నాధారము చేసికొంచు నిలుతు న్నేసీతలేకేగఁ జూ 265

జనక క్ష్మాపతిపుత్త్రిఁ బొందక యె జల్లంగ నట్లేగుచోఁ
గని యా యంగదుఁడో ప్లవంగయుతుఁడై కాలంబు చేయున్, మృతిన్
గనుచో దోషము లెన్నొయౌ బ్రదికినన్ భద్రంబులన్ గాంచుఁ గా
వున బ్రాణాలుధరింతుఁ జావను ధ్రువంబుల్ శ్రేయసుల్ నిత్యమున్ 266

ఇటు లెన్నొ గతులన్ మదిన్ గలుగు నెన్నెన్ దుఃఖముల్ దాల్చుచున్
కట! కష్టాలకుఁ బారమున్ హనుమ తాఁ గాంచండొ యిం కప్పుడున్
ఇటు లెంచెన్ దశకంఠు రావణుని నిప్డే చంప నే చంపెదన్
అటు సీతన్ గొనిపోవ నీబదులుగా నత్యంత మిట్లయ్యెడున్. 267

పోనీలే యిఁక నేఁ బశుపతిన్ బొందించు నట్లబ్ధిపై
కేనెత్తియు, నెత్తి రాముకడకు న్నీ రావణుం జేర్చెదన్
కాని మ్మంచును జింత పొంది జనకక్ష్మాపుత్త్రి నీక్షింపకే
క్షీణాత్ముం డయి ధ్యానిడై మరల యోచించెన్ వ్యథామగ్నుఁడై. 268

ఎందాఁకన్ జనకాత్మజాతఁ గననో యేనంత దాకన్ గరం
బిందే సీతఁ బొరింబొరిన్ వెదకుదు న్నింకిట్లు సంపాతి ప
ల్కందే శ్రద్ధ వహించి రాము నిటకున్ రప్పింతునేన్, రాముఁడో
యిందున్ సీతను జూడ కీకపుల నెంతే దగ్ధులం జేయునే. 269

ఇట నాహారము సంయమించుకొని నేనీ యింద్రియ వ్రాతముల్
త్రుటిలోనన్ నియమించుకొంచు వసియింతున్ గాన నిట్లైన న
చ్చటి యా వానరులున్ నశింప, రిదె పార్శ్వం బందె వృక్షాలతో
నటు శోభిల్లెడి యీ యశోకవని, యం దన్వేషణన్ జేసెదన్. 270

వసుల నాదిత్య రుద్ర దేవాశ్వినులను
మ్రొక్కి రాక్షసులకు శోకమును జనింప
వెడలి సర్వదైత్యుల గెల్చి వేగ సిద్ధి
నటు తపసి రామునకు సీతను నప్పగింతు 271

అనుచు నొక ముహూర్తము పో...ు
నెసఁగివలెఁ జింతచే వికలమౌ...
అమహాత్ముఁడు హను...మంతుఁ డ...
మీఁదియపుడె తా బ...ల్ దేఁ...వె...   272

ప్రణతులు సీతాదేవికి
ప్రణతులు రఘురామునికి లక్ష్మణపతికి
ప్రణతులు రుద్రేంద్ర యముల
కనిలార్కేందు దేవతాళికిఁ బ్రణతుల్.   273

అని వారికి సుగ్రీవుని
కొనరిచి ప్రణతు, లఖిల దిశ ...
కను పిదప నొనర్పఁ దగిన
పని ఏది యని తలచె హనుమ స్వాంతములోనన్.   274

ధ్రువముగ నశోకవని దా
నవ రక్షక భట బహుళము నప సంస్కృలన్
ప్రవినుతము ద్రుమావృత మయి
మివులగ నన్వేషణీయమే యయి యుండున్.   275

ఇట రక్షకులును తరువుల
నిటులన్ రక్షించుచుందు రెప్పుడు మివులన్
పటు మారుతంబు గూడను
నిటను నతి క్షోభ పెట్ట కెసఁగుచు నుండున్.   276

ఆరాముని కార్యమునకు
నీరావణు కనులఁ బడక యిటు నటు చన, నా
కారము చిన్నది చేయుదు
మారుతము ఋషులును సిద్ధి మనుపుత నన్నున్.   277

సురలున్ బ్రహ్మయు విష్ణు వాయువనలుడున్ సోముండు నాదిత్యుడున్
వరుణుం డశ్వినులీశుఁడున్ మరుతులున్ ప్రాణి ప్రభుండు నిం
దరయన్ దృష్టికి రాని వారు నితరుల్ ప్రాజ్ఞుల్ మహాత్ముల్ నిరం
తరమున్ నాకిట సిద్ధిగల్గునటులన్ నన్నో మఱతన్ శీఘ్రమే. 278

తెలి దంతంబులు నెత్తు ముక్కు తనరన్ దీపించి పద్మాభ చ
క్షుల రమ్యంబయి శుభ్రమౌ స్మితముతోఁ జోద్యంబుగా నొప్పు మై
థిలి మోమెప్పుడు చూతునొక్కొ ఖలుఁడై తీవ్రాంగుఁడై దుష్ట క
ర్మలఁ గావించెడి క్రూరుచే హృతను నార్తన్ జూచు టెన్నండొకో. 279

అని మూర్తంబట ధ్యానముండి త్వరగా నంతన్ ఖలుండైన రా
వణు వేశ్మన్ విడి యా యశోక వనికా ప్రాకారముం జేరి మే
నునఁ బుల్కల్ జనియింప మారుతి వసంతున్ గొల్వ మైనిండ వి
చ్చిన యుద్దాలక నాగ చూతములు చూచెన్ జంప కాశోకముల్. 280

* అటు లాచూత వనీ లతా వృతపు రమ్యాశోక వాటిన హుటా
హుటి నారిన్ విడు బాణమో యనఁగ నెంతో వేగమే చేరి య
చ్చట బంగారము వెండివోలెఁ దగు వృక్షాలన్ విహంగాల మి
క్కుటమై పొల్చు మృగాళి నందు నుదితార్కుం బోలు వాటిన్ గనెన్. 281

ఫల పుష్పంబుల నిండియున్న తరులన్ బాగొప్పఁ బై కెక్కి కో
యిల లాలాపము చేయుఁ దుమ్మెదల ఝార్లింకన్ శ్రుతుల్ వేయ, రా
జిలి పొల్పారు వసంతు నిండు సభలో సింగార మొల్కన్ నెమి
ళ్ళులు నృత్యంబులు చేయుఁ బక్షుల గణాలున్ చేయు భద్రధ్వనుల్. 282

---

* అక్కడి జంతు ప్రదర్శనశాల చూచెనని భావము.

ఇదియేమీ గనఁ డొక్క జానకిని దామన్వేషించు యత్నంబులో
నదనన్ మారుతి హాయి నిద్రగొను పక్ష్యాళిన్ బ్రబోధింపఁగన్
నిదురల్ వీడుచు దుల్పి పైకెగిరి శ్రేణీభూత పక్ష్యాళి చె
ట్ల దరిన్ నిల్చు కపీంద్రుపై పువుల వర్షాళి కుర్సె భద్రంబుగన్. 283

విరులన్ గ్రమ్మి నతం డశోకవని నొప్పెన్ పూలప్రోవైగెన భూ
ధర మేమోయనః నంత వృక్షములపైఁ గ్రొచ్చాడు నాక్రోఁతి న
త్తతి వీక్షించిరి సర్వ దిక్సతులు నీతండుఁ వసంతుఁడో నా
సరిగన్ పూవులు రాల భూమి తగె భూషాలంకృత స్త్రీ వలెన్. 284

హనుమంతుం డట సీతఁ జూచు వడి కాంచా చెట్లు కంపింపఁ బూ
లును నాకుల్ పడఁ బక్షులేగఁగ మొదళ్ళున్ మాత్రమే యుండి; యా
టను పూర్ణంబుగ సొమ్ము లోడి పయిబట్టల్ లాగివేయంగ నొ
ప్పిన పెన్జూదరు లట్టు ల త్తతిని గన్పించెన్ తరుల్ మోడులై. 285

అల వాతాత్మజుఁ డంఘ్రివాలములచే హస్తాలచేఁ జెట్లు శా
ఖలు త్రొక్కన్ కడు నాయశోకవనియున్ స్కంధావశిష్టాత్మయై
నలఁగన్ పూఁత నఖాలఁ బండ్ల క్షతయై స్త్రైవన యోష్ఠంబు ని
చ్చట గ్రోలంబడి చిక్కి లొకురుల హెచ్చొ జవ్వనిం బోలెడిన్. 286

వ. వర్ష కాలమున వింధ్య పర్వత మేఘజాలములనువలె పెను తీవియల త్రాళ్ళను హనుమంతుఁడె తెంపివైచెను. అక్కడ నందము లీను వెండివి కెంపులవి యగు భూములను బంగారు పూతల చోటులను తిరుగుచు వివిధము లయి యెక్కువ జలంబులతో నిండి మణి సోపానములు గల దిగుడు బావులను అందందు చూచెను. అవి ముత్యాలు పవడములు యిసుక తిన్నెలతోను స్ఫటి కంబుల చప్టాలతోను తన తటంబుల మొలచిన కాంచనవర్ణపు ద్రుమములతోను పుల్ల పద్మోత్పల వనములతోను చక్రవాక కూజితములతోను వారణంబుల ఘీంకారములతోను హంస సారసంబుల నాదములతోను చెట్లచే నావరించం బడిన అమలానుకూలములగు జలములు గల నదులతోను లతాశతమాలలతోను

కల్పవృక్షములతోను నానావిధ గుల్మములతోను కరవీర తరులతోను నిండి యుండెను. అచట కూటములతో విచిత్ర కూటమై శిలా గృహములతో వం నానావృక్షంబులచే నాచ్ఛాదింపబడి మేఘునిబోలె ప్రవృద్ధమైన శిఖరంబులు గలిగి జగత్తునందే రమ్యమయిన యొకపర్వతము నావానర శార్దూలుం డగు హనుమంతుఁడు చూచెను- మఱియు 287

ప్రియు నొడినుండియు వెసఁబడు ప్రియవోలె
పర్వత తటినుండి వడిగఁ బడుచు
అలుగ నాప్తులు నాప నాగిన ప్రియవోలె
నంబులఁబడు చెట్లు లాపఁ దనరి
ప్రణయుఁడు బ్రతిమాల పెనుదిగ్గు ప్రియవోలె
మరలి పాఱుచు వెన్క కరుగుచుండి
దరిసి ప్రియము లాడు దయిత వోలెను హంస
కూతలచేతను గొనబు మీఱి

వఱలు నొకనది హనుమంతుఁ డరసి యచట
దాని దరి పక్షిగణములు తరులు నళినిఁ
బొలుపు జలములు మణిమెట్లు ముత్తియమయిఁ
బరఁగు నిసుక తిన్నె దిగుడు బావిఁ గనియె. 288

మృగ సంఘాల వనాల రమ్యమయి, త్వష్టృస్వాంత నమ్య కృతం
బగు ప్రాసాదములన్ విచిత్రమయి, యత్యాశ్చర్యమై కృత్రిమం
బగు నాకానన పాళి చుట్టుకొనఁగా, నందాలు చిందించి సౌ
భగమై యుండి విశాలమైన దిగుడు బావెంతొ సౌఖ్యం బిడున్. 289

అటఁ బెంపారెడి చెట్లు పుష్ప ఫలరమ్యంబౌ వితానాలతో
పటు సౌవర్ణపు మెట్లు వేదికల నిండౌ; పూవు టీరాలతో
చటులంబై యట సాంద్ర పర్ణములతో సౌవర్ణ వేద్యాళి ము
చ్చటలన్ గొల్పెడి శింశుపా తరువు నాసన్ వాయుజుం డారసెన్. 290

అటు లచ్చో హనుమంతుఁ డుర్వీతలముల్ ప్రాంతస్థ గర్తంబులన్
చటులంబౌ గిరి నిర్ఝర వ్రజములన్ జాజ్వల్యమా నాగ్ను ల
న్నటు సౌవర్ణపుఁ జెట్లుఁ జూచియు సువర్ణాద్రిప్రభన్ నీర జో
త్కట బంధుం డటుఁ జెట్ల కాంతిని లసత్స్వర్ణాత్ముఁ నెంచెన్ దనున్. 291

కనకంబౌ తరులున్ సమానిలములున్ గంపింప నల్లాడు కిం
కిణీ జాలంబులు ఘోషలం దనరుచున్ గ్రేళ్ళుబ్బ నాశింశుపన్
గని యాశ్చర్యము పొంది, పూచి చివురుల్ గన్నట్టి పర్ణాల మిం
చిన యా శింశుప నెక్కి మారుతి యిటుల్ చింతించె స్వాంతంబునన్. 292

ఇటు రామున్ గనఁ గోరి సీత యిపుడే యీవైపు దుఃఖార్తయై
యిటులే యిట్లనుకోక సంభ్రమముగా నేతేర వచ్చున్ గదో
ఇట నాదుష్టుని యీయశోక వన మెంతే రమ్యమై చంపకో
త్కట మైచందన వాసనల్ వకుళ సద్గంధాల రాజిల్లఁగా. 293

వన సంచారమునన్ ప్రియంబు చతురత్వంబున్న యా యేణలో
చన శ్రీరాముని పత్ని ప్రేయసి యవశ్యం బారాముపై బెంగఁ జి
క్కినదై సంధ్యను గొల్వ నాత్మృత నిరీక్షింపంగ నేతేర వ
చ్చును రమ్య ద్విజ రాజి హృద్యరుతయై శోభిల్లు నీయేటికిన్. 294

ఇది యాసీతకు నీయశోకవన మెంతే నానుకూల్యంబుగా
మదికిన్ సమ్మతి గూర్చవచ్చు నిది సమ్మాన్యంబు గావచ్చు, నీ
యదనన్ చంద్రనిభాస్య సీత యెటులేన్ ప్రాణాలతో నున్న నీ
నదికిన్ దప్పక యర్చ చేయ నెటులైనన్ వచ్చు రావచ్చుఁ బో. 295

అని తన స్వాంతములోనన్
హనుమంతుఁడు తలఁచి సీత కయి యటులాగన్
గనుచుఁ బువులు నాకులు నిం
డిన రమ్యాశోకవని నిల్చియు దాగెన్. 296

వ. అట్లు ఆ యశోకవనమును బాగ హనుమంతుఁడంత.

కల్పలతలతోఁ గడు చెట్లతో మీఱి
దివ్యగంధరసాల దీప్తి చెంది
ప్రాసాదహర్మ్యాలఁ బరభృతరుతముల
నందన మటు పక్షులం దనర్చి
కాంచనోత్పల పద్మ బహుళమౌ వాపులు
పీఠికంబళభూమి వేశ్మ లలర
సర్వర్తు సుమశోభఫలయుత వృక్షాలు
పుష్పితాశోకాలు పొలుపు నింప

విచ్చు పలుపూలు తలలపై వింత చూప
శోకనాశ కాశోకములు చొప్పు నెఱప
మొదళు లందుండిపూయుఁగాఁ బూలవంటి
కొండగోగు మోదుగ లుర్వినిండఁ జూచె. 297

చంపక పున్నాగ సప్త పర్ణోద్దాల
కాదుల్ పెరిగి పూవు లలరఁబూచె
మేలిబంగరుఁ గొన్ని నీలికాటుకఁ గొన్ని
జ్వాలఁ గొన్నియు నశోకాలు వోలె
చైత్రరథంబును చారునందనమును
బలె నశోకవనంబు పొలుపు లీనె
పూలజ్యోతులచేత నీలాభ్రమును బోలి
సుమరత్నముల సముద్రమును బోలి

సర్వఋతు పుష్పసముల చెట్లు సౌరభముఖ
మృగగణంబుల పక్షుల మిగులఁ దనరి
సురభియుత గంధమాదన గిరిని బోలి
అయశోకవనము మహాహ్లాద మొసఁగు. 208

ఇటు రమ్యంబగు నాయశోకవనిలో నెత్తై, సమీపాన ము
చ్చటగా శోభిలి, చైత్యము ట్లులరుప్రాసాదం బొకం డచ్చటన్
పటుపై స్తంభ సహస్ర యుక్తమయి శుభ్రంబైన కైలాస మ
స్నటులింపౌ పవడంపు మెట్లు నరఁగుల్ స్వర్ణంబులై యొప్పెడిన్. 209

అది కండ్ల దొంగిలించును
అదియు మిగుల శ్రీలచేత నలరెడి యటులౌ
అది యెత్తయి యుండుటచే
పదమల మగు నాకపమును సరిగాఁ దాఁకున్. 210

దితిజ కాంతల మధ్య సతి కుళ్ళు చీరతో
నుపవాస కృశత నిట్టూర్చి చుండి
ఇదె యువియుని గురుతిడదరి, పాడ్యమిన్
స్వచ్ఛ చంద్రుని రేఖపాటి వెలిఁగె
పొగగ్రమ్ము పెను నిప్పు సిగవోలెఁ దనరారి
ప్రాతఁబచ్చని మేలివలువె ద్దాల్చె
తామర పుష్పంబు లేమి లేక బురదె
మిగులు సరసివలె నగలు లేక

---

పిప. అశోకము = కంకేళి చెట్టు, పున్నాగము = సురపొన్న, చంపకము = సంపెంగ, సప్తపర్ణ = ఏడాకుల అరటి, ఉద్దాలకము = కొండగోగు.

బహుళ చింతచే లజ్జచే వాడి సడలి
వనట నంగారక హస్త రోహిణిని బోలి
మొగమునను నశ్రువులందార మిగుల దీన
యగుచుఁ దిండి తినకె చిక్కి నవద తోఁచె. 301

వనటన్ ధ్యానము దాల్చి దీన యగుచున్ బాధార్తిచేఁ గుందుచున్
తనవారిని ప్రజగాంచకే యసుర కాంతాళిన్ నిరీక్షించుచున్
తన గుంపున్ విడి పోయి కుక్కలకు మధ్యంబడ్డ లేడింబలెన్
మనసే పోవ దిగాలుపడ్డ హృది మౌనంబూను చూపన్ గనెన్. 302

శరదృతువున నీలపు వనచ్ఛాయ తోడ
నలరు భువివోలె జనఘంబు నంటు నొంటి
జడకలిగి సుఖార్హ యయి కష్టములె పడని
యబల దుఃఖ సంతప్తయే నవద తోఁచె. 303

అతిమలినయౌ విశాలాక్షి నబలఁ గృశను
కాంచి హనుమంతుఁడు తగిన కారణముల
నామెయే సీతయై యుండు ననుచు నపుడు
సెంతొ తర్కింప సాగెను హృదయమందు. 304

అపు డాదైత్యుఁడు కామరూపిణియె యబ్జాక్షిఁ గైకొంచు నే
త్రపథిన్ దోఁచెనొ యట్లె యీయబల కండ్లన్ గట్టె నీయింతియో
యపుడున్, బూర్ణ సుధాంశు వక్త్రయయి రమ్యంబైన సద్వృత్తపీ
నపుఁ బాలిండ్లను నొప్పెఁ దొలె దమునున్ దత్సుభ్రు! స్వాంగద్యుతిన్. 305

అనీల మృదుకేశి యాపక్వ బింబోష్ఠి
ఆసుమధ్యమ రతియట్లు తనరె
పూర్ణేందు రుచివోలె భువనాల కిష్టయై
స్తుతతాపసి యటు కూర్చుండె భువిని.

ఆడుపామును బోలి హడలి బుస్సు మనుచు
వలమిన గనచింత వెలుఁగకుండె

పొగ గ్రమ్ము జ్వాలయై భువి భ్రాంతి స్మృతి యౌచు
సక్షిత సంపదవోలె క్షితిని బడియె

అడగి నట్టి శ్రద్ధఁ జనిన యాశఁ బోలి
చెడిన బుద్ధివలె నవిఘ్న సిద్ధిఁబోలి
ఆడరు నపవాదుచే పోవు యశస్సుఁబోలి
రాము విడఁదీయఁ జిక్కిన రామఁ గనియెం. 306

కన్నీరు నిండిన క్రొన్నెలి వంకర
కనురెప్ప కంటిచేఁ గను మృగాక్షిఁ

నప్రసన్న ముఖాన నపు డప్డు నిటూర్చు
మలిన నమండనన్ మండనార్హఁ

గాల మేఘంబులు క్రమ్ము తారనుబోలి
శ్రుతిభిన్న విద్య యట్లున్న సతిని

సంస్కార హీనయై సరియర్థ మిడని వా
క్కును బోలిభూషలు కూడలేని

రాజపుత్రి సీతను విశాలాక్షి ననఘఁ
గాంచి తగినట్టి హేతువు లెంచి చూచి
ఈమె సీతయె యయియుండు నిది నిజంబు
యనుచు తర్కింప సాగెను హనుమ యపుడు 307

ఏయే యెడ సీత నగల
నేయే గతిఁ దాల్చె నని వచించెనొ రాముం
డాయా భూషణ చెట్టుల
నాయా కొమ్మలను ద్రేల హనుమయుఁ గనియెన్. 308

చెవి కుండలములు చెవి దరి
నవుపడెడి త్రివర్ణకములు హస్తములందున్
మివులగ గల మణి విద్రుమ
సువర్ణ కంకణములును రుచులు చెడి నలుపౌ. 309

పడి ఋష్యమూక గిరిపైఁ
బడినవి యీ నగలలోనఁ బరికింపగ న
క్కడఁ బడినవి యిక్కడఁ గనఁ
బడు చుండెను సంశయంబు పడరా దిచటన్. 310

బంగరు పై బట్టయుఁ గాం
చంగ దగినయది గిరిపయి జాటియు దొరకెన్
బంగరు భూషణములు నీ
యంగన పడవేయ దొరకె నవి ధ్వనిచేసెన్. 311

ఇది యెపుడో ధరియించిన
యది గావున మాసిపోయి యగుపించు నిటుల్
ఇదివఱలో దొరకిన వ
య్యెద వలువ వలెనె యిది సిరులెనసిన యదియే. 312

ఆరాము ప్రియ మహిషి బం
గారపుమెయి రంగుగలది కట హృతయయ్యెన్
ఆ రాముని హృది నుండియొ
యేరీతి హరింపఁ బడద యెన్నఁడుఁగానీ. 313

కారుణ్యము చేతను న
క్రూరతఁ దాపంబు చేతఁ గూరిమి చేతన్
ఆ రాముడీ పలుగతుల
నారామ జనకసుత కయి యారాట పడున్. 314

వనిత యనుచుఁ గారుణ్యము
తనపతి వశియించు ననుచుఁ దాపము తన్నున్
అనయంబు నాశ్రయించెను
వని యక్రూరత, ప్రణయిని యని కూర్మి కనెన్. 315

అంగ ప్రత్యంగములన్
హంగును నాసౌష్ఠవంబు నీసతి కేటులుం
డుంగదొ యటె రాముని కుం
డుంగద: రాముని కటు సులోచన కుండున్. 316

ఈదేవి మానసమ్మా
యాదేవునియందు మఱియు నాదేవు మనం
బీదేవియందు స్థిరమగు
నాదాననె క్షణమె యైన ననఘుఁడు బ్రదుకున్. 318

ఈమెయె లేకుండఁగ నా
రాముఁడు జీవించె నన్న గరము దుష్కరమే
రాముఁ డితఁడు శోకంబున
నీమెకయి ప్రణాశ మొంద కెసఁగఁడు కాదే. 318

కొనియాడఁ దగిన సీతను
కొనియాడఁదగిన గుణములఁ గూడిన రామున్
గొని యాడి మరల నిట్టులు
మనమునఁ జింతాపరుఁ డయి మారుతి నిలచెన్. 319

అతఁ డొక త్రుటి ధ్యానించిన
మతి గలవాఁ డటుల నయి మసలుచుఁ గన్నీ
రతిగఁ గనుల నడ్డ, జనక
సుతఁ గూర్చి హనుమ మహౌజనుఁడు విలపించెన్. 320

గురు శిక్షితుఁ డగు లక్ష్మణు
డెఱిగియు మన్నించు; గురువగు నీరామునికిన్
పరమ ప్రియ సీతయు వగ
తెఱవులఁ బడెఁ గాలము దురతిక్రమముగదా 321

సతి రాముని నిశ్చయమును
మతియుతుఁ డగు లక్ష్మణు స్థిరమతియు నెఱుంగున్
మతియుత జానకి కావున
* అతిగా క్షోభిలదు గంగ యటు వానలలో. 322

సమము కులము లక్షణములు
సమములు వృత్తంబు వయసు సౌశీల్యంబున్
సముఁ డైన రాముఁ డీమెకు
సముఁడే యగును, నసితాక్షి సమ యాతనికిన్. 323

ఈవిశాలాక్షికై యావాలి హతుఁ డయ్యె
బలి, రావణసమ కబంధుఁ డడఁగె
ఈవిశాలాక్షికై యింద్రుచే శంబరుఁ
డట్లు భీమ విరాధుఁ డనిని జచ్చె
ఈవిశాలాక్షికై యెంతొ క్రూరులు వేల
దైత్యుల్ హతులు జనస్థానమందు
ఈవిశాలాక్షికై ధృతతేజు రాముచే
త్రిశిర దూషణఖరుల్ నిహతు లైరి

ఈమె హేతుచే సుగ్రీవుఁ డెనసె సిరులు
ఈమె హేతుచే జలధి లంఘించినాఁడ
ఈమె హేతుచే నీలంక నేను గంటి
ఈమె హేతుచే నిట సంభవించె నిన్ని. 324

---

* వర్షాకాలములో హిమాలయము మంచుతో నిండియుండును. కాన బురదరాదు. కాన నీరు బురదగా నుండదుగాన క్షోభిలదని వర్ణించి పోల్చెను.

చతురంభోనిధి వేలా
వృతయగు సర్వమతియు నెల్ల జగము లీ
సతి సీతకొఱకు రాముం
డు తల్లక్రిందు డొనరిచి నను గడు నుచిత మనెదన్.

త్రైలోక్య రాజ్య మైనను
పోలద యీజనకరాజు పుత్రికి నెపుడున్
త్రైలోక్య రాజ్య మఖిలము
తాళదు జానకి తనువు శతాంశకుఁ గాని.

ఈమె ధర్మాత్ముఁడౌ నామహాత్ముఁడు మిథి
లేశు కూఁతురు పతి ధృఢ మనస్క
ఈమె నాగటి దున్ను నిష్టి భూమిని జీల్చు
కొని పుష్పొడిగ పూసికొనియె దుమ్ము
ఈమె యాజి మరల కెంతొ వీర్యము చూపు
శ్రేష్ఠ దశరథుని జ్యేష్ఠ వధువు
ఈమె కృతజ్ఞుఁడౌ నా మహాత్ముఁడు రాము
ప్రియ ధర్మపత్ని యౌ దయిత సీత

ఈమె ప్రియు స్నేహమున సుఖా లెల్ల వదలి
వ్యథల లెక్క పెట్టక శూన్యవనికి వచ్చి
ప్రియుని గొల్వ మూల ఫలంబులే భుజించి
భవనమునఁ బోలె నుండి యీ పాట్లు పడియె.

ఈమె సుస్మిత భాషిణి హేమగాత్ర
బాధలను పొందరాని బాధలోర్చె
రావణార్త శీలవతిని రాముఁడిపుడు
పడయఁ దగుఁ బిపాసార్తుఁడు ప్రపను బోలె. 3

నష్ట రాజ్యుండు రాజ్యంబు పొందియ వోలె
నీమె మరలఁ బొంది రాముఁడలరు
కామభోగములేగఁ గల బంధులను వీడి
రాముఁ గోరుచు శరీరమును నిలుపు
ఫల పుష్ప వృక్షాల ఖలరాక్షస స్త్రీలఁ
గనక రామునినె యొక్కనినె తలఁచు
భర్త నారికి భూష భర్త గానక యీమె
భూషార్హ భూషలఁ బొంద కవియు

ఈమె లేకుండ మెయిఁదాల్చి రాముఁడిపుడు
దుష్కరము చేసె, వ్యథనుండి తొలఁగలేఁడు
అసిత కేశాగ్రను శతపత్రాభ నేత్ర
వ్యధిత, భోగార్హఁగని నేను నలిసిపోతి. 329

ఏసతి యోర్పున క్షమవలె
భాసిలి సౌమిత్రి రామపాలిత యయ్యెన్.
ఆసతి నేఁడో వికృత వి
లాసల రాక్షస వనితల రక్షణ మ్రగ్గున్. 330

మంచున మాడిన నళినిని
మించి, యెపుడును వ్యసనములు మిగులగ జంపన్
పంచన తన సహచరునిన్
గాంచని చక్కవ వలె సతి కడగండ్లఁ బడెన్. 331

ఆ కుసుమ భారమున భువి
సోకు నశోకములు సతికి శోకమె గూర్చెన్.
తాక వసంతము, వేలుగ
ప్రాకిన కిరణముల శశియు వ్యథనే గూర్చెన్. 332

అని యిటు లాలోచించుచు
హనుమంతుఁడు సీత యీమె యని స్థిరమతితోఁ
గని యాశోక వనమున
ననితర దృష్టిఁ దరువుపయి నటె కూర్చుండెన్. 233

వ. అంతటఁ దెల్లఁ దామరల రాశివోలె నిర్మలమైన చంద్రుఁడు హంస నల్లని జలమువలె–నీలాకాశమున నవ్వలి భాగమునకు వెళ్లుచు నిర్మలకాంతులు గల యాచంద్రుఁడె స్నేహమును తెలుపువాడువలె వాయుజుండైన ఆ హనుమంతుని జల్లని కరములచే సేవించెను. అపుడా హనుమంతుడు శోకభారములచేఁ గ్రుంగిన యా పూర్ణచంద్ర తుల్యాననయగు సీతను బరువుచేఁ గ్రుంగిన నావను బోలె చూచెను. అట్లు మారుతి సీతను జూచుచునె దగ్గఱ గూర్చుండిన ఘోరాకారము గల పలువిధములైన పలువిధముగల రాక్షస స్త్రీలను జూచెను. అందు 234

ఒంటి కంటి దొకతె – ఒంటి చెవి దొకతె
తలఁగప్పు చెవులతో తనరు నొకతె
చెవులె లేని దొకతె, చెవుల మేకుల దొర్తి
ఎత్తైన ముక్కుది యెంతొ తలది
పొడుగు సన్న మెడది విడిన వెండ్రుకలది
అసలె వెండ్రుక లేమి యెసగ నదియు
కంబళ్ళ కురులది లంబోష్ఠి చుబుకోష్ఠి
లంబ జానువులది లంబపక్త్రి

బిట్టు వేర్లాడు పాలిండ్లు పొట్ట గలది.
పొట్టిది వికార మరగుజ్జు పొడుగు గలది
గూనిది, కరాళ, ఘోర, వంగున్న తలది
పచ్చ కండ్లది వికృతాస్య వరలె నచట. 235

వ. మఱియు నచట

విక్రృతవేషలు కొంద ఱొకరు పింగళ వర్ణ
లొకరు కోపిష్ఠ లొకరు నలుపు
కలహప్రియ లొకరు, కాలాయసపు శూల
కూట ముద్గరకుల్ కొంద ఱచట
పులి లేడి పందుల పోతు మేకల మొగాల్
నొట్ట మొగాల్ గల సుదతు లొకరు.
ఒంటె గుఱ్ఱము లేగ్గువంటి కాళ్ళుల వార
లొంటి కేలొంటి కా లున్నవారు.

క్రోతి గాడిద గుఱ్ఱము గోవు నేన్గు
చెవుల వారు, ముక్కు లేక చెడ్డ ముక్కు
అడ్డ ముక్కు, నేనుఁగు ముక్కు నతిగ నుదుటి
పైకి నెగ నూర్చు ముక్కున్న వారు గలరు. 336

కాళ్ళు చేతులలోన ఁగాళ్ళలో శిఖలొప్ప
ఆవు కాళ్ళు పెనుకా ళ్ళలరువారు.
పెద్దతలల్ మెడల్ పెద్ద పొట్టలు చండ్లు
పెనునోర్లు నాల్క పెన్ కనులవారు
హస్తి గోసూకరీ హయ ఖర మేషోష్ట్ర
ముఖలు ఘోరాకార ముఖము వారు
ధూమ కేశులును నెత్తురులను మాంసంబు
వొంటిఁ బూసికొనుచు నున్నవారు

రక్త మాంసాలు భుజియించి గ్రోలువారు
కల్లు రక్తంబు త్రాగి మత్తిల్లువారు
రాక్షసస్త్రీలు చెట్ల మూలాన నొకెడఁ
జుట్టుకొన నొళ్ళు ఝల్లనఁ జూచె హనుమ. 337

అట నావృక్షముక్రింద జాలిగ, ననింద్యాకారయై హర్షమే
మటుమాయంబయిపోవఁ బొల్పఱి కురుల్ మాలిన్యముంజెంద ముం
దటి పుణ్యంబు క్షయింప జాఱిపడు నాతారన్ బలెన్ దీనయౌ
చటులాక్షిన్ జనకాత్మజన్ హనుమ శ్రీసంపన్నుఁ డంతన్ గనెన్. 338

పావనశీలయై పతిదర్శనమె లేమి
నగలు వీడి పతిగుణాలె దాల్చి
యూథమున్ విడి సింగ మొడిఁబడ్డ కరిణి య
ట్లాప్తుల విడి యయ్యె నసుర వశము
శరదంబు దావృత శశికళవలెఁ దీగ
లేని వీణియవోలె క్లేశ మొంది
పతియంకమున హాయి వఱలిన జానకి
రాక్షసీ కారలో మ్రగ్గు చుండి.

మింట గ్రహమధ్య రోహిణి వంటి దగుచు
ఆయశోక వనాన దైత్యాళి స్రుక్కి
విరులులేక శూన్య మగు తీవియనుబోలు
నట్టి దీనయౌ జానకిన్ హనుమ కనియె. 339

దుమ్మంటి సీత-పంకమ్మునఁ బద్మిని
వలె మేని ద్యుతి వెల్గు; వెలుగ దార్తి
నలిగిన మలినపు వలువ దాల్చి స్వశీల
రక్షతోఁ జెఱులేడి లాగు చూచు
పతితేజున నదీన భావయయ్యును దీన
యయి భీత మృగ కన్య యటులు హడలు
వగల గ్రోగటు, లేచువగల కెరట మటు
కడునూర్చు విరిచెట్లు కమిలి పోవు

అట్లి సీత క్షమను విభక్తాంగి ననఘ
నగలె లేకయు భాసిలు నలివ నయనఁ
గని హనుమ పొంగి హర్షాశ్రు కణము లురల
రాము లక్ష్మణు మ్రొక్కి వృత్రముల దాగె. 340

హనుమంతుం డటు చెట్టుకొమ్మపయిఁ బత్రాచ్ఛాదనన్ దాగి యుం
డ నికన్ రాత్రియుఁ దెల్లవాఱుచును నుండన్ వేదవేదాంగ సై
పుణి యేపారఁ గ్రతుల్ పొనర్చుచుఁ గరంబున్ బ్రహ్మరక్షస్సు లం
తను గావించెడి వేదఘోషము లటన్ మార్మోగుచుండెన్ గడున్. 341

అవలన్ శ్రోత్ర మనోహరంబు లగు వాద్యంబుల్ శుభ ద్యోతకం
బవుచున్ మ్రోయ మహాభుజుం డయిన దైత్యాధీశుఁ డారావణుం
డవి మేల్కొల్పఁగ లేచి యంబరము మాల్యంబుల్ వడిన్ జాఱ లో
న విదేహాధిప పుత్త్రి నెంచుచు స్మరోన్మత్తుండ యయ్యెన్ దమిన్. 342

అతఁ డాకాముని వేగ మాపుకొనలే కవ్వేళ భూషా విభూ
షితుఁడై యుత్తమ దేహలక్ష్మితగఁ జొచ్చెన్ గేళి శైలాఢ్యమున్
తతపుష్పాంచిత వృక్షరాజమును నానాపుష్ప భాస్వత్సరో
నుతమున్ రమ్యతర మ్మశోకవనమున్ నూత్నప్రభా చిత్రమున్. 343

కన సొంపౌ వృక చిత్ర పంక్తుల మనోజ్ఞంబైన మార్గంబులన్
గనుచున్ భాసుర రత్న తోరణము లింకన్ దాటి నానా మృగ
ప్రణుతంబై తగు నాయశోకవనికిన్ భామాశతంబుల్ వడిన్
దను వెన్నంటఁగ దేవతాంగనలతోఁ దచ్ఛక్రుఁ డట్లుల్ చనెన్. 344

బంగారు దీపికల్ పట్టి రొక్కరు స్త్రీలు
వింజామరు లొకరు వీవనలును
పసిఁడి పాత్రల నీరుపడిఁ దెచ్చి రొక్కరు
కత్తులావా స్తరణము తెత్తు రొకరు

కోవిద యొక్కతె కుడిచేత రత్నపుఁ
దాంబూలపేటిక దాల్చి నడచె
కలహంసఁ బోలెడి వెలిగొడు గొక్కతె
యొకతె బంగరు దండ మూని నడచె,

నిదురమత్తున సోలిన నేత్రగుముగళి
వఱలు ప్రమదల్ మెఱపు ఘనుల్ బలె భజింత్రు
చెల్లుచెదరు కురులు చెమ్మగిల్లి మొగము
వెడలు గంధముగల స్త్రీలు విభుని గొల్తు. 345

వ. కొందఱు ప్రియభార్యలైన మదిరాక్షులు-

అందియలు తల్లక్రిందులు
గం దాలిచి, మత్తుమిగులఁ గడునిద్దురచే
అంగ సుమములు చెమట నలు
గం, దైత్యపతి ననుసరింత్రు కామత గురుతన్. 346

ఆమదిరాక్షుల పతి యటు
కామపరాధీనుఁ డగుచుఁ గడుమందుండై
ఆమైథిలియుం దెక్కడు
వ్యామోహంబునఁ గదలె మదాంచిత గతిన్నై. 347

లలిత గాత్రల మొలనూళ్ళ గలగలలును
అందియల చప్డు హనుమంతుఁ డాలకించి
యసమకర్మ లచింత్య శౌర్యంబు గలుగు
రావణుఁడు ద్వారసీమ చేరంగఁ గనియె. 348

వ. అంత గంధ తైలములచేఁ దడుపఁబడిన యనేక దీపికలను ధరించి ముందుగ నడువ ఆ ప్రకాశములు తన్ను ప్రకాశింపఁజేయఁగా గంధర్వ మద ములతో మీఱి వంకర యెత్తని కన్నులు గల యా రావణుఁడు ధనుస్సును

ధరింపని మన్మథుఁడువలెఁ బ్రకాశించుచు మదించిన యమృతపు నురుగువంటి స్వచ్ఛమైన వలువ అంగదములకుఁ దగిలి లీలఁగా వ్రేలుచుండ రాఁగా ఆ రావణుని, పత్రపుష్ప సమూహములచేఁ గప్పంబడిన హనుమంతుండు తేఱిపాఱఁ జూచెను. అపుడా రావణుడు రూప యౌవన సంపన్నలును, సురూపలు నగు శ్రేష్ఠస్త్రీలు చుట్టుకొన మృగ పక్షి ఘోషలతో నిండిన యా ప్రమదావనమును జొచ్చెను. ఆరావణుఁడు బలిసిన శరీరమున విచిత్రాభరణములను దాల్చి తారలచేఁ జుట్టబడిన చంద్రునివలె ప్రమదలచేఁ జుట్టుకొనఁబడి రాఁగాఁ జూచి ఇతఁడే యామహాబాహువైన రావణుఁ డయి యుండు నని తలఁచి యాహనుమంతుఁడు చెట్టుమీఁదనే కొంచెము జరిగి కూర్చుండి శ్రద్ధతో పత్రములచాటుగానుండి చూచుచుండెను. అపు డారావణుఁడు నల్లని కురులు శుభమైన శ్రోణులు కలిసి దగ్గరగా స్తనములు గల యాయసితాపాంగి వైపుగ మరలెను. 349

సరిగా నపుడె యనిందిత
వరవర్ణిని యగు జనకజ వరభూషితు భా
సుర రూపయౌవను దశాస్యు
నరసి తుపానున నరంటియుటుల వణంకెన్. 350

తొడలన్ చుట్టును గప్పి ముడ్చికొని, యెంతో బాహులన్ జన్నులన్
వడిగా హత్తుక కూరుచుండి, కనులన్ గన్నీరు గాఱంగ నే
డ్చెడి యాదీర్ఘ విశాలనేత్ర నసురస్త్రీల్ చుట్టుకూర్చుండి ము
ట్టెడి యవ్వేళ దుఃఖమోధిఁ జిక్కు * తరి నట్లీ రావణుం డారసెన్. 351

కటికనేలను నుండి కష్టవ్రతము పూని
4 కొట్ట నేలనుబడ్డ కొమ్మఁ బోలి
మఱికియై చిత్రమై పొలుచు మేనున నగల్
వీడి, బురదఁ దమ్మి తూడుఁ బోలి

* తరి = నౌక.

రాజ సింహుఁడు రఘురాముని వడిఁ జేర
కోర్కెల గుత్తులఁ గూడిపోయి
ఏడ్చి యెండుచు నొంటి నెటొ ధ్యాన దుఃఖార్తి
శోకపు టంతును జూడలేక

దొరలి, మంత్రబద్ధ భుజంగి నరణి గ్రుక్కి
క్రుద్ధ ధూమకేతు గ్రస్త రోహిణి యయి
వృత్తశీల కులాచార విధితు లింటఁ
బుట్టి దుష్కులజ వలెను పొసఁగి తనరె. 352

పట్టిదౌ నపవాదఁ బడిన కీర్తి వోలె
సరగఁ ధిక్కృతమైన శ్రద్ధవోలె
క్షీణించి పోయిన శ్రీశు నర్చన వోలె
అతిగఁ బ్రతిహతయౌ నాశ వోలె
ధ్వస్తమై పోయిన ధనలబ్ధి వోలెను
వ్యర్థమై పోయిన యాజ్ఞ వోలె
ఉత్పాత కాలంపు టుజ్జ్వల దిశ వోలె
యుపహరింపఁ బడిన యర్చ వోలె

క్షతనళిని వలె హతభట సైన్యమువలె
తమసుమ్రింగు కాంతివలెఁ దప్తనది వోలె
పాడు వేదిక వలె నాఱు వహ్నిశిఖను
బోలి, గ్రస్తేందు నిశవలెఁ బొలిచె సీత. 353

తమ్ములాకులు తెంపి తటిమి పక్షుల నేస్త
కరమున బీకిన కమలిని యయి
గండి కొట్టఁగ నెండి గాసిల్లు నది యయి
కృష్ణపక్ష నిశ యట్లెసఁగుచుండి

సుకుమారి సుకులీన శుభరత్న గృహయోగ్య
యయి పీక నెండిన యబ్జిని యయి
యూధేశు విడి స్తంభమొక్కటం గట్టని
ట్టార్చుకరిణిం బోలి యుర్వి స్రుక్కి

ఒకజడయె వేసికొని యత్న మొకటిలేక
శరదృతునఁబొప్పు వనిచేత ధరణివోలె
నామె యుపవాసకృశయౌచు వ్యధను భీతి
ధ్యానమున, స్వల్పమే తిని దైన్యానఁ గుములు. 354

రావణుని కపమానము రామువల్ల
నగును గాకని కోరుచు న్నట్టులుండి
యేడ్చుచు ననింద్యయై రామునెడల వ్రతము
పూని యున్న జానకి దరిఁబోయె నసుర. 355

వెడలి యట, మంచి ఱెప్పలు, కడను నెఱుపు
మధ్యఁ దెలుపున్న కండ్లతో మహిత యయ్యు
దీనయై హర్షమే లేని జనక సుతను
ప్రకట మధుర లోభోక్తి రావణుఁడు పలికె. 356

కరి నాసోరు! ననుంగనుంగొనుచు నంగాలకున్ గప్పుచున్
వెఱచే నిన్నిటు దాచు కొందువు, ప్రియా! వేగన్ విశాలాక్షి నన్
మఱియాదన్ గను సర్వగాత్ర గుణరమ్యాంగి! త్రిలోకీ మనో
హరి! కామించియె నిన్నుఁ దీసికొని నాయాస్థానికిన్ వచ్చితిన్. 357

ఇటు మర్త్యుల్ వరకామ రూపు లసురుల్ వీక్షింపనే లేర యి
చ్చట నావల్లను నిట్లు నీకయిన త్రాసంబింకఁ జాలింపుమీ
యిటు లన్యప్రమదాళిఁ బొందుట,బలాత్కృత్యాన భీరూ! హరిం
చుటయున్ దైత్యులకున్ స్వధర్మమె సదా సందేహమే లేదిటన్. 358

ఇఁకనా మేననొ పూర్తిగా మదనుఁడున్ స్వేచ్ఛన్ బ్రవర్తించుఁగా
క కరంబేనొ యకామమైన్ నినుఁ దాకన్ సీత! నన్నార్చి నీ
వా కడున్ భీతిల రాదు నమ్ము నను, నన్నె ప్రేమతోఁ జూడు నీ
విఁక తత్త్వంబుగ శోకలాలసవు కానే రాదుసూ! ప్రేయసీ! 359

ఒకటే వేణి, ధరిత్రి శయ్య ముటికై యుండెన్ దుకూలం బెదో
యొకటే ధ్యాన మకాలమందునుగరం బుగ్రోపవాసంబు లెం
దిఁక నీకివ్వి యయుక్తమౌను, నను నీవె పొంది మోదింపు పల్
రకమౌ మాలలఁ జందనాగురులఁ దూర్యాల్ గీత నృత్యంబులన్. 360

ప్రమదారత్నమ వీవ, యుండకిటు, సర్వాంగంబులన్ భూష లుం
చుము పల్‌పానము లాసనాలు శయనాల్ శోభిల్ల సేవించి హ
ర్షము నీవొందుము, నన్నుఁ జేరి యిట లేలా యైతి విట్లుండ న
ర్హము కా, దీ నవయౌవనంబును చనున్ రాదింక స్రోతస్సటుల్. 361

విను సృష్టించియు విశ్వకర్మ యిఁక దేనిన్ జేయుటే మానె నం
చును నెంతున్ శుభదర్శనా! యుపమ యిచ్చో నీకెటన్ లేదుసూ
నిను సద్యౌవన రూపశాలినిని నిందే పొంది సాక్షాత్తజుం
డును గొల్చున్ గద యన్యుఁడే డయిన నిన్నున్ గొల్వకే దాటునే. 362

ఏది యొది నీయంగము చూ
చెద నటనట నాదుదృష్టి చెదరక నిలుచున్
సుదతీ! సుధాంశు వదనా!
యిదె నాసతి వగు; శ్రమ విడు మిఁక సుశ్రోణీ! 363

ఇట కయ్యేయెడనుండి తేఁబడిన యాయేణాక్షులం దెల్లరన్
జటులాక్షీ! యిఁక నీవ శ్రేష్ఠవు సమస్తక్షేమముల్ పొంది యి
చ్చట నీవొందుమి నాదు నగ్రమహిషీ స్థానంబు, లోకాల నుం
డిట నేఁ దెచ్చిన రత్నముల్ సకలమౌ నీరాజ్య, మేన్ నీవియే. 364

ఎదుటన్ నిల్చియు నన్నెదిర్చెడి ఘనుం డెవ్వండు లేఁ డీభువిన్
ఇదిగో చూడు రణోర్వి నాకుఁ బ్రతిగా నేవీర్యమున్ లేద, యుం
డదు, వల్మార్లు సురాసురుల్ ధ్వజము లెల్లన్ గూల నిర్వీర్యులై
యెదురై యుద్ధములందు నిల్వకయె యెందే డాగి యున్నారుగా. 365

కమకన్ యోచన చేసి స్వేచ్ఛగ నలంకారంబు గావించుకో
నను కాంతుల్ తులకించు భూషణము లెన్నో నీదు నెమ్మోముపై
ననువౌ రీతి నలంకరించు కొను నెయ్యం బార నేఁగాంచి మె
త్తును భోగంబులఁ బొందు త్రాగు తిను నాతో భీరు క్రీడింపుమీ. 366

భువియెౕ ద్రవ్యమొ దాన మిచ్చుకొను, నీవున్ స్వేచ్ఛ నాతోడ నిం
క విహారంబులు చేయు, నమ్ము నను, నాజ్ఞాపింపు నీకిష్టమై
న విధానన్ మదనుగ్రహంబుసనె యానందించి నీకైన బాం
ధవులన్ దన్పుము,చూడు నాయశము భద్రా! చూడు మచ్ఛీప్రభల్. 367

తనువున నారబట్టలను దాల్చిన రామునితోడఁ గూడియే
మొనరుతు, వెల్లశ్రీలు చన నోడి వనాలకుఁ బోయి వట్టినే
లనుబడి దొర్లుచున్ వ్రతములంబడి ప్రాణముతోడ రాముఁడుం
డునొ చనిపోయెనో యని వడిన్ సుభగా! మది శంక గల్గెడిన్. 368

మునుముందేగు బలాకలన్ నలుపులై పొల్పారు మేఘాలు మిం
టను గ్రమ్మన్ గనరాని వెన్నెలటు గండ్లన్ గానఁగా రాని యీ
నిను వైదేహిరో! రాముఁ డెప్పటికిఁగానీ చూచు నంచున్ మనం
బున నేమాత్రపు టాశతో నయిన నోహూఁబోఁడి! నీవుంటివే. 369

సురపతి చేతుల నుండియె
హిరణ్యకశిపుఁడు స్వకీర్తి నెటులాగె, నటుల్
నరుఁడగు రాముఁడు నా
కరములనుండి నిను లాగఁ గలడే యెటులన్. 370

సువతీ! సుస్మితా! సునయనా!
పదపడి గరుడుండు పాముబలె నామనసున్
అదటున నీవో భీరూ!
కదలింపఁగఁ జేసి లాగఁ గలిగితి విట్టుల్. 371

నలిగిన పట్టు దుకూలము
గలిగి యలంకారములను గలుగక యిట్టుల్
మలినపయిన నిను గని నా
పొలతులయందో సుఖంబు పొందను జుమ్మీ. 372

అంతఃపురమ్మున నుండుచు
సౌందర్యగుణంబు లేని సుదతులు మిగులన్
ఎంతగ నుండిరొ యాయా
యింతుల కందఱకు నీవ యీశ్వరి వగుమీ. 373

నల్లనగు కురులదానా!
అల్ల త్రిలోకంబులందు నధికలై యగు నా
ల్లాజవదన లచ్చర
లెల్లరు లక్ష్మినటు నినుభజింతురు సుమ్మీ. 374

ఎవి యాకుబేరు దరి ను
న్నవొ యారత్నమ్ములును ధనమ్ములు మఱి యా
భువనములు హాయిగాఁ గొని
కలిసియు నాతో సుఖింపు గడు సుశ్రోణీ. 375

బలమునఁ దపసున విక్రమ
ముల ధనమునఁ దేజసునను పొలుపగు కీర్తిన్
అల రాముఁడు నాతో భూ
తలమున సరి కాఁడు దేవి తగు నటుగనుమీ. 376

ఇటు పయి హాయి ద్రాగు విహరింపు రమింపుము సర్వభోగముల్
ఇటఁ దలమున్కఁగా ననుభవింపు, ధనప్రకరంబు ధాత్రి మి
క్కుటపుగ నిత్తు నాపయిని కూరిమి చూపు యథాసుఖంబు ము
చ్చటఁగఁ జరింపు నిన్ గలిసి సర్వహితుల్ సుఖియింత్రు గావుతన్.
377

విరిసిన తరు జాలములన్
మురుపగు భ్రమరములు ముసురు పుష్పవనాలన్
సరసాంబుధి తటజములన్
జరింపు హాయిగ నను గొని సరసాంగములన్. 378

అటు రౌద్రుం డగు రావణాసురుని వాక్యం బెల్ల నాలించి యుం
దట దీనంబుగ నార్త దీన యయి సంతాపాన బిట్టేడ్చి యు
త్కట దుఃఖాన వణంకుచున్ దయితునే ధ్యానించుచున్ మెల్ల నం
తట శుభ్ర స్మిత సీత పల్కె తృణము న్నడ్డంబుగా నుంచియున్. 379

మఱి నన్నుండి మదిన్ మరల్చి స్వజనంబందే మనస్సుంచు మె
త్తఱఁ బాపాత్ముఁడు సిద్ధినట్లు నను పొందం గోర యుక్తంబుగా
దురువంశోద్భవ నేఁ బతివ్రత; నిటుల్ న్యూనంపుఁ గార్యంబు నె
త్తఱిఁ జేయందగ దంచు రావణు రవంతన్ జూడకే యిట్లనెన్. 380

పరుభార్యన్ సతి నైన నేను నెటులన్ త్వద్భార్యగానుండు టె
త్తఱి నన్యాయమె, సాధువంథ సరిగాఁ దర్కించి సాధువ్రతం
బెఱుకం గల్గి చరింపు స్వీయసతి నట్లే యన్యలౌ దారలన్
అరయంగా దగు నంచు నెంచి నిజభార్యన్ గూడి మోదింపుమీ. 381

తన భార్యలయెడ సంతు
ష్టిని గనకున్న చపలు నవశేంద్రియచిత్తున్
అనయము శఠుఁ డగు వానిని
గని పరసతులు నిరసింత్రు క్ష్మాతలిలోనన్. 382

ఇటు సుజనులు లేరో, యు
న్నటువంటి సుజనులఁబట్టి నడవవొ నీవున్
అటు గనుక ననాచారత
నిటు విపరీతంపు బుద్ధి యిప్పుడిటుఁ బుట్టెన్. 383

చతురులు వక్కాణించిన
హితమును మిథ్యగ గ్రహించి యీయఖిలంబౌ
దితిజుల నాశము కొఱకై
హితోపదేశంబు వినక యిటు లైతివిగా. 384

సుకృతాత్ముఁడు గాకయు నీ
తికి భిన్నముగ నడుచు నృపతిని నిను గొనియా
సకల సమృద్ధపురంబులు
సకలం బగురాష్ట్రములును సరగ వశించున్. 385

ఇటులే రత్నపు రాసులఁ
బటువగు నీలంక నిన్నుఁ బడసియు నీ యు
త్కట మగు నపరాధముచే
చటుకున నీవొకడగాక సర్వం బడంగున్. 386

దూరపు దృష్టియు లేక సు
రారాతి ! స్వయంకృతాపరాధమ్ములచే
ధారుణిఁ జెడు నిను పాపిని
నారసి భూతంబు లెల్ల నానందపడున్. 387

నీచే వంచితు లగు ప్రజ
నీచుని పాపిని నిను గని నిజముగ నిపుడే
మా చేసిన పుణ్యముచే
నీచుఁడు రౌద్రుఁ డడఁగె నని నెమ్మది మెత్తుర్. 388

ధనమున నైశ్వర్యమున వ
యినను నను ప్రలోభపెట్టి యెటులను స్వవశం
బొనరిచి కొనలే, వారా
మునికి నభిన్నను తరణికి భువిఁ బ్రభ వోలెన్. 389

భువనేశుని సత్కృత బా
హువు తలగడగా ధరించు యోగ్యను నేనో
భువి నెవ్వఁడో యన్యుని బా
హువు తలగడగా ధరించు టొప్పదు సుమ్మీ. 390

నే నాసముద్ర వలయిత
భూనాథుని ధర్మసతిని భువిలో యోగ్యన్
జ్ఞాని విదితాత్ముఁడు వ్రత
స్నానము చేయు ఘను విద్య చాడ్పున నసురా ! 391

మంచిది రావణ ! యిటు దుః
ఖించెడి నను రాముతోడ నిఁకఁ గలుపుమి, బం
ధించిన యేనుగు వధువును
గాంచియు గజవరునితోడఁ గలిపిన యట్టుల్. 392

నిలుచుండఁ జోటు గోరు సె
డలఁ గానీ, ఘోరవధ యెడల వ్యథ యున్న
ట్టులయినఁగానీ యీనర
బలాముఁ డగు రాము మైత్రి ప్రార్థింపఁదగున్. 393

వరధర్మజ్ఞుఁడు రాముఁడు
శరణాగత వత్సలుఁ డని జగమె యెఱుంగున్
ధరలో బ్రదుకం దలచినఁ
ద్వరగా నారాముమైత్రి వాంఛింపు మిఁకన్. 394

శరణాగతవత్సలుఁ డె
చ్చెఱఁ గని యనుగ్రహింపఁ జేసికొను మింకన్
కరము ప్రయతుఁడ వయి వడిగా
పరిగియు నను నప్పగింపు మర్హపు విధితో. 395

నను రఘురాముని కర్పిం
చిన యెడ నీకు శుభంబు చేకూరును న
ట్లొనరింపవ, రావణ! కను
గొను మిదె నీచావు దెచ్చికొందువు సుమ్మీ. 396

వర్జించు వజ్రి వజ్రము
వర్జించును యముఁడు గాల పాశము గూడన్
వర్జింప మనుచు గోరిన
వర్జింపఁడు రాముఁ డలిగి త్వద్విధు నెపుడున్ 397

అమరేంద్ర ప్రవిముక్త వజ్ర రవమో యన్నట్టు లారాము చా
పము ఘోషంబుల విందు వింకను సుపర్వాల్ గల్గియున్ మండు స
ర్పము లట్టుల్ వడి రామలక్ష్మణుల పేరన్ మీఱు బాణంబు లు
గ్రములై నీదు శరీర మందుఁ బడినం గానీ కనుల్ విప్పుదే. 398

వెస నీలంకను గ్రమ్ముచున్ దనుజులున్ వేధించుచున్ జంపు వా
డి శరంబుల్ పయిఁజోటెలేనటుల మింటిన్ గప్ప నీక్రూర రా
క్షస సర్పంబుల రాముఁడున్ గరుడి మ్రింగన్ వచ్చు, నాభర్త త్వ
ద్వశమందున్న ననున్ త్రివిక్రముఁడు దైత్యశ్రీ నట్లు లాగుంజుమీ, 399

కుహనాకారుల దైత్యులన్ బతి వడిన్ గూల్చన్ జనస్థానమో
నిహత స్థానము కాఁగ దుర్బలుఁడవై నీవట్టు లాశూన్యమౌ
మహనీయాశ్రమమందు దూఱి యెటకో మావారుపోవన్ వడిన్
గుహనావేషము పూనినా వధమ! సిగ్గున్ వీడ స్త్రీచౌర్యమున్. 400

పులిగంధం బది నోఁక గ్రుక్క నిలవం బో దట్టిసౌమిత్రి రా
ములగాలేనియు పోకు మాత్ర నిలువంబో వట్టి యాత్రాతలన్
గలనన్ గెల్చు టసంభవంబ యిఁక నొక్కండే కరర్ముబున్న వృ
త్తి లయంబున్ బొసరించు నిం్దు భుజముల్ వోలెన్ఘ్నుల్
గూల్తునిన్. 401

రయమున లక్ష్మణుతోనా
దయితుఁడు-రవి జలమటు-భవ దసువులు తీయున్
యము వరుణ కుబేరుల నా
శ్రయించినను తరుఁబిడుగటు-రాముఁడు విడునే. 402

అటులన్ విదేహసుత కడుఁ
గటువుగ బరుషోక్తులాడఁ గని రావణునితో
యిటు ప్రియదర్శన జానకి
నిటు లప్రియవాక్యముల వచించెను మిగులన్. 403

ఎటు లెట్టుల బ్రతిమాలు నో
యటు లటు స్త్రీలకును వశ్యుఁడగుఁ బురుషుఁడు తా
నెటులెటు ప్రియముల పలుకునో
యటులటు లవమాన మొందు నాయింతులచే. 405

నీవయిఁ గల కామమె నా
కోపము నిపు డాపిపై చెఁ గోమలి యిట్టున్
ఆపఁడె సారథి మార్గము
నే పాయుచుఁ ద్రప్పు దారి నేగు హయాలన్. 405

మనుజులలోఁ గామం బెపు
డును ప్రతికూల మగు; నెవనిలోపల నెపుడున్
మనుజుఁడు బద్ధుం డగునా
మనుజు నెడల స్నేహము దయ మతిమతి పెరుగున్. 406

ఇందుకె నిన్ను వరానన
యుందు వధింపను; నిను వధియింపం దగినన్
యిం దవమానింపఁ దగిన
సెందో వృధగ వనిఁ జను నరునెడ రత వైనన్. 407

ఎటువంటి పరుష వాక్కుల
నిటు లెన్నో యెన్నొ నీవ యిప్పుడు నన్నున్
ఇటులంటివి యాయన్నిటి
కిట నిను దారుణముగ వధియించుటె సరియౌ. 408

అని రాక్షస పతి రావణుఁ
డని కోపావేగత మరల ననె జానకితో
కను వరవర్ణిని! నీకవ
ధిని పెట్టితి రెండునెలలు తిన్నగ వినుమీ. 409

ఈలోపున వాపాన్పునఁ
గాలిడు లేద యిరునెలలు గడవ నను ని
న్నేలెడి మగనిగఁ గొనవా
కూలిచి నాచలిది కొఱకు కోయుదు రసురుల్. 410

ఇటు దైత్యేశుఁడు సీతను
గటువుగ బెదరింప దేవ గంధర్వ సుతల్
కటకటఁ బడి వికృతం బగు
నటు కనులుంచుచు విలపించి రప్పుడు మిగులన్. 411

కొందఱు పెదవులు విరచుచు
కొందఱు కనుసన్న చేసి కొసరుచుఁ గనుచున్
కొందఱు మోముటులిడి భీ
తం దగ నోదార్చి రసుర తర్జిత సీతన్. 412

అటు వార లూరడింపగ
పటు పాతివ్రత్య శక్తి బలగర్వముచే
స్ఫుట మయి యాత్మహిత కరో
త్కట వాక్కులఁ బల్కె సీత ఖల రావణుతో. 413

నిజముగ నీశుభంబు గమనించెడి వాఁ డెవఁడైన లేడు పో
సుజను లసహ్యగించుకొను శోభన హీనపు టిట్టి దుష్ట క
ర్మఁ జలుప నగ్గగింపఁడు సురాధిపు పత్ని శచిన్ బలెన్ భువిన్
కుజనుడ వీవుగా కెవఁడు గోరు నెడంద మహాత్ము పత్నినన్ 414

అమితౌజుం డగు రాము భార్య నను నిట్లాడంగ రానట్టి పా
పములన్ పల్కెదు వింక నెందరిగనన్ ద్వన్మోక్షమౌనే ఖలా
ధమ! రాముండొ మదేభ మీవొ శశమే తాదృద్విధేక్ష్వాకు సిం
హము నా దూఱెదు; సిగ్గులేదె యిటు చాటొదేల తద్దృష్టికిన్. 415

నను వీక్షించెడి కృష్ణ పింగళ సుతీక్ష్ణంబై వికారంబులౌ
కనులేలన్ క్షితిరాలవో, దశరథక్ష్మాధీశు జ్యేష్ఠ స్నుషన్
అనఘాత్ముండగు రాముపత్నినగు నన్నాడంగ రానట్టి వా
క్కును వాక్రుచ్చెడి నీదు నాల్కతెగి యాక్షితిన్ వడిన్ గూలదే. 416

రఘురాముం డిక నాజ్ఞయీయఁడుమిఁ దపోభ్రంశంబు నౌనంచు ని
న్నఘ కర్మోగ్రుని వేగ భస్మముగఁ జేయం జాలు సామర్థ్య ము
న్న ఘనస్ నేనిటు భస్మచేయను జుమీనన్ ధీయుతుండైన రా
మ ఘనోద్దాముని నుండియే యపహరింపం జాలవో రావణా! 417

వధకే నిన్నిటు బ్రహ్మ కూర్చె, నిటు స్వాలంబేని సందేహ మొ
ప్పదు, వీరుండవు వాకుబేరునికి భవ్యభ్రాతవై యుండియున్
బ్రథితోత్కృష్ట బలాధికుండ వయినన్, రామున్ మిషల్ పెట్టి యా
విధిఁ దప్పించియె దారచౌర్య ఘన దోర్వీర్యంబు చూపించితే. 418

అని సీత చెప్పు మాటలు
విని రాక్షస చక్రవర్తి వెసఁ గ్రూరంబౌ
కనులన్ ద్రిప్పుచు నప్పుడు
జనకజ వైపు గడుఁ దీవ్రచక్షులఁ బరపెన్. 419

వ. అప్పుడా రావణుఁ డింకను.

నీలాభ్రనిభుఁడు విశాల భుజాగ్రుండు
జిహ్మ జిహ్వాగ్రుండు సింహబలుఁడు
మహితాక్షుఁడు చలాగ్రమకుట దీర్ఘుఁడు చిత్ర
మాల్య వేషుఁ డరుణాంబర ధరుండు
మహిత మేచక సూత్ర మధ్య బాగుండయి
యహిరాజ వృత మందరాద్రిఁ బోలు
స్వర్ణాంగ దాంచిత బాహుద్వయముచేత
ఘనమందరాద్రి శృంగముల మీఱు

తరుణ రవిబోలు కుండల ద్వయము దాల్చి
యరుణ సుమ పల్లవాశోక తరువుఁ బోలు
కల్ప వృక్షాభుఁడు వసంత క్రమ తనుఁడు
ఒప్పి గనియు శ్మశాన చైత్యాగ్రుఁ డయ్యె. 420

వ. అట్లు రావణుఁడు సీతమాటల కుగ్రుఁడయి కోపమున నెఱ్ఱవాడిన నేత్రములతో నెగాదిగఁ జూచుచు మహాసర్పమువోలె బుసకొట్టుచు నిట్లనియెను. వినయము లేని యర్థహీన మైన దానిని పట్టుకొని వ్రేలాడుదానా! సూర్యుఁడు తన యోజస్సుచే సంధ్యనుబలె నిన్నిపుడే నాశమొనర్తును అని పలికి శత్రు రావణుం డైన రావణుండు ఘోరదర్శన లగు రాక్షసస్త్రీలతో. 421

ఒంటి నేత్రముదాని నొంటి కర్ణము దాని
తలఁ గప్పుచెవులతోఁ దనరుదాని

చెవులె యుండని దాని చెవుల మేకుల దాని
ఎత్తైన తల ముక్కు నెసగుదాని

పొడుగైన మెడ దాని విడిన కురులదాని
అసలె కురులు లేక యొసఁగుదాని

కంబళ్ళ కురులున్న లంబోష్ఠిఁ జుబుకోష్ఠి
లంబజానులదాని లంబవక్త్రి

బిట్టు వ్రేలాడుపాలిండ్లు పొట్టవారి
పొట్టిదానిని మరుగుజ్జు పొడుగు వారి
గూనిదానిఁ గరాళ వంగున్నదాని
పచ్చ కంటిదాని వికృతవక్త్రి నింక. 422

కాళ్ళు చేతులలోనఁ గాళ్ళలో శిఖలొప్పు
ఆవు కాళ్ళు పెనుకాళ్ళలరువారి

పెద్దతలల్ మెడల్ పెద్దపొట్టలు చండ్లు
పెను నోర్లు నాల్కపెన్ కనుల వారి

హస్తి గో సూకరీ హయ ఖర మేషోష్ట్రి
ముఖుల ఘోరాకార ముఖమువారి

ధూమకేశలను నెత్తురులునుమాంసంబు
నొంటిఁ బూసి కొనుచు నున్నవారి

చూచి రావణుఁ డిట్లనె సుదతులార!
సీత యెట్లు నావశమును చెందు నొక్కొ
యట్టులే మీర లందఱు గట్టిగాను
కలసి శీఘ్రంబుగ నొనర్పవలయుఁ జుండి. 423

వ. మఱియు సామ దాన భేద దండములచేఁగాని దండసామాదులచేతఁ గాని యెట్లోయట్లు సీతను వంచుఁడు అని వారి కాదేశించి రాక్షసేంద్రుఁడు కామమన్యువులచే నిండినవాఁడై మఱిమఱి సీతను భయపెట్టెను. ఇంతలో శీఘ్రముగ ధాన్యమాలిని అనురాక్షసి రావణుని చివరిభార్య వచ్చి దశగ్రీవుని గౌఁగిలించుకొని ఇట్లు పలికెను. 424

నాతోఁ గూడ మహారాజా!
యీతఱిఁ గ్రీడలను దేలు మిటుపాడయి దై
న్యాతుర యయి మానుషి యగు
సీతను బొంది యిఁక నేమి చేయుదు వోరీ. 425

నిజముగ బ్రహ్మయు దీనికి
త్రిజగత్పతి ! నీదు బాహు లీలార్జితమౌ
త్రిజగ ద్దుర్లభ సుఖముల
భుజియింపఁగ నుదుట వ్రాసి పోవం డనుమో. 426

కామింపకున్న దానిని
కామించిన వానియెడలఁ గడుఁ దాపంబౌ
కామించిన దాని నెఱిఁగి
కామించినచో ప్రియంబు కడు వర్ధిల్లున్. 427

అని రాక్షసి వాక్రుచ్చుచు
తను నెత్తుకొనుచును బోవఁ దర్వాతఁ గరం
బనయము నవ్వుచు మబ్బటు
దనరెడు రావణుఁడు మరలెఁ దనగృహమునకున్. 428

వ. అట్లు మరలి మేదిని తన యడుగులచే దద్దరిల్లఁ జేయుచు మండు
సూర్యునివంటి తన భవనమును జొచ్చుటకై బయలుదేఱ వాని ననుసరించి
దేవ గంధర్వ కన్యలును, నాగ కన్యలును తన్నుఁ జుట్టుకొని రాఁగా ధర్మపర
రాలును నిలువలేక వణఁకుచున్న జానకిని ఇట్లు బెదరించిన వాఁడై మదన
మోహితుఁడై భాసిల్లుచు తన భవనమును జొచ్చెను. 429

ప్రబలి వైరి రావణుఁడైన రావణుండు
సీతను గుఱించి రాక్షసి వ్రాతమునకు
త్వరగ నిటు లాజ్ఞయిడి యంతిపురికిఁ బోవ
రాక్షసస్త్రీలు సతిఁ జుట్టి క్రూరముగ ననిరి. 430

* "ఆపులస్త్య మనుమఁడు మహాత్ముఁడైన
రావణుని భార్యగ నగుగౌరవము గొనవు"
అనుచు రాక్షసస్త్రీ లన వినుచు నలిగి
నేక జట యను రాక్షసి యిట్టు లనియె. 431

అసలా బ్రహ్మలలోన నాల్గవ పులస్త్య బ్రహ్మ, యా బ్రహ్మ మా
నసపుత్రుం, డేఁక విశ్రవంతుఁ డను మాన్యాత్ముండు తత్పుత్రుఁడౌ;
నసమ ప్రాభవుఁడైన వీనిసుతుఁడౌ నస్మత్ప్రభున్ రావణున్
అసితాక్షీ ! పతిగా గ్రహింపుమి, మదీయ ప్రార్థనం జేయవే. 432

అని యారాక్షసి పల్కినన్ హరి జటాఖ్యం బొల్చు నోరాక్షసాం
గన కోపంబునఁ బిల్లికండ్లఁ గని వక్కాణించె "రమ్యాంగి ! యె
వ్వనిచే ముప్పది ముగ్గురైన యమరుల్ పాల్గొంది పర్వెత్తి, రే
తని వీక్షించి సురేంద్రుఁడున్ బఱచె నాదైత్యేశు మన్నింపవే. 433

---

* మరీచి అత్రి అంగిరసుఁడు పులస్త్యుఁడు పులహుఁడు క్రతువు అని
ప్రజాపతులు బ్రహ్మలు ఆరుగురు. అందు పులస్త్యుఁడు నాలుగవవాఁడు.

అని మర్లని బలాఢ్యుఁ డఖిలమంతిపురంబు
వదలి నిన్ గను నని ప్రఘుస యనియె

అధమ ! గంధర్వ నాగాదుల నోడించు
నారావణు భజింపు మనియె వికట

ఎవని భీతి- కెలుగఁ డిను, డనిలము వీచ
దొ- వాని గొను మని దుర్ముఖి యనె

ఎవని భీతిని జెట్లు పువుల రాల్చునో మబ్బ
గిరి గురియునొ వాని నరయు మనియె

అట్టి రాక్షసరాజన్యు నసుఁగు భార్య
వగుట కేల యొర్వవు భామ !' యనువు గాఁగ
చెప్పితిమి గ్రహింపుము లేక చెప్పినట్లు
చేయవేని నుండవు క్షితి ననిరి యొకరు. 434

తరువాత వికృత వదనము
వఱలెడి రాక్షస వనితలు పరుషపు హృదితో
పరుషముగ సీతఁ గూరిచి
పరుషోక్తులు పలికి రిట్లు బహురీతులుగా. 435

అఖిల భూత మనోజ్ఞమై మహార్హ శయన
మెసగు మేడల నుండవేల సీత !
మనిషిపై మనిషిని మన్నింతు వేటికే
మనసు మర్లించవా మనుట సున్న
త్రైలోక్య భర్తతోఁ దగ విహరింపుము
భ్రష్ట రాజ్యు మనుష్యు వదలవేల
దైత్యేశు రావణుఁ దనియించి సుఖియించు
మర్థ సిద్ధుఁడు గాని వ్యర్థు విడుము

అనుచు రాక్షస కాంతలు సైక గతుల
అతిగ పరుష వాక్యము లాడ నాలకించి
కమల దళ నిభేక్షణ సీత కనుల వెంట
నశ్రువులు కార నీరీతి ననియె నపుడు. 426

ఇటులన్ లోక వినింద్యమౌ నుడులు మీరీ యందఱున్ గల్పి చె
ప్పట న్యాయంబౌకొ యిట్టి మీదు వచనంబుల్ పాపవాక్యాలుగా
నిట నాయీమదిఁ దోఁచు, రాక్షసున కింకే మర్త్యయున్ భార్యగా
యిటు కారా దిఁక మీనుడుల్ వినను భక్షింపుండి నన్ స్వేచ్ఛగాన్. 427

దీనుఁ డగుఁగాక రాజ్య వి
హీనుండగుఁ గాక నాకు హితుఁ డాపతియే
భాను సువర్చల వోలెను
నేనాతనినే గొలిచెద నిజముగ నెపుడున్. 428

శచి సురేంద్రునిబోలె శశి రోహిణినిబోలె
క్షితి నరుంధతియు వసిష్ఠుఁబోలె
కపిలు శ్రీమతియు ట్లగస్త్యు లోపాముద్ర
యట్టులను సుకన్య చ్యవనుఁబోలె
సగరుఁ గేశినివోలె సావిత్రి సత్యవం
తునిబలె దమయంతి న్నలుఁబోలె
మదయంతి సౌదాసు మాడ్కి, వరేక్ష్వాకు
రాముని నేను నర్చన లొనర్తు

అనెడి సీత వాక్యము విని యసుర సతులు
క్రోధ మూర్ఛితలై దైత్య నాథు నాజ్ఞ
పరుష వాక్యంబు లాడుచు పొరిని పొరిని
బాధపెట్టగ సాగిరి వదల కపుడు. 429

హనుమంతుం డటు శింశుపాతరువుపై నావేళఁ గూర్చుండి యా
దనుజస్త్రీ లను వాక్కులన్ వినుచుఁ జెంతన్ బోక నిర్వ్యాకుల్యుఁడై
కనుచుండంగ వడంకు సీతఁ గని యల్కన్ రాక్షసస్త్రీలు చు
ట్టును వే ముట్టుచు వ్రేలు నోష్ఠముల బిట్టున్ నాకుచున్ క్రుద్ధలై. 440

పడి గొడ్డళ్ళను నెత్తుమన్ దనుజ సర్వాధీశు నీసీత పొం
దెడి యాభాగ్యము లేనిమష్ట" యనుచున్ దీవ్రంబుగాఁ దర్జనల్
గడుఁ గావింపఁగ సీత యశ్రుకణముల్ గారంగ నాశింశుపన్
వడిఁ జేరన్ మలినాంబరన్ జనకజన్ బహ్వార్త నీక్షించుచున్. 441

దనుజ స్త్రీల్ బెదిరింపఁ గన్గొనుచు నెత్తౌ పొట్టతో భీమ ద
ర్శనయౌచున్ వినతాఖ్యరాక్షసి కరాళాకారయై యిట్లనెన్
"జనకక్ష్మాపతిపుత్త్రి! సీత! యిటులన్ మాభర్త స్నేహంబు వ
ల్లనె యిందాఁకను నుంటి మిట్లతిగ నుండన్ భద్ర! ధిక్కారమౌ. 442

తెలిసెన్ మెచ్చితిఁ జాలు మానవుల పాతివ్రత్య ధర్మంబు, మై
థిలి! పథ్యంబగు నాదు మాట విను, దైత్యేశున్ భవ దృర్తగా
తలపోయుం దగు దిట్టి విక్రము వరత్యాగ స్వరూపున్ మహో
జ్జ్వలరూపున్ ప్రియరూపు దక్షిణు మదిన్ శక్రున్ బలెన్ బొందుమీ. 443

నరునిన్ దీనుని రాము వీడి యిఁకనైనన్ రావణుం గంటివా
వర దివ్యంబగు నంగరాగముల దివ్యంబైన భూషాళి భా
సురలై యిప్పటినుండి వహ్నికిని నిచ్చోస్వాహవోలెన్ సురే
శ్వరు నింద్రాణివలెన్, జగత్తులకికన్ సర్వేశవై యుందుగా. 444

కృపణుం డాయుపు మూడి యున్న రఘురామేశున్ బతిం బొంది యే
మి ప్రమోదంబును పొందెదె, దింక నయినన్ మేలైన నావాక్కు క
ర్ణములన్ బెట్టవ యేని యీనిముషమే రక్షస్సతుల్ సర్వలున్
ప్రమదం బొందుచు, రాక్షసుల్ గన నినున్ భక్షింత్రు సుమ్మిప్పుడే. 445

అనఁ బాలింద్లును నూగులాడ వికటాఖ్యం బొల్చు నో రాక్షసాం
గనఁ గోపించియు ముష్టితో నుఱుముచున్ గ్రౌర్యంబుతో నిట్లనెన్
"నినుజాలిన్ మృదుతా స్వభావుఁ డగుచున్-నీవన్న వాక్యంబులన్
గనకే మాపతి సైచ మామ హిత వాక్యా లిప్పు డాలింపవా. 446



పరు లెవ్వారును దాటలేని జలధిన్ బారంబు చేర్చెన్ మహోగ్రమ్ముదు
శ్చరమౌ రావణు గొప్ప యంతిపురిఁ జేర్చన్ జేరి మాచే నిరం
తరమున్ రక్షిత వైన నిన్ సురవిభుండైనన్ సరే ప్రోవ లేఁ
డరయన్ మైథిలి! మాహితోక్తి విను మిటార్వంగ నేమోఁ గదే. 447



ముదమున్ బ్రీతిని పొందు,వీడుము కరంబున్నిత్యదైన్యం బికన్
సుదతీ సీత! విహారముల్ నలుపు రక్షోనాథుతో హాయిగా
ఇదె యీయౌవన మస్థిరంబు త్వరగా నేగుంగదా యింతలో
వదనన్ యౌవన మేగకుండఁగనె సౌఖ్యంబొందఁ గ్రీడింపుమీ. 448





ఇఁక నుద్యానములన్ బురోపవనులన్ స్వేచ్ఛన్ నిశాటేశుతో
సుక మొందన్ విహరింపు వేలప్రమదల్ శోభావతుల్ వచ్చినీ
నికటంబున్ భజియింత్రు రావణు విభున్ నీకూర్చు సద్భర్తఁ జే
సికొనన్ గూడదె, లేద నీహృదయమున్ జేఁజీల్చి భక్షించెదన్. 449

మఱి చండోదరి యన్న రాక్షసి వడిం బల్లెంపుఁ గేల్ దిప్పుచున్
హరిణాక్షిన్ భయకంపిత స్తనిని గ్రౌర్యం బొప్పఁగాఁ బల్కె" ని
న్నరయున్ నోరిది యూరు, గుండెలను నల్లల్లన్ గడున్ జీల్చి నీ
మురువౌ తిత్తుల గుల్మమాంసములఁ బ్రేవుల్ హాయి భక్షింపఁగా. 450

తరువాతన్ బ్రఘసాఖ్య రాక్షసియుఁ జెంతన్ జేరి వాక్రుచ్చె జూ
తు రిదేలే యిఁక నీస్పృశంసఁ దునియల్ తూర్ణంబ గావింపకే
యురకే యుందురు, మీమతుల్ చెడెన యీయుత్కృష్ట మర్త్యాంగసన్
మరణం బొందె నటంచు రాజునకు నమ్మం జెప్పి భక్షింపరే". 451

వదినా చక్కని యాయజాముఖి యనెన్ ప్రాప్తించు భాగ్యంబుతో
ఓ వకే యాఖల మాంసముల్ సమముగా పేపంచి భక్షింపుఁ డి
మ్మ్యోడఁ జేచీ లిఁక నేల నాకసలిటేమీ పేచి యన్మాటయే
వడ దింకన్ వడిఁ బోయి కల్లు నంజూడదియున్ టర్వోత్తి తేదేమిటే. 452

అవలన్ శూర్పణాఖ్య రాక్షసియు నిట్లాడెన్ వినుండీ మీరు, యు
క్తవిధానన్ సరిగా నజాముఖియె వక్కాణించె సేబా సిటుల్
ఎవరే నందురె తెండు కల్లు త్వరగా నీబాధలో పోవు మా
* నవి మాంసంబులలో నికుంభిలకు బోనాల్ పోసె నర్తింతమే. 452

అని కడుఁ గ్రూరలు దైత్యాం
గన లిత్తఱి బెదరింపఁ గడు భయ పడుచున్
జనకజ సురకాంతోపమ
మనమున ధైర్యంబు వీడి మరిమరి యేడ్చెన్. 454

అని దైత్యాంగన లిట్టులన్ హడలఁ జేయన్ త్రస్తయై యామన
స్విని వైదేహియె బాష్పగద్గదికతోఁ జింతించి యీరీతిగా
ననియెన్, మానుషి దైత్యభార్య యగుటెనన్ సరే కాదు, న
న్నిను మీయిష్టము వచ్చినట్లు తినుఁ డేనో మీదు మాటల్ వినన్. 455

అటు లాజానకి రాక్షసాంగనల మధ్యన్ బడ్డదై వారు ను
ద్భటుఁడౌ క్రూరుఁడు రావణుండును గడున్ దర్జింప భీతిల్లి యం
తటి సౌఖ్యంబె చనన్ వణుంకుచును మందన్ వీడి తోడేళ్ళ చెం
గటకున్ వచ్చియుఁ బడ్డ యేణివలె నంగాల్ ముడ్చుకొంచున్ బడెన్. 456

---

* నికుంభిల=లంకకు పడమరగా నున్న భద్రకాళి దగ్గర వట వృక్షము.

అటఁ బుష్పించిన యాయశోక తరుశాఖాగ్రంబు నాలంబనం
బటు గేలం గొని భగ్న చిత్త యయి దుఃఖార్తిన్ బతిన్ గూర్చి యు
ట్టిటు లాత్మన్ దలపోయుచున్ వెడఁద పాలిండ్లన్ గరం బశ్రులం
తటఁ దడ్పన్ వ్యధ కంతమున్ గనక సంతాపంబు చెందెం గడున్. 4

పెనుగాలిం బడు లేఁచునంటివలెఁ బెంపేదంగఁ గంపించుచున్
దనుజస్త్రీలకు భీతి చెంది యట వక్త్రం బెంతొ వైవర్ణమున్
గనఁ గంపించెడి సీత వల్ఔపుల దీర్ఘంబైన యవ్వేణి కం
పినివైౖ ప్రాకెడి సర్పముంబలెను గన్పించెన్ గనుందోయికిన్. 458

తాపమున నుస్సని వ్యధచేఁ జైతన్య మేగ
అకట రామ! హా లక్ష్మణ! యకట! యత్త
అకట కౌసల్య! హా సుమిత్రా! యటంచు
వేగ కన్నీరు పడ విలపించె మిగుల. 459

స్త్రీలకును పురుషులకు నకాలమందు
మృత్యువది దుర్లభ మని వచింత్రు బుధులు
క్రూర రాక్షస వనితలు దారుణముగ
బాధయిడ రాముడును లేక బ్రతికియుంటి. 460

కృపణ నల్ప పుణ్య ననాధ నిట్లు జలధి
మధ్య వస్తుపూరిత నౌక మాడ్కినుంటి
పతిని జూడక రాక్షసీవశము పొంది
గట్టు నీటిచే వలెఁ జింతఁ గొట్టఁ బడితి. 461

కమల పత్రాక్ష సింహ విక్రాంత గమునుఁ
బతిఁ గృతజ్ఞుని ప్రియవాదిఁ గృతులె గాంత్రు
ఆత్మనిడు రాముఁ గనక యీప్రాణ మింక
విషము గ్రోలిన యటు పోయి వేగ కూలు. 462

గతపు జన్మలో నేనెట్టి కలుషకర్మ
చేసితినో నేనిటుల్ పాట్లు చెందుటకును
ఇట్టి శోకము తోడ జీవింపఁ గోర
రాక్షసి గుప్త నేనెట్లు రాముఁ గాంతు, 463

ఛీ! యీ మానవ జన్మము
ఛీ! యీ పరతంత్రమైన జీవిత మెందున్
ఈ మది నా స్వేచ్ఛ మెయిన్
ఏ యెపుడును విడువరాక యెసఁగుచు నుండెన్. 464

అని యిట్టుల్ వ్యథతో నధోముఖముతో నాసీత శోకించి యు
న్మనయై పిచ్చి దటుల్ ప్రమత్తవలె సంభ్రాంతాత్మ వోలెన్ గనుం
గొనుచున్ దొర్లెడి యాడుగుఱ్ఱము వలెన్ క్షోణీతలిన్ గూలి పె
న్వానటన్ దొర్లుచు ధైర్యమేగ విలపింపన్ సాగె నత్యంతమున్. 465

రాముఁడు లేనపుడు కామరూపున దైత్యుఁ
డేడ్చునన్ బల్మిని నిట్లు తెచ్చె
దనుజ వశత నున్న ననుభయపెట్టఁగ
నిట బ్రుక్కు నేను జీవింపఁ గోర.

అమహారథుఁడైన రాముఁడె లేనప్డు
జీవార్థ, భూషలచేత నేమి
ఇట్లు దుఃఖించుచు నేడ్చుచు నున్న నా
యశ్మసార హృదయ మవిసి పోదు

అతఁడు లేకుండ క్షణమైన బ్రతుకునాదు
పాడు జీవితమును దాల్చి పాప నైతి
వార్ధిపర్యంత భూమికిఁ బ్రభువ యైన
ప్రియుఁడు లేని నాజీవాశ ప్రీతి యేల 466

చిల్చుఁడు తినుండు మేను త్యజించి వైత్తు
ప్రియుఁడు లేకుండఁ జిరము జీవింపలేను
అసురు నెడమపాదముతోడ నైనఁ దాక
గర్హ్య రావణుఁ గామింపఁ గలుగు టేమి. 467

ఖలతన్ గ్రూరత నన్నుఁ గోరు తనధిక్కారంబు స్వీయాన్వయం
బుల ధిక్కారము తెల్సికోఁడు, నిరతంబున్ నన్ను ఛేదింపనీ
బలిమిన్ జీలుపనీ ప్రదీప్తమగుపల్ వహ్నిం బడన్వేయనీ
ఖలు నారావణుఁ గోర; మానుఁడి యిఁకన్ గౌర్యంపుఁ బ్రజ్ఞాపనల్. 468

ప్రథితుండున్ బుధుఁడున్ గృతజ్ఞుఁడు దయాప్రౌఢుండు సద్వృత్తుఁడీ
యదనన్ నాపగు భాగ్యహీనతను నాయందున్ దయన్ జూపఁ డీ
పదు నల్వేవురు దైత్యులన్ గ్రుటిని జంపండే, జనస్థానిలో
నిదె నన్నేలకుఁ జేరి ప్రోవఁడుగదో యేలా యుపేక్షించెనో. 469

బలహీనుం డగురావణాసురునిచే బల్మిన్ నిరుద్ధాత్మనై
విలపింతున్, త్రుటిలో మదీయపతి విద్వేషిన్ ఖలున్ రావణున్
నిలువెల్లన్ గని చీల్చఁజాలును, నతండే యావిరాధున్ మహో
జ్జ్వలు యుద్ధంబునఁ జంపివైచె నతఁడున్ వైళంబ రాఁడేటికో. 470

అప లీవారిధి మధ్య లంక యెవ్వరైనన్ జొరన్ రానిదే
వెస నీరాముని బాణపంక్తులకు నేవీ యడ్డురాలేవ, రా
క్షసుచేఁ దీసుకపోఁబడ్డఁ బ్రియు నిష్టన్ భార్యనే చూడఁడే
మి, సరే పో యిట నేనె యన్నటుల నేమీ తెల్సికో లేదాకో. 471

ఒకవేళన్ గడుఁదెల్సియే యెదురుకోకుండన్ సహించెంగదో
ఇఁక నేఁదీసుకపోఁబడెన్ దెలుపునాగృధ్రేశ్వరుండో యటన్
వికటాస్యుం డగు రావణాసురునిచే నిగ్గీవుఁడే యయ్యె నెం
తో కఠోర బొనరించె నాకయి జటాయుం డట్టి వృద్ధుం డటన్. 472

శా॥ నేనున్నటు తెల్పినన్ గుపితుండై యాలోకమున్ వెంటనే
పటు బాణాల నరాక్షసంబగ నొనర్చు బోక రాముండు మా
నుట యత్యంత మసంభవంబు జలధిన్ శోకింపఁ జేయున్మహో
త్కట లంకాపురిఁ గాల్చి దైత్యు యశమున్ తన్నామమున్మాపెడున్. 473

తరువాతన్ హతనాథలై కుములు దైత్యస్త్రీల యిండ్లిండ్లలో
నిరతం బేనిపు డేడ్చునట్టులుగనే నిత్యంబు నాస్త్రీలు నే
డ్తుర యీసంగతి సత్యమౌ వెదకి యిందున్ లంక నాఖ్యాతలున్
త్వరగా వైరిని జూడ వాఁడు త్రుటితో వంశంబుతో చచ్చెడిన్. 474

ఇఁక చితాధూమము లెల్లెడ వ్యాపింప
గ్రద్ధ లెగుర లంక కాడె యగును
త్వరలోనె నాకోర్కె నెఱవేరు దుర్మార్గ
మది మీది సర్వక్షయంబుఁ దెలుపు
ఈలంకఁ గనిపించు నీయశుభంబులు
లంకాప్రభలు పోవు టింకఁ జూవు
రాక్షసాధముఁ డైన రావణుఁడును జావ
భర్తృ హీనటు లంక పాడె యగును

ఎఱుపుఁ గ్రీగంటి రాముడు ధృతి ధరుండు
రావణుని యింట నేనుంట ప్రకట పడగ
వెలుగుపోవ నింటింట నేడ్పులును వినఁగ
బాణముల చేత నిఁక లంక భస్మచేయు 475

ఈ నృశంసాధముఁ డీ రావణుఁడు పెట్టి
చెప్పిన గడువును చేరుదరికి
పాపి దైత్యుల ధర్మ పంథ నకార్యంబు
సలిపి మహోత్పాతములను గూర్తు

ఈ మాంస భోజను లింత ధర్మ మెఱుంగ
రింక నన్ను చల్దికై నెంచె నసుర
ప్రియరూపుఁడును రక్తదృష్టియౌ రాముఁడు
లేక చూడక యొనరింతు నేమి

ఎవ్వడైన నొక్కఁడు విషం బిచ్చు నేని
ప్రియుఁడె లేనప్డు యముని దర్శింతు నేను
ఏను బ్రతికి యున్నటు రాము డెఱుగడేమొ
తెలియుచో నన్ వెదుకకుండ నలరు నెటుల. 476

నిజముగ లక్ష్మణాగ్రజుఁడు నా శోకార్తి
ధర మేను విడి స్వర్గ మరిగె నేమొ
కమలాక్షు నా ప్రియుఁగను సిద్ధ గంధర్వ
దైవ మహర్షులు ధన్యతములు
వోని ధీమంతుఁడు పుణ్యాత్ముఁడు పరాత్ముఁ
డగు రామునికి నాదు ప్రాప్తియేల
కనిపింపఁ బ్రీతియౌఁ గననిచోఁ జనుఁ బ్రీతి
కూల్తురి దుష్టులు ప్రీతిఁ గూల్చ డతడు

నా కలుష మిటొనర్చెఁ బుణ్యంబె చనెనో
రాముఁడే లేమి నేనిటుల్ బాధ పడుదు
అరి దమనుఁడు కష్ట మిడని చరితవాడు
అతడు లేని బ్రతుకుకంటె మృతియె వరము. 477

అటు గాకన్ వని వస్త్రముల్ విడిచి యేయాకుల్ ఫలాలో భుజిం
చుటయే దీక్షఁగఁ బూని కానలనె కన్పన్ నిల్చియున్నారొ పల్
కుటిలుండౌ దనుజేంద్రరావణునిచేఁ గూల్చన్ బడన్ బ్రమ్గిరో
ఇటు కాఁగా మృతి పొందఁ గోరుదును నిం కిపాట్లకంటెన్ భువిన్. 478

ప్రియమో యప్రియమో యదేదో గనకే వీతానురాగాన సం
యమయుతులై కిల్బిషముల్ త్యజించెడి యమోఘాత్ముల్ సుధన్యుల్ గదా
ప్రియముంబట్టియు దుఃఖమున్ గనగ యప్రీతిన్ వ్యథన్ గొప్ప భీ
తియుఁ గన్రో: రటువంటి యుత్తముల కెంతే మ్రొక్కుదున్ సర్వదా. 479

విదితాత్ముండు ప్రియార్హుఁడు
సదయుఁడు నా రాముచే విసర్జిత నౌచున్
మదయుతుఁడు పాపి రావణు
డదయుఁడు వానివశమందె ప్రాణము విడుతున్. 480

వ. ఇట్లు సీత దుఃఖార్తయై పలుకఁగా క్రోధముచే నోడలు తెలియని రాక్షసస్త్రీలు కొందఱు సీత యన్న మాటలు తొందఱగా రావణాసురునికిఁ జెప్ప పరుగెత్తుకొని వెళ్ళిరి. కొందఱు సీతదగ్గఱకు వెళ్ళి ఘోర దర్శనలై ఇదివఱకు వలెనే చెప్పుచు మరల నిట్లనిరి. ఓసీతా! అనార్యురాలా పాపనిశ్చయురాలా! ఇప్పుడే నీమాంసమును రాక్షసస్త్రీలు యథేచ్ఛగా భక్షించెదరు లే"అని. అపుడా రాక్షసస్త్రీలు భయపెట్టుచుండఁగా పరుండియున్న త్రిజట అను వృద్ధరాక్షసి మేల్కొని యిట్లనియె. 481

అంతగఁ దినవలయు నెడ న
మాంతముగ ననార్యలార! మఱి నను దినుఁడీ
ఇంతి దశరథు ప్రియ స్నుష
నింతటి జనకజను మాత్రమిఁకఁ దినకుండీ. 482

తిలకించితి నొక ఘోరపుఁ
గల; యది గగురు పాటు కడుఁ గలిగించెన్
కల యది రాక్షస నాశము
వెలంది జానకి పతికిని విజయమె తెలుపున్. 483

---

వివ:- త్రిజట=విభీషణుని కూతురు.

అని యంతన్ త్రిజటాఖ్య కాంత యనఁగా నాలించి యారాక్షసాం
గన లల్కన్ గడునా శ్చెఱుంగకయె వక్కాణించి రీరీతి భీ
తిని, ఓసీ! త్రిజటా! వచింపు, కల యాతీరెట్టిదో రాత్రిలోఁ
గని నావెయ్యి, దనంగ నాత్రిజట వక్కాణించె నాస్వప్నమున్. 484

ఏన్గు దంతాల పల్లకి యెక్కి, నేల
హంసలును మోయు శుక్ల మాల్యాంబరములు
దాల్చి రాముఁడు సౌమిత్రి తాను నిటకు
వచ్చినటు గాంచినాను స్వప్నంబునందు. 485

జానకి పీతాంబరము దాల్చి జలధి మధ్య
శ్వేతగిరిపైని కూర్చుండి స్వీయ దయితు
రాముఁ గూడి భాస్కరునితోఁ బ్రభయ వోలె
వఱల స్వప్నంబునందును నరసి యుంటి. 486

నాల్గు దంతా లుండి నగముఁ బోలిన యేన్గు
నెక్కి రాముఁడు భ్రాత యేగినట్లు
శుభ తేజసున వెల్గి శుక్ల మాల్యాంబరు
లయి సీతతోఁ గూడి యలరినట్లు
నగముపై గగనానఁ దగి భర్తపట్టుకొ
నిన యేన్గుపె సీత తనరినట్లు
ప్రియు నొడినుండియు వెసఁ బైకి నెగిరియు
తరణి చంద్రుల సీత తాకినట్లు.

ఇంక నృప సుతుల్ సీతయు వేన్గునెక్కి
లంకపైని విహారముల్ సలిపినట్లు
ఎనిమి దెద్దుల రథముపై నిటకు రాముఁ
డింతి సీతతో వచ్చిన ట్లింకఁ గంటి 487

పొడిచిన సూర్యువంటి వరపుష్పక దివ్య విమానమందు నా
పడఁతిని సీత లక్ష్మణుని భ్రాతను నాపురుషోత్తముండు నె
క్కినడు బలిష్ఠమైన విష్ణుసమ కోవిదు రాముని నందె గంటి, నా
తఁ డిట నజయ్యుఁ డాసుర బుధాళికిఁ బాపికి స్వర్గముంబలెన్. 488

వ. మఱియు నా స్వప్నము లోనే

కడునెఱ్ఱ వలువను గన్నెరు పువుదండఁ
గొని రావణుండు నూనెఁ గ్రోలినట్లు
పుష్పకవరమున నుండి భువిఁ బడి స్త్రీ లాగ
నలుపు బట్టను బోడి యలరి నట్లు
ఖరముల రథముపై నెఱుపు బట్టలు దాల్చి
యాడుచుఁ బిచ్చివాఁడైన యట్లు
గాడిదపై నెక్కి కడు దక్షిణమ్ముగా
తలక్రిందుగాఁ బడి తరలినట్లు

మఱియు వేలేచి భయపడి కరము ప్రేలి
నగ్నుఁడై ఘోర దుర్గంధ నరకకూప
మలములందును బడి మున్గి మసలు నట్లు
రావణుఁడు గానఁబడియె ఘోరంబుగాను. 489

ఎఱుపైన వలువ దాలిచి
బురదను మెయిఁ బూసికొనుచుఁ బొలఁతుక యొార్తున్
కరమున్ నల్లని దయి దశ
శిరసుని మెడఁ గట్టి యీడ్చెఁ జెడ దక్షిణగన్. 490

వ. మఱియు నట నిట్లే కుంభకర్ణుఁడు చేయఁబడెను. రావణుని సుత లందఱు తైలము గ్రోలుచున్నట్లు గనఁబడిరి. మఱియుఁ బందినెక్కి దశకంఠుండును, మొసలినెక్కి యింద్రజిత్తును, ఒంటెనెక్కి కుంభకర్ణుఁడు దక్షిణ

దిశకుఁ బోయినట్లును గనిపించిరి. ఒక విభీషణుఁడు మాత్రము శ్వేత ఛత్రము దాల్చి శుక్లమాల్య వస్త్ర గంధములు దాల్చి శంఖ దుందుభి నిర్ఘోషములతోను నృత్తగీతములతోను అలంకృతుఁడై మేఘమువలె నుఱుము పర్వతము వంటి నాలుగు దంతములు గల దివ్యగజము దగ్గఱ నలుగురు మంత్రులను గూడి విమానమును సమీపించెను. రక్త మాల్యములు రక్త వస్త్రములు ధరించి త్రాగుచు రాక్షసుల సంఘము గీత వాదిత్ర ధ్వనులతోఁ గూడినట్లు గనఁబడె. అశ్వ గజ రథములతోఁ గూడిన యీ లంక గోపురములు తోరణములు విఱుగ సముద్రములోఁ బడినట్లు గనంబడినది. మఱియు నీలంక రావణునిచే దగ్ధమైనట్లు స్వప్నమునఁ గనఁబడియె. రాక్షసస్త్రీలు ఖూడిదయై రూక్షముగానున్న యీ లంకయందు ధ్వనులు చేయుచు నవ్వుచు తైలము గ్రోలుచు నృత్యములు చేయుచుండిరి. కుంభకర్ణుఁడు మొదలైన రాక్షసవరులు రక్త వస్త్రము గ్రహించి గోమయమగు హ్రదమునఁ బ్రవేశించిరి. తప్పుకొనుఁడు దాగుకొనుఁడు త్వరలో సీతను రాముఁడు పొందును. ఎక్కువ యమర్షము గల రాముఁడు సర్వరాక్షసులను జంపివేయును. ప్రియురాలై బహుమతయై వనవాసమునకు వచ్చిన భార్య భర్త్సింపఁబడినను మభ్యపెట్టఁబడినను రాముఁడు సహింపఁడు. కనుక క్రూరవాక్యములింక చాలింపుఁడు. సాంత్వ వాక్యములఁ పలుకుఁడు. కనుక ఇదే వైదేహిని ప్రార్థింతము. ఇదే నాకు ఇష్టమగుచున్నది. దుఃఖించిన యీమెను గూర్చి యీవిధమైన స్వప్నము కనుపట్టుచున్నది. ఇట్టి దుఃఖములు పొందిన యీమె యింక అత్యంతమైన శ్రేయమును పొందును. మీరీమెను బెదరించినను ప్రార్థింపుడు. ఇందుకై వివక్ష యేల, రాముని వలన రాక్షసులకు మహాభయము సంప్రాప్తించినది. నమస్కరించినచో ఈమె ప్రసన్నురాలగును. ఈ మహా భయమునుండి ఈ సీత రక్షింపగలదు. ఈ విశాలాక్షిలో ఏమాత్రము వికారము కనుపట్టదు. నీడవలె మాత్రము కొంచెము దుఃఖము ప్రాప్తించినది. దుఃఖములు పొందదగని యీమె విమానమును పొందినదిగాన ఈమెకు అర్థసిద్ధి కలిగినట్లు రాక్షసేశ్వరునికి వినాశము రాము

నికి జయము కలిగినదని తలచుచున్నాను. ఇదిగో ఈ శుభనిమిత్తముగూడ కనిపించుచున్నది. పద్మపత్రమువలె పొడుగైన ఈమె కన్ను అదరుచున్నది పక్షమున ఈమె యెడమబాహువు హఠాత్తుగా అదరుచున్నది ఆడ యేనుగు తొండము వంటి యీమె తొడయు అదరి రాముఁడింక వచ్చునని సూచించుచున్నది. శాఖలందున్న పక్షియును సాంత్వముగాఁ బలుకు సంతోషించినదై శుభముగ స్వాగతము మాటిమాటికి పలుకుచున్నదివలెనున్నది. 491

## —: సీత తన జీవితమును త్యజింపదలచుట :—

అను దైత్యేశు కటూక్తులన్ దలఁచి సింహగ్రస్తయౌ నాడ యే
న్గను భీతిల్లుచు నప్రియార్త యయి దైత్యస్త్రీల మధ్యన్ మహో
త్కట బాధం గని- కానలోన విజనస్థానంబులోఁ బడ్డ యా ముద్దరా
లయి యా జానకి దుఃఖ మాపుకొనలే కచ్చోట నేడ్చెన్ గడున్. 492

మనకో యెన్నఁడకాలమృత్యు వది సంప్రాప్తించ దంచున్ జనం
బను వాక్యంబులు నక్షరాల నిజమే, యట్లవ్వి కాకుండినం
దనుజేశోక్తులచేతఁ దర్జితమ నైనన్ బుణ్యహీనన్ మృతిన్
గన లేకన్ మనుదున్, మదీయ హృది శృంగంబట్లు దుర్భేద్యమే. 493

మఱి నాకిప్పుడో యాత్మహత్య నలుపం బ్రాప్తింప దేదోషమి
త్తఱి నే నప్రియదర్శనుం డయిన యా దైత్యేశుకున్ వధ్యనే,
మఱి నేనీతని కెంతమాత్రమయినం భావంబు నీఁ జాల, నా
పరమంత్రంబు ద్విజుండ నద్విజుని కివ్వంజాల నట్టుల్ భువిన్. 494

లోక నాథుండగు సతండు రాక యున్న
రాక్షసేశుఁ డనార్యుండు ప్రకట నిశిత
శస్త్రముల నాదు నంగముల్ శకలములుగ
చేయు మంగలి గర్భస్థ జీవి నట్లు. 495

చిరమునుండి దుఃఖంబుచేఁ జిక్కి యున్న
నాకు రెండు మాసము లింకన్గడువు గలదు
రాత్రి చివరను రాజాపరాధ్ధుఁ డగుచు
తొరగ బద్ధుఁడై వధ్యుఁడౌ దొంగనట్లు. 496

అకట! రామ! హాలక్ష్మణ! హాసుమిత్ర!
అకట! దేవి! రామజనని! హామదంబ
ఇప్పుడే మందభాగ్య నిదె నశింపనుంటి
పలు తుపానులోఁ బడ్డ యాపడవవోలె. 497

లేడి రూపును జంతు వానృపుని సుతుల
వేగముగఁ దీసికొని పోయి వెతలఁ బెట్టె
నా నిమిత్తాన నృపసుతుల్ నాశ మైరి
పిడుగు పాటుచేతను సింహ వృషభము లటు. 498

ఆర్యపుత్రు రాము నలరామానుజన్ము
విడిచి యెడబాటు పడునటు వేగ నిపుడు
హరిణ రూపు దాల్చిన కాల మట్లు నన్ను
నల్ప భాగ్యను లోభాబ్ధియందు ముంచె. 499

అకట! రామ! సత్యవ్రత! హా! సుబాహు!
అకట! పూర్ణ చంద్ర! మనోహరాస్య! వీర!
అకట జీవ లోకప్రియ! హా హితాత్మ!
అసురులకు వధ్యనై యుంట యెరుగ వైతి. 500

కుటిలంబౌ కనుఱెప్ప వెంట్రుక లొగిన్ గుండ్రంబుగాఁ జుట్ట ని
ట్టటులింతై సెఱుపౌచు మధ్య నలుపై యందాల కండ్లొప్ప కూ
కటు లింపారు సుకేశి-డా-కను- సురక్తం బౌచు మత్స్యప్రహతిన్
చటులంబౌ కమలంబుపోలె మిగులన్ స్పందించె నొక్కుమ్మడిన్. 506

వివ :- డాకను=ఎడమకన్ను

నునుపై బల్సినయు గుండ్రమై తిరిగి, యెంతో గొప్ప కస్తూరి చం
దన కాలాగురు యోగ్యమై చిరము తన్మర్త్యోత్తముండైన నా
థుని యాలింగన భాగ్యముం గనియు నెందున్ శ్రేష్ఠ సౌభాగ్యమౌ
జనక క్ష్మాపతి పుత్త్రి వామభుజమున్ స్పందించె నత్యంతమున్. 507

దరిగాఁ గల్సియె యున్న పెందొడల సౌందర్యంబు ప్రోపై దగన్
కరిరా జోత్తమ హస్త మట్లు రుచిరాకారంబుతో నొప్పి భా
సురమై బల్సిన యామె డా తొడయు నచ్చో మెల్లఁ గంపించి ముం
దర రాముండును నున్నవానినిగ నత్యంతంబు సూచించెడిన్. 508

మురుపై ముమ్మొన దేఱు పల్వరుసతోఁ బొల్పారుచున్ మీఱి సుం
దరి పద్మాక్షి సుగాత్రి చెట్టుదరి నంతన్ నిల్చియుండంగఁ గ్ర
మ్మఱ నే స్వర్ణసమాన వర్ణయయి దుమ్మై సుంతపాడౌచు న
త్తఱి గానంబడి యామె చేలము రవంతన్ జాఱె నప్పట్టునన్. 509

ఇటు లాయా సునిమిత్తముల్ తెలుపఁగన్ వీక్షించి యాసుభ్రు వ
చ్చట నెండన్ జలి వాడి, వాన పడ గింజంబోలె భాసిల్లుచున్
గుటిలంబౌ కురులున్ సపక్ష్మములు కన్నుల్ కన్బొమల్ మోవి ము
చ్చటఁ గూర్చున్ గ్రహ ముక్త చంద్రుఁ డటు దంష్ట్రిచ్ఛంపుమోమున్
దగెన్. 510

ఇంక వ్యథ పోవ, జడతయు నేగ, మదిని
బాధ శమియింప, ముదమున బలము పెఱుగ
శుక్లపక్షాన నుదయించు సోము చేత
రాత్రివలె నామె స్వచ్ఛవక్త్రమున నలరె, 511

లోక నాథుండగు పతండు రాక యున్న
రాక్షసేశుఁ డనార్యుండు ప్రకట నిశిత
శస్త్రముల నాదు నంగముల్ శకలములుగ
చేయు మంగలి గర్భస్థ జీవి నట్లు. 495

చిరమునుండి దుఃఖంబుచేఁ జిక్కి యున్న
నాకు రెండు మాసము లిఁకన్గడువు గలదు
రాత్రి చివరను రాజాపరాద్ధుఁ డగుచు
తొరగ బద్ధుఁడై వధ్యుఁడౌ దొంగనట్లు. 496

అకట! రామ! హాలక్ష్మణ! హాసుమిత్ర!
అకట! దేవి! రామజనని! హామదంబ
ఇప్పుడే మందభాగ్య నిదె నశింపనుంటి
పలు తుపానులోఁ బడ్డ యాపడవవోలె. 497

లేడి రూపును జంతు వానృపుని సుతుల
వేగముగఁ దీసికొని పోయి వెతలఁ బెట్టె
నా నిమిత్తాన నృపసుతుల్ నాశ మైరి
పిడుగు పాటుచేతను సింహ వృషభము లటు. 498

ఆర్యపుత్త్రు రాము నలరామానుజన్ము
విడిచి యెడబాటు పడునటు వేగ నిపుడు
హరిణ రూపు దాల్చిన కాల మట్లు నన్ను
నల్ప భాగ్యను లోభాబ్ధియందు ముంచె. 499

అకట! రామ! సత్యవ్రత! హా! సుబాహు!
అకట! పూర్ణ చంద్ర! మనోహరాస్య! వీర!
అకట జీవ లోకప్రియు! హా హితాత్మ!
అసురులకు వధ్యనై యుంట నెరయ వైతి. 500

పతినే కొల్చెదు పాట్లు సైతు ధరపైఁ బన్నొందు ధర్మంబె నా
వ్రతమౌ నింక బ్రతివ్రతాత్వ మొకటే లక్ష్యంబు సర్వం బిప
న్ని తఱిన్ వ్యర్థములయ్యె మానుషులలోనే యీ కృతఘ్నాత్ములం
దును జేయుంబడి సర్వయత్నములికన్ తూర్ణంబు పాడైనటుల్ 501

ధృతి నేఁజేసిన ధర్మమయ్యె వృథ పాతివ్రత్య ధర్మంబు నీ
గతి వ్యర్థంబుగ పోయె నిన్‌గనకయే కార్యంబునేఁగంటి నిన్‌బొందు సం
గతి యాశల్ చనె వీర నీ జనకు నాజ్ఞల్ చేసి యిల్ చేరి పూ
రిత దీక్షన్ మదిరాక్షులన్ గలిసియున్ గ్రీడింతొ నిర్భీతితో. 502

మఱి నేనో నినుగోరి నాశసమునకుం భావంబు బంధించి యి
న్నొఱి వ్యర్థంబ తపస్సు చేసి విడుతున్ నిర్భాగ్యనై జీవముల్
త్వరగా శస్త్రము చేతనో విషము చేతంగాని ప్రాణంబు క్ర
చ్ఛఱ వర్జింతునుగాని యిందు విషమున్ శస్త్రంబు ప్రాప్తించవే. 503

అని యాదేవి యనేక రీతులుగ నత్యంతంబు యట్లేడ్చి రా
ముని లో నెంచి వణంకుచున్ మిగుల మోమున్ వాడగా విచ్చు చె
ట్టును వే చేరి జడన్ బిగించి మెడ" నెట్లో చత్తు నంచెంచి కొ
మ్మను చేబట్టియు రాములక్ష్మణుఁ గులమ్మాలోచన్ జేయగా. 504

ఇంతలో ధైర్యమును గూర్చ నెన్నొ గొప్ప
శుభ నిమిత్తముల్ గనుపట్టెఁ జోద్యముగను,
మిగుల సీతకు పరిదీన విగత మతికి
అపుడు నర్థికి లక్ష్మీ కటాక్ష మట్లు. 505

కుటిలంబౌ కనుఱెప్ప పెంద్రుక లొగిన్ గుండ్రంబుగాఁ జుట్టని
ట్లటులింతై సెఱుపొచు మధ్య నలుపై యంచాల కండ్లొప్ప కా
కటు లింపారు సుకేశి-డా-కను- సురక్తం బొచు మత్స్యాహతిన్
చటులంబౌ కమలంబువోలె మిగులన్ స్పందించె నొక్కుమ్మడిన్. 506

వివ :- డాకను=ఎడమకన్ను

సునుపై బల్సియు గుండ్రమై తిరిగి, యెంతో గొప్ప కస్తూరి చం
దన కాలాగురు యోగ్యమై చిరము తన్మర్త్యోత్తముండైన నా
థుని యాలింగన భాగ్యముం గనియు నెందున్ శ్రేష్ఠ సౌభాగ్యమౌ
జనక క్ష్మాపతి పుత్త్రి వామభుజమున్ స్పందించె నత్యంతమున్. 507

దరిగాఁ గల్సియె యున్న పెందొడ సౌందర్యంబు ప్రోవై తగన్
కరిరాజోత్తమ హస్తమట్లు రుచిరాకారంబుతో నొప్పి బా
సురమై బల్సిన యామె డా తొడయు నచ్చో మెల్లఁ గంపించి ముం
దర రాముండును నున్నవానినిగ నత్యంతంబు సూచించెడిన్. 508

మురుపై ముమ్మొన దేఱు పల్వరుసతోఁ బొల్పారుచున్ మీఱి సుం
దరి పద్మాక్షి సుగాత్రి చెట్టుదరి నంతన్ నిల్చియుండంగఁ గ్ర
మ్మఱి నే స్వర్ణసమాన వర్ణయయి దుమ్మై సుంతపాడౌచు న
త్తఱి గానంబడి యామె చేలము రవంతవ్ జాఱె నప్పట్టునన్. 509

ఇటు లాయా సునిమిత్తముల్ తెలుపఁగన్ వీక్షించి యాసుభ్రు వ
చ్చట నెండన్ జలి వాడి, వాన వడ గింజంబోలె భాసిల్లుచున్
గుటెలంబౌ కురులున్ సపక్ష్మములు కన్నుల్ కన్బొమల్ మోవి ము
చ్చటఁ గూర్చున్ గ్రహ ముక్త చంద్రుఁ డటు దంష్ట్రోచ్ఛంపుమోమున్ దగెన్. 510

ఇంక వ్యధ పోవ, జడతయు నేగ, మదిని
బాధ శమియింప, ముదమున బలము పెఱుగ
శుక్లపక్షాన నుదయించు సోము చేత
రాత్రివలె నామె స్వచ్ఛవక్త్రమున నలరె, 511

## —: హనుమంతుఁడు సీత నూరడింపఁ దలచుట :—

ధృతితో నాహనుమంతు డందు దనుజస్త్రీ లాడు క్రూరోక్తు లా
గతి నాలించుచు; సీత యాత్రిజట వక్కాణించు సత్యోక్తు లా
దృతితోఁ దెల్సియున్ దేవియా జనకజన్ హృత్ప్రీతిలో నందన
స్థితయౌ దేవతగాఁ దలంచుచుమదిన్ జింతించె నీరీతిగన్. 512

ఏసతికోస మిందనుక నిప్పుడు వానరసేన లెన్నియో
నాసిలి సర్వదిక్కులను గగ్గొని కన్గొని బాధ లొందెనో
ఆసతి మాయదృష్టమున నారయఁగాఁ బడె చారదృష్టితో
వేసరి శత్రుశక్తి గని వింటిని గంటిని గూఢమౌ గతిన్, 513

అరసితి దైత్యు విశేషము
నరసితి లంకాపురమును నరసితి దైత్యే
శ్వరుఁడై తగు నీరావణు
వరప్రభావ గరిమంబు బహువిధములుగన్. 514

సర్వాధిక సత్త్వమున్ దయయు నెంతే నొప్పు నాయప్రమే
య కళా భాసురుఁడైన రాముని ప్రియున్ ప్రాణేశు సందర్శనా
నికి నాత్రంబును జెందు సాధ్వి నెపుడెందే నిట్టి దుఃఖంపు టా
ర్తి కనుంగోక వ్యధాంతమే గనని యింతి న్నూరడించం దగున్. 515

ఇఁక నేనీమెను నూరడింపకయె పోతేన్ గొప్ప తప్పౌను, జా
నకియున్ రక్షణ గాంచకే తనదు ప్రాణంబుల్ విసర్జించు, జా
నకి నీక్షింపఁగ నాత్రముం గనెడి చంద్రాస్యన్ మహాబాహు నే
నిఁక నోదార్చుట న్యాయమౌను గద యిట్లే పోవన్యాయంబొకో. 516

దనుజస్త్రీలను జూచుచుండ నిట సీతన్ గాంచి భాషింప వీ
లునుగా దేమి యొనర్పఁగావలెనొ యెట్లో తోచ దిందెట్టులై
నను చిక్కే యగు, నూరడింపకయె యున్నానో యిఁకీ వేగు జా
మున నీజానకి ప్రాణముల్ విడుచునేమో యేమి గావించెదన్. 517

ఒక వేళన్ నను 'సీత యేమనె' నటంచీ రాముఁడే పల్కిచో
నిఁక నే నా శుభమధ్యతోఁ బలుకకే యేమందు నారాముతో
నిఁక పోనీ యిటె సీత చెప్పినది యేమీ లేక నేవెళ్ళ నెం
తుకు సందేశములేక వచ్చి తని యెంతో చూపులన్ గాల్చఁడే. 518

మఱి యారామునికై కపీశ్వరుని బంపింతునా, సీత యీ
మరణం బొందినచో బలాగమున సమ్మర్దంబు వ్యర్థం బగున్
తఱి నీక్షించియు రాక్షసాంగనలు లేనప్డెంచి సంతప్తయౌ
గరితన్ సీతను నూరడించెదను సూక్ష్మాకారుఁడై తింగదా. 519

ఇఁకపైఁగా నిట వానరుండనుగదా నేనున్ విశేషించి: యిం
తకు నేసంస్కృత మర్త్యవాక్యములు సుంతన్ తూచి వాక్రుక్కత్తు గా
దొకొ, యాసంస్కృత వాక్యముల్ ద్విజుబలెన్ తోడ్తో డుతన్ సీత న
న్నిఁక నారావణుఁగా దలంచు, నెటు లిట్టీ భాష యుందుర్ కపుల్. 520

విధిగా సార్థక మైన మర్త్య వచనంబే పల్కఁగానౌ, నికే
విధి నోదార్పఁగ వీలుగాదు బహుశా వేగన్ మదీయాకృతిన్
బ్రధితంబైన మదుక్తి సీత విని పూర్వంబే నిశాటోక్తి వి
న్నదియై భీతిల్లెఁ గాననింక భయమున్ గాంచున్ మదీయోక్తికిన్. 521

అపలన్ నన్ గని కామరూపి యగు నాదైత్యాధ్యక్షుఁడౌ రావణుం
గ విశాలాక్షి యెఱింగి సీత యబువంగా నప్పు డాయార్పులం
త వెసన్ గన్గొని రాక్షసీగణమె నానాశస్త్రముల్ దాల్చి మృ
త్యువు లట్లారసి పట్టి చంపియుశనం బూనన్ యుధాశక్తిగా. 522

తపుడాఖల్ చిఱుశాఖలన్ మొదళులన్ తచ్చాడి పర్వెత్తు న
న్నరయున్ వచ్చి విరూప వక్త్రముల దైత్యస్త్రీలు తర్కించి పెన్భీతితో
త్వరగా రాక్షస వీరులన్ బిలుతురంతన్ ఘోరమౌ యుద్ధమౌ
జరుగున్ బిమ్మట వార్ధి దాటఁగ నశక్తుండఁ గాకుండెదన్. 523

అటుగాదేని ననున్ గ్రహింత్రు త్వరగా, నట్టైన సందేశముల్
పటుకీర్తిన్ వినిపింపఁ దెల్ప నగునే పాపాత్ము లా దైత్యు లం
తట సీతన్ గడు బాధపెట్టెదరుగాదా రామసుగ్రీవ ను
స్ఫుట కార్యంబు చెడున్ మఱిట్లు సకలంబున్ గూడ వ్యత్యస్తమౌ. 524

ననుదైత్యుల్ గ్రహియించినన్ దునిమినన్ రామోపయోగంబు నిఁ
క నెటుల్ వేరొనరింతు రేప్లవగు లింకన్ వార్ధి లంఘింత్రు శో
ధన గావింపఁగ నేనె చంపఁగల దైత్యశ్రేణులం గాని వా
ర్ధిని నాపిమ్మట దాటజాల నొకొ యీతీర్రైన నెల్లన్ జెడున్. 525

అనిలో నెవ్వరు గెల్తురో తెలుప శక్యంబే యిటన్ సంశయం
బునఁ గావించుట కష్టమొంద, బుధుఁ డెప్డున్ సంశయం బున్న దా
నిని శంకల్ విడి చేయుఁ డందువలనన్ నేనేమి మాటాడ కే
గినచో సీతయు ప్రాణముల్ విడుచు నింకీరూప యుక్తంబె యౌ. 526

క్రమతన్ జేయుని దూతఁబట్టి నెఱవేఱన్ సిద్ధమై యున్న కా
ర్యము లెందున్ తగి దేశ కాలములు వీలై యుండమిం జేసి స
ర్వము సూర్యోదయవేళఁ జీఁకటు లటుల్ భ్రష్టంబు లై పోవుఁ గా
ర్య మకార్యంబుల మధ్య బుద్ధి స్థిరమే యయినన్ ప్రకాశింపదున్. 527

ఇట మేమే తెలివైన వార మని యెంతే మూర్ఖులై యెంచు వె
న్నటి దూతల్ వడిఁ గార్యముల్ చెఱుపుదుర్ నైపుణ్య మేపార ముం
దటఁ గావించిన కార్య మెట్లు చెడదో తత్కాల వైక్లబ్య మిం
దెటు కాకుండునొ వార్ధి దాటుట వృథాయే కాదో యట్లెంచనౌ. 528

ఎటులన్ నాపలు కాలకించు, వ్యథ నేమీ పొందదో యట్టులే
యిటఁ జేయందగు గష్టపెట్టని హితుం డిష్టార్థుఁడౌ రాము ని
చ్చటఁ గీర్తించుచు నార్త నిష్ఠమతియౌ సత్సాధ్వి కుద్వేగ మిం
దెటు గల్గింపక యారఘూద్వహుని శ్రావ్యేష్టోక్తులన్ విన్పెదన్. 519

ఇఁక నాజానకి నాదువాక్యముల నెంతే శ్రద్ధ నాలించుచో
సకలంబున్ వచియింతు నంచును మహాసద్భావుఁడౌ వానరుం
డకలంకం బయి మాధురీయుతము సత్యం బైన వాక్యాలు చె
ట్టుకు మధ్యంగల కొమ్మ చాటగుచు నిట్టుల్ పల్కె నాసీతతో. 520

## —: హనుమంతుఁడు రాముని సంగతి స్మరించుట :—

దశరథుండను నొక రాజు తనరుచుండె
అతఁడు రథగజ వాజి సంయుతుఁడు ఋజువు
పుణ్యశీలుఁడు తేజస్వి పూర్ణయశుఁడు
అతఁడు సమ్రాట్టు రాజర్షి నుత గుణుండు. 521

అతఁడు బలమున సురపతి ప్రతిముఁ డగుచు
సత్య విక్రముఁ డయి యహింసా రతుండు
నగుచు నిక్ష్వాకుకుల ముఖ్యుఁ డగుచు నుండె
లక్ష్మి వర్ధనుఁ డాతండు లక్ష్మి యుతుఁడు. 522

రాజ లక్షణ యుక్తుఁడు ప్రథిత నృపుఁడు
చతురుదధి తట పరివృత క్షితిని ఖ్యాతుఁ
డధిక సంపన్నుఁడు సుఖీ సౌఖ్యప్రదుండు,
అతని కొక ప్రియ సుతుడుండె నధిక గుణుఁడు. 523

ఇక్ష్వాకు శ్రేష్ఠుడు చంద్రనిభాననుండు
అఖిల ధానుష్కవరుడు రామాహ్వయుండు
స్వీయ ధర్మమున్ బ్రజను రక్షించువాడు
జీవజగము ధర్మమున్ను రక్షించువాడు. 534

సత్యసంధుఁడు వృద్ధుఁడౌ జనకునాజ్ఞఁ
బత్నితోడఁ దమ్మునితోడ వనికిఁబోయి
ఆతఁడటఁ గామరూపులౌ నసుర తతిని
వనములో వేటతతిఁ జంపి వైచె మిగుల 535

ఇక జనస్థానవధము గావించి నట్టి
యతనిచే ఖరదూషణుల్ హతులె యైరి
అంతఁ గోపించి రావణుఁడతని సతిని
మాయలేడిచే వంచించి మఱి హరించె. 536

అప్పు డాయనింద్యను దేవి సీత నతఁడు
వెదకుచును సఖు సుగ్రీవు నదన ఁబొందె
అవల వాలిఁ జంపి కపి రాజ్యంబు నెల్ల
నప్పగించె సుగ్రీవునకు రాఘవుండు. 537

పిదప సుగ్రీవు నాజ్ఞచే వేగ నపుడు
కామరూపులు వేలుగాఁ గపులు వెడలి
దేవి వెదకుచున్నా రెల్ల దిక్కులందు
వీను సంపాతి వాక్కు లాలించి వేగ 538

నూఱు యోజనములు గల వారినిధిని
ఈ విశాలాక్షి కొఱకు లంఘించి యిపుడు
రాముచే సీత రూపువర్ణంబు లక్ష్మి
వింటి రాముపత్నిని నిది కంటినిపుడు. 539

అని హనుమంతుఁ డిటులనఁగ
విని యుంగరములు తిరిగిన పెనుకురుల తుదల్
తనరు సుకేశి కురుల మిం
చిన మొగమెత్తి గనుగొనెను శింశుప తరువున్. 540

కపి మాట లాలకించియు
నపు డఖిల దిశల విదిశల నన్నియు పై పుల్
విపులము లగు కనులఁ బఱపి
స్వపతిం దలచుకొనుచుఁ గడుసంతస మందెన్. 541

అడ్డముగఁ బైకిఁ గ్రిందికి నచటఁ గనుచు
నామె భావింప రానట్టి యాత్మ గలుగు
వానరేశు నమాత్యుని పవనసూను
నుదయు మొందు సూర్యుబలె నాసుదతి చూచె. 542

తెలుపౌ పుట్టము చుట్టఁబెట్టి మెఱపుం దీవెల్ గణంబట్లు పిం
గళుఁడై విచ్చు నశోక పుష్పముల గ్రోగ బ్లొప్పి, మేల్ పైఁడి క
న్నులతో భాసిలి, కొమ్మలం దడఁగి యెంతో ప్రీతితోఁ బల్కు న
జ్జ్వలు నప్రమున్ హనుమంతుఁ జూచి కడు నాశ్చర్యాన నెంచెన్ మదిన్.
543

అవురా ! యెంతటి భీమరూప మిది యెట్టైనన్ గపుల్ పొంద రా
దు విలోకింప నశక్యమౌ ననుచుఁ దూర్ణంబ మూర్ఛిల్లి యుం
డవలన్ లేచియు రామ రామ యనుచున్ హాలక్ష్మణా ! యంచు నా
ర్తి విలాపంబులు మెల్ల మెల్ల స్వరముల్ దీపింప నేడ్చెన్ గడున్. 544

పెడద వంకర మోముతోఁ గడుఁ దనర్చి
బుద్ధిమంతుల లోపల ముఖ్యుడైన
హనుమఁ గని సీత స్మృతిపోవఁ బ్రాణమడగి
పటులయి చిరంబునకు స్మృతి నంది తలచె. 545

కలలో నిట్టి వికారమైన కపి, ప్రైఁగా శాస్త్ర దూష్యుండు ని
ట్టులఁ జూడంబడి, రామలక్ష్మణుల కిట్టుల్ పూజ్యుడౌ తండ్రికిన్
గలుగుంగావుత స్వస్తి యిద్ది కలయా! కాదేను నిద్రింపనే
యులఁ జంద్రాననను రామునిన్ విడిన నాకెట్టుల్ వచ్చునా నిద్రయున్. 546

ఇటు కామంబున రామరామ యని యెంతే బుద్ధి జింతించుచున్
అటులే వాక్కుల వారిఁ బల్కుచును నెప్డా రాము వంబు ము
చ్చటఁ గందున్ వినుమన్ స్మరార్తనయి నా సర్వంపు భావంబు లిం
తటివానిన్ గలలోన నెంతుఁ గనుదున్ తద్వాక్కు వింటున్ సదా. 547

ఒక వేళను నిది నా కో
రిక యేమో, చింత చేతు స్మృతిఁ దర్కింతున్
ఇక కోర్కెకొ రూపేది, ప
లుకు నితడు స్ఫుటముగ, వ్యక్తరూపుడు గూడన్, 548

సురపతికి బృహస్పతికి నొ
నర్తును వందనము, నగ్ని సలినజులకు నేన్
వరభక్తి దండమిదె! వన
చరుఁ డితఁడు వచించిన యది సత్యంబవుతన్, 449

వ. అప్పుడా హనుమంతుఁడా రాక్షస స్త్రీలు నిద్రకు వశులయియుం డుటను గాంచి మెల్లన చెట్టునుండి దిగి విద్రుమము వంటి మొగముగలిగి ఆ మహాతేజుడైన హనుమంతుడు వినమిత వేషుడయి దీనుడయి సీతకు నమస్కరించి సమీపించి నుదుట నంజలి యొగ్గి మధుర వాక్కుతో నిట్లనియె. 550

(ఈ వచనము వ్యాఖ్యాతల భావము)

నలిగిన వలువూను నళిన దళాక్షి యనింద్య!
తరుశాఖ దాల్చిన దాన వెవరు
కనుదమ్ము లందుండి వనట నశ్రులు-చిమ్ము
నీరటు-గార్చెదు నీవ యెవరు

శశివీడి దివినుండి నిశిపడు రోహిణి
యుడువర వలెనున్న యువిద; యెవతె
వలుకనో భ్రాంతినో యనఘ వసిష్ఠుని
మతి త్రుక్కి విడు నరుంధతివ యేమి

శోభనా! మరుత్కిన్న రాసుర సురాహి
యక్ష గంధర్వ వసు రుద్రులందు నెవతె
విహము నుండి పరము గన్న యెవరిఁ గూర్చి
వ్యధ పడెదు, పుత్ర పతి పితృ భ్రాత లెవరు. 551

* ఏడ్చుటవల్లను నిటుల నిట్టూర్చుటన్
క్షితి తాకుటను దేవతవవు కావు
రాజలక్షణములన్ రమ్యావయవములన్
మహిపు సుతవు రాజమహిషి వౌదు
ప్రథిత జనస్థాని రావణుఁడు హరించి
నట్టినచో సీత వవుదు చెప్పు
నీదు దైన్యమ్మును నీదు సౌందర్యము
ప్రతివేషమును జూడ రాము సతివె

అని హనుమ పల్క రాము కీర్తనముఁ బట్టి
యలరి యనె సీత చెట్టుపై మెలఁగు కపికి
"రాజవరులలో ముఖ్యుఁడు ప్రాజ్ఞుఁ డహిత
బలదమనుఁ డాదశరథు కోడలిని నేను. 552

---

* ఏడ్చుట, నిట్టూర్చుట, భూమిని తాకుట మొదలగు కొన్ని గుణములు దేవతల కుండవు. అవి మనుష్యులకే కాన, ఈ కానిపించు స్త్రీ దేవత కాదని భావము.

వ. మఱియు నేను మహాత్ముఁడును విదేహుఁడు నగు జనకుని కుమార్తెను. నా పేరు సీత. ధీమంతుఁ డైన రాముని భార్యను. నేను పండ్రెండు సంవత్సరములు రాముని స్వగృహమందు మానుష భోగము లనుభవించుచు సర్వకామముల సమృద్ధి కలదాననై యుంటిని. పదు మూఁడవ యేట ఇక్ష్వాకు నందనుఁడైన రామునిని తండ్రి దశరథుండును ఉపాధ్యాయుఁడైన వసిష్ఠుఁడును అభిషేకము చేయఁ దలచిరి. అభిషేక సామగ్రులు ప్రోగు పఱచుచుండ కైకేయీదేవి భర్త కిట్లనెను. రామునికే కనుక పట్టాభిషేకము చేసితివా నేను నీరు అన్నము ముట్టను. ఇట్లే జీవితమును ముగింతును. నీవు ప్రీతితో ఇదివర కేవాక్యము పలికితివో అది అబద్ధము కారాదు. రాముఁడు వనమునకు వెళ్ళవలెను." అని యామె యనఁగా ఆ రాజు సత్యసంధుఁడై తానిచ్చిన వరదానమును తలంచుకొని కైకేయి చెప్పిన క్రూరవాక్యమును విని మూర్ఛిల్లెను. పరే యింక నా ముసలిరాజు ధర్మమున నున్నవా డయి యశస్వి యగు తన జ్యేష్ఠకుమారుని నుండి యిచ్చెదనన్న రాజ్యమును తిరిగి యాచించెను. అంత శ్రీమంతుఁడైన రాముఁడు రాజ్యాభిషేకము కంటెను మిగుల ప్రియమైన ఆ వాక్యమును విని మనసులో మొదట నిశ్చయించుకొని వాక్కుచే దానిని పరిగ్రహించెను. 553

ఇచ్చును గాని మరెన్నఁడు
పుచ్చుకొనఁడు సత్యవిక్రముఁడు రాముండో
నిచ్చలు నప్రియ మింతయు
నెచ్చట జీవితమునకును నీఁక బలుకండున్. 554

విలువైన యుత్తరీయం
బులు రాజ్యమును మదిలోనఁ బోవిడి తల్లి[redacted]
గొలువఁగ నను బనిచెను, న
వ్వల నతని యెదుటె నడచితి వనమున కపుడే. 555

అతఁడు లేని స్వర్గము నాకు ననభిమతము
ఆప్తులను హర్షపెట్టు మహానుభావుఁ
డయిన సౌమిత్రి వల్కలా లపుడె దాల్చి
యన్న ననుసరించియు వని కరుగుదెంచె. 556

మేను ప్రభువు నాజ్ఞను దలమీఁదఁ దాల్చి
వ్రతము పూని యిదివఱ కేగతిని మునుపు
గనని గంభీర మైనట్టి వనిని జొచ్చి
దండకారణ్యమున నుండుతఱిని నపుడు. 557

అమిత తేజస్వి రాముని యతివ నన్ను
నాదురాత్ముఁడు రావణుం డపహరించె
రెండునెలలు మాత్రము నా కతండు గడువు
నిచ్చె నిఁకపైని నసువుల్ త్యజించి పైతు. 558

వ. కపిసంఘ నాయకుఁ డైన హనుమంతుఁడు దుఃఖ తిరస్కృత యగు నా సీత వాక్యమును విని దుఃఖము పొంది యోదార్చుచు నిట్లనెను. "దేవీ! ఓ వైదేహీ! నేను రాముని దూత నయి నీదగ్గఱకు వచ్చితిని. క్షేమముగానున్న రాముఁడు నీదు క్షేమమును అడిగెను. 559

వేదములను బ్రహ్మాస్త్రము
నేధీరుం డెఱుఁగు నట్టి కృతకృత్యుండున్
వేద విదగ్ర్యుఁడు రాముం
డా దాశరథి నిను క్షేమ మడిగెను దేవీ! 560

అతితేజ శ్శాలియు నీ
పతికిఁ బ్రియ మగు ననుచరుఁడు బహుశోక సుదుః
ఖితుఁ డగు లక్ష్మణుఁడును నీ
కతిభక్తిని జేసె మిగుల నభివాదనముల్. 561

అనఁగ జానకి యాపురుషాగ్రసరుఁ
క్షేమమును దెల్సికొని మిగుల హర్షించి పలికె
బ్రదుకుచో నూఱు సంవత్సరముల కైనఁ
గను సుఖ మను సూక్తియు శుభం బనుచుఁదలఁతు" 562

వ. అప్పు డాసీత మాటలు విని యాహనుమంతుఁడు ఆసీతతోఁ గలిసికొన నామెకు చాలప్రీతి కలిగెను. ఇట్లు వారిద్దఱు ఒండొరులను విశ్వసించి సంభాషింపదొడఁగిరి. అంత హనుమంతుఁడు శోక దీన యగునామెను సమీపింపఁగా అతఁడు తన దగ్గరకు వచ్చిన కొలఁది యాసీత ఆహనుమంతుని రావణుడేమో యని యనుమానింప సాగి యిట్లనుకొనెను. 'అహో! ఏమి ఇట్లు చెప్పి యెంత చెడ్డ పని చేసితిని. మారు వేషముతో రావణుఁడె యిట్లు వచ్చెను. అని యాయశోక వృక్షశాఖను విడిచి శోకార్తయై నేలపై గూలఁబడఁగా మహాబాహు వైన హనుమంతుఁడు భయమోహితురా లగు సీతను జూచి నమస్కరించెను. ఆమెయు భయత్రస్తయై మరలఁ బైకిఁ జూడలేక నమస్కరించుచున్న హనుమంతుని జూచి నిట్టూర్చి మెల్లని సర్వముతో నిట్లని పలికెను. 563

మాను రూపు దాల్చి మాయావి యైనట్టి
రావణుండ వగుచు నీవిధాన
మరల దుఃఖ మీవు వఱలంగఁ జేసిన
నిదియు నీకు మేలు నిడదు సుమ్ము 564

స్వస్వరూపు వీడి సన్న్యాసివై జన
స్థానమందుఁ గన్న దశముఖుఁడవె
కామరూప! దైత్య! కడు నుపవాసాలఁ
జిక్కి దీనఁ జెఱపక్షేమమగునె 565

పోని యిది నేను శంకింపఁ బోల దిటుల
నిను గనఁగఁ బ్రీతిగనె నామనసు లోన
రాము దూతవై వచ్చితేన్ క్షేమమవుత
కపివరా! యడుగుదు రాము కథను జెప్పు. 566

నా ప్రియుం డగు రాము గుణాలు చెప్పు
ఏటి గట్టున్ వఱఁద యటు హృది హరింతు
నన్ను మరపించు కలయె టానందకరమె;
రాముఁ డంపినట్టి కపి దర్శనము గలిగె. 567

స్వప్నమందైన రామలక్ష్మణులఁ గనిన
ఎంత సుఖము జనించెనె యిపుడు నాకు
స్వప్నమును గూడ మిగుల మాత్సర్య మొంది
చూడనీ కున్నదే, యెందులోఁ జొత్తు నింక. 568

కల యిది యని యనుకొన నింక
కలలోఁ గపిఁ జూడ శుభము కలుగదు, శుభమో
కలిగెను, పోని మతి చెడె నని
* యిల వాత గతియు మదమొకొ మృగతృష్ణికయా. 569

పోని యిది మతిచెడుటయా
కానేరదు, మోహ మేని కడు పిచ్చిగుణా
లైనఁ గలిగియుండును మఱి
యీ నను నీవానరవరు నెఱిఁగియు యుంటిన్. 570

* వాతగతియు=వాతరోగమా.

అని సీత బహువిధంబుల
ననుకొనుచు బలాబలముల స్వాంతము లోనన్
కని నిశ్చయించి రాక్షసు
ల నిజేచ్ఛారూపు లితడొ రావణుఁడె యనెన్. 571

అని తనుమధ్యమ జానకి
మనసున దలఁచి కపితోడ మఱిపలుకమి నా
హనుమంతుఁ డెఱిఁగి వినఁగా
ననుకూలము లగు వచనముల హర్షము గూర్చెన్. 572

రవివలెఁ దేజస్వి సుధాం
శువువలె లోకముల ద్యుతుల శోభిల్లును వై
శ్రవుఁడటు జగత్పతి, వి
ష్ణువువలె విక్రమయుతుఁ డయి శూరతఁ జూపున్. 573

ఆతఁడు రూపవంతుఁ డదనం దలుకన్ గనఁ బర్చి కొట్టువా
డాతఁడు సత్యమున్ మధుర మౌగతిఁ బల్కు బృహస్పతిం బలెన్
ఆతఁడు మూర్తి దాల్చిన సుమాయుధుడైన మహారథుండు నెం
దాతని యామహాత్ముని భుజాంతరమందునె నిల్చు లోకముల్. 574

ఎవ్వఁ డాశ్రమ పథి నుండి మృగపు వేష
మూని రాము దవ్వగ జనుల్ లేని వనికిఁ
దీసికొనిపోయి, నినునొంటిఁ దీసికొనుచు
వచ్చె వాఁడు దానిఫలంబు వడయఁ గనెదు. 575

వీరుఁ డెవ్వఁడు రణమునఁ గ్రూరమైన
బాణములు వేగ మండెడి వహ్ని లట్లు
వడిఁ బ్రయోగించి వధియించు త్వరగ నట్టి
ఘనుఁ డనుప వచ్చితిని దూతగానె యిటకు. 576

నీవియోగార్తి రాముండు నీదుకుశల
మడిగె నాసుమిత్రానంద మతిగఁ బెంచు
లక్ష్మణుఁడు మహాబాహువు ప్రాంజలి యయి
నీదు క్షేమంబు ప్రశ్నించె నియతితోడ. 577

దేవి! రాము సఖుండు సుగ్రీవుఁ డెల్ల
కపులరాజు నీక్షేమముఁ గరమ యడుగు
రామ సుగ్రీవ లక్ష్మణుల్ సతత మెంత్రు
రాక్షసీమధ్య భాగ్యాన బ్రదికి యుంటి. 578

త్వరలో రాముని లక్ష్మణు
వరకపి సుగ్రీవుని గను భాగ్యం బగు వా
నరుఁడను హనుమను, వార్ధిని
తరించి యీలంక నిపుడు త్వరగాఁ గంటిన్. 579

చేరి దుష్టుఁడౌ రావణుని శిరముపైని
కాలిడుచు నిన్నుఁ గనఁ బరాక్రమము మీఱ
వచ్చితిని, నీవని నటు రావణుఁడఁ గాను
శంకవీడి నాపయిని విశ్వాస ముంచు. 580

వ. అట్టులు ఆ జానకి వానరశ్రేష్ఠుఁడగు హనుమంతుని నుండి రాముని 581
వృత్తాంతము విని మధురోక్తితో సాంత్వముగాఁ బలికెను.

ఎటు లారామునితో సమాగమె మయ్యెన్ భ్రాత సౌమిత్రి నే
నెటులన్ దెల్సితి వెట్లువానరులతో నీమానవుల్ గల్సిరా,
రెటు లుండున్ మఱి రామలక్ష్మణుల గుర్తింకన్ నీవు వాక్రువ్వ నే
న్నిట దుఃఖంబు స్పృశింపకుండుతను నిప్డే చెప్పు మోవానరా! 582

రాముని రూపమెట్టిదియొ, రాముని యాంగిక సన్నివేశమున్
రాముని బాహువుల్ తొడలు లక్ష్మణునాకృతి యెట్టిదో కరం
బేమఱకే వచింపు మన నీ హనుమంతుఁడు వేగ సీతతో
రామునిగూర్చి వాస్తవములన్ వచియింపఁగ సాగె నంతటన్. 583

ఎఱుఁగుదు వైన నాదగు సదృష్టముచే వచియింపఁ గోరు దో
సరసిజనేత్ర! రాము విభు సంగతి లక్ష్మణు సన్నివేశ మే
నరసిన తీర్లు చెప్పెదను నవ్వి, విశాల దగ్రుంచలా! యికన్
సరిగను నాలకింపుమిది సత్యము చెప్పెదఁ దెల్సినంతలో. 584

* రాముండు విచ్చిన తామరఱేకుల
వంటి చక్కని కండ్ల వఱలువాఁడు
రాముండు సర్వమౌ ప్రాణముల హృదిగూడ
నపహరించెడి యంద మమరువాఁడు
రాముండు స్త్రీల లెక్కేమి పురుషులనేన్
వ్యామోహ పఱచు రూపంబు వాఁడు
రాముండు ఋషి హృది రంజింపఁ బుట్టిన
యాత్మదాక్షిణ్యాన నలరువాఁడు

తేజమున సూర్యుఁబోలి దీప్తించువాఁడు
ఓర్పున భువికి సాటియై యుండువాఁడు
బుద్ధిలోన బృహస్పతిన్ బోలువాఁడు
కీర్తితో నింద్రునైనను గెలుచువాఁడు. 585

---

* అన్నియంగముల కంటె గన్నులు జీవన ప్రదములు గనుక మొదట వర్ణింపబడెను.

రక్షించు జీవలోకము
రక్షించును స్వజనములను రక్షించుఁ బ్రజన్
రక్షించు నాల్గుజాతుల
రక్షించి స్వశీల ధర్మరక్షణ చేయున్. 566

కడు లోకపు హద్దులలో
నడచును, నడిపించు జనుల నయమగు రీతిన్
కడు నర్చిస్సులు గలిగియు
వడి నర్చింపఁబడుచుండుఁ బ్రజలందఱచే. 567

* సతతము బ్రహ్మచారి యయి సాధుల మేలును విస్మరింపఁ డీ
మతి నిహముఁ బరంబు గని మానిత కర్మలు చేయుఁ బంధు స
ద్గతి మెయి విప్రులన్ గొలువ గట్టిగ నేర్చెను రాజవిద్యలన్
శ్రుతమును శీలమున్ గలిగి సుష్ఠుగ శిక్షణ పొందె నన్నిటన్. 568

ఆతఁడు యజుర్వేదమందు శిక్షితుఁ డయి
వేదవిదులచేత వినుతు లందె
వేదవేదాంగాల విశ్రుతుఁ డయి ధను
ర్వేదమందును నిష్ఠ విధిగ పొందె
విపులాంసుఁడయి మీఱు పృథుబాహువై యొప్పు
కంబుకంఠుఁడు సువక్త్రాఖ్యుఁ డతడు
గూఢ జత్రు వరుణాక్షుఁడు స్నిగ్ధవర్ణుండు
దుందుభి స్వనుఁడు సుపంథుఁ డతఁడు

---

* రాముఁడు మానవులనేగాక నరవానర ఋక్ష పక్షి మృగ హృదయముల
నాకర్షించినవాఁడు గాన ప్రాణులని చెప్పబడెను.
* ఋతుకాలమందు భార్యనుగలియువాడు బ్రహ్మచారి యని ధర్మశాస్త్రము

సమముగాఁ బంచబడిన యంగముల వాఁడు
శ్యామదేహుఁడు పృథువిక్రమాఢ్యుఁ డతఁడు
* ఉరము మణిబంధమును ముష్టిస్థిరత నుండు
* భుజములను కన్బొమలు జానువులు పొడుగుం 583

సమముగా వెంట్రుకల్ జానువు లొడలును నొప్పు
పెత్తునాభియు పొట్ట హృదియు మీఱు
కాలి నఖాల్ వ్రేళ్ళు కనుల తుద లెఱుపు
లయి కన్ను దోయికి నందమిచ్చు
కాలి రేకులు కురుల్ గాత్రమెంతయు నున్ను
స్వరనాభి గతులును ప్రౌఢి నెఱపు
వళులు మూఁడును నొప్పు పాదరేఖ కుచచూ
చుకములు లోతుగా చొప్పునెఱపు

పిఱుఁదు నాభియు మెడ పిక్కలరయ లోతు
తలపయిని మూడు సుడులును తనరుచుండు
బొటనవ్రేలున తేకులు పొలుచు నాల్గు
చేతుల నుదట గాళ్ళ నల్ గీతలుండు

ఎనిమిది యడుగుల యెత్తైన వాఁడును
జానూరు జంఘా భుజాలు సమము
కన్బొమల్ ముక్కులు కన్నులు వీనులు
మోఁకాళ్ళు చనుమొనల్ మోవి సమము
మణికట్టు లింగాలు మఱియు మోచేతులు
కరముల్ నడుములు కాళ్ళపిఱుఁదు లొకటె

---

* త్రిస్థిరుడను మూలమునకిది వివరణము.
* త్రిప్రలంబుడను దానికిది వివరణము.

* నలు దంతములు మేలు, పులియేన్గు సింహము
వృషభాలవలె గతి యొసగువాడు

పెదవుల్ దవడలు ముక్కులు పెద్ద వగును
పండ్లు కండ్లు కాళ్ళు కురులు త్వక్కు పొల్చు
వ్రేళ్ళు తొడలు చేతులు పిక్కలెల్ల పొడవు
రామునికి నిట్లు మిక్కిలి రమ్యములగు 589

కనులు మొగము నోరును నాల్క చనులు పెదవు
లంఘ్రులు దవడలు కాళ్ళు కే లజ్జ సమము
లంఘ్రులు తలకుదురులు చెవుల్ హస్త హృదులు
రొమ్ము కంఠము కడుపు పిఱుదులు పెద్ద. 590

తేజమును యశస్సును శ్రీలును దిశల నడరు
కనులు దంతాలు తెలుపగుఁ గడుపు చంక
రొమ్ము ముక్కు మూపు నుదురు గ్రమ్ముఁ బైకి
వ్రేళ్ళు కణుపులు కురులు గోళ్ళు చర్మ. 591

లింగమును మీసమును బుద్ధి దృష్టి సూక్ష్మ
మగుచు మిగుల రాముని కొప్పు నరసినాను
ఉదయ మధ్యాహ్న సాయాహ్న విదిత సమయ
ములను ధర్మార్థ కామాలఁ బొలుచు వరుస. 592

---

* వివ :– త్రిభిర్వ్యాప్తః ద్వితుక్లవాన్, షడున్నతః, నవతనుః త్రిభిర్వ్యాప్నోతి అను వీనికి త్రిసమః మొదలైన వానికి పైపద్యములు వివరణము హనుమంతుడు సాముద్రికను నెఱిగినవాడు గాన నిట్లు చెప్పెను.

సత్యమున ధర్మముననుఁ నాసక్తిమెండు
శ్రీయుతుఁడు సంగ్రహానుగ్రహాయుతుండు
దేశ కాల విభాగంబులం దెలియు వాఁడు
అఖిల లోక ప్రియుంవదుఁడయి చెలంగు. 693

వాని పినతల్లి కొడుకును భ్రాత యయిన
లక్ష్మణుండనురాగాన రామణీయ
కమున గుణముల సర్వవిధముల చేత
రాము నంతటి వాడై విరాజిలెడిని. 694

వ. ఆ నర శ్రేష్ఠులిద్దఱు నారబట్టలు దాల్చి ధనుర్ధరులై నిన్నుఁ జూడఁగోరి మాతోఁగలిసి భూమి నంతయు వెదకుచు అన్నచే లేవఁ గొట్టఁ బడి భయార్తుడై కపిరాజైన సుగ్రీవుడు అనేక వృక్షములతో నిండిన ఋష్యమూకాద్రి పృష్ఠమును మేము సేవించుచుండు సమయమున అక్కడకు వచ్చిరి.

వారిని జూచి సుగ్రీవుఁడు భయపడి యాగిరి శిఖరము నుండి యింకొక చోటునకు వెళ్ళ మూర్ఛిల్లి నన్ను అ రాజ పుత్త్రుల దగ్గఱకుఁ బంపెను.అప్పుడు రూప లక్షణ సంపన్నులైన యా నరశ్రేష్ఠులను సుగ్రీవునిమాటచేనేను కృతాంజలినయి సమీపించి వారి యథార్థ స్థితిని తెలిసికొనగా ప్రీతులైరి. అంత వారిని నేను వీపుపై నెక్కించుకొని సుగ్రీవుని దగ్గఱకుఁ దీసికొని వెళ్ళగా వారందఱు అన్యోన్య సల్లాపములు చేసికొన్న మీదట వారికి పరస్పరము ప్రీతిపుట్టెను. అపుడు ఆ కపీశ్వరుడు నరేశ్వరులను ఒకరినొకరు ఓదార్చుకొనిరి. అపుడు గొప్ప తేజస్సు గల వాలిచేఁ దిరస్కరింపబడి స్త్రీకై విచారించుసుగ్రీవుని ఊరడించి దుఃఖమున నార్తుడై యుండగా లక్ష్మణుఁడు సుగ్రీవునితో రాముని శోక వృత్తాంతమును నివేదించెను. అది విని వానరేంద్రుడగు సుగ్రీవుడు గ్రహగ్రస్తుఁడైన సూర్యునివలె నిష్ప్రభుడయ్యెను. అంత రాక్షసుడు నిన్ను తీసికొని పోవునపుడు మార్గములో నీవు పడవేసిన యాభరణములు రామునికి

కపులు తీసికొని వచ్చి చూపిరి. వానిని నేను భద్రపఱచితిని. నీ వెక్కడికిఁ దీసికొని పోబడితివో మాత్రము తెలియులైరి. అప్పుడు గలగలమనిధ్వని చేయు నా భూషణములను చైతన్యము పోవగా దేవప్రకాశుడయిన రాముడు చూచి యొడి పొందుంచుకొని యనేక విధములుగా విలపించెను. ౫౯౫

నీదు భూషలు చూచి యావేదన పడు
రాముని కవి శోకాగ్ని వర్ధకము లయ్యె
దుఃఖమున నామహాత్ముఁడు తూలిపడఁగ
నేనెటులెటులో కడు నూరడించినాను. ౫౯౬

వాని గని పల్క ఆమహాబాహు వింక
సఖుఁడు సుగ్రీవునికిని లక్ష్మణునితోడ
నట్టి నీభూషణంబుల నపుడు చూపి
పరితపించె నిన్గన కగ్నిపర్వతమటు. ౫౯౭

నీకొఱకయి నిదురలేమి శోక చింత
నామహాత్ముడౌ రాముని నగ్ని గృహము
నగ్ని లట్టులు తపింప నతఁడు చింత
మిగులఁ దపియించి పోయెను మేనువాడ. ౫౯౮

ధరణి కంపింప గొప్ప భూధరమువోలె
నిను గనక యారాముఁడు కడు వణఁకిపోయె
రమ్యవనుల నదులను ఝురంబు లరసి
తిరుగుచును నిన్నుఁగనక సంతృప్తి గనఁడు. ౫౯౯

స్వసుత బంధుయుక్తముగ రావణుని జంపి
నరవరుండు జానకి! నిన్నుఁ బడయఁ గలఁడు
రామ సుగ్రీవు లిరువురు రయము కలిసి
వాలి వధ నిన్ వెదకుట యేర్పఱచు కొనిరి. ౬౦౦

ఆపల రాముస్తుత్ కిష్కింధ కరుగుదెంచి
యూజి వాలిఁ జంపి కపిరాజ్యంబు నందు
విభు సుగ్రీవుఁ గావించి వెలసినారు
ఇట్లు వారి స్నేహము వృద్ధి నెనసె దేవి! 601

నేను హనుమంతుఁ డను వాఁడ నేను దూత
నగుచు వచ్చితి సుగ్రీవుఁ డఖిలరాజ్య
మేలసి, సర్వదిక్కుల యందు నెల్ల నిన్ను
వెదుకఁ బంపెను శీఘ్రమె వినుము దేవి! 602

ఆమహౌజసుఁ డగువానరాధిపతియు
గిరుల వంటి వానరుల నీకొఱకు పంప
వారు నేనును సుగ్రీవు వాక్కుచేత
భూమి యంత వెదకితిమి పూర్తిగాను. 603

వాలి సుతుఁ డంగదుఁడు లక్ష్మివంతుఁ డేము
బయలుదేఱి వింధ్యాద్రిని భ్రష్టుల మయి
బిలమున భ్రమించి యార్తిని వ్యథను నుండ
చాల రాత్రులు గడచె నాలీల నెట్లొ. 604

వనుల దుర్గాల సెలయేళ్ళ ప్రాంతములను
వెదకి నిన్గనక యసువుల్ వీడఁ బోవఁ
గపులఁ జూచి యంగదుఁడు శోకాబ్ధి మునిఁగి
మిగులఁ బరిదేవనము చేసెఁ బొగిలి దేవి! 6(5

వ. దేవీ! నీవా కనిపించలేదు. తండ్రి యగు వాలివధ యయ్యెను. నిన్నుఁ జూడక పోవుటచే మేము ప్రాయోపవేశముచేయఁ దలఁచితిమి. జటాయువు మరణించెను. అపుడు స్వామి యాజ్ఞ నెఱవేర్పక నిరాశులమైమూర్ఛిల్లి యుండ కార్యసిద్ధికో యన్నట్లు వీర్యవంతుఁడు గొప్పవాఁడును గృధ్రరాజు

జటాయువు సోదరుఁడు నగు సంపాతి యనుగృధ్రరాజువూవిచారముతోవచ్చిన జటాయువు వధ వృత్తాంతము విని కోపముతో నిట్లనెను. నాచిన్నతమ్ముఁడు ఎవ్వనిచే నెక్కడఁ జంపఁబడెను. ఓ వానరోత్తములారా! ఈసంగతి నాకుఁ దెలుపఁగోరుచున్నాను. అనఁగా అంగదుఁడు జనస్థానములో నిన్ను అపహరించు నపుడు నీయుపహరణములో నిన్ను రక్షింప వచ్చిన జటాయువును భీమాకారుఁడైన రాక్షసుఁడు చంపినట్లు చెప్పగా నాసంగతి వినియరుణాత్మజుఁడైన యాసంపాతి విని దుఃఖించి యపుడు రావణుని గృహములో నీవున్నట్లు చెప్పఁగా అంగదుఁడు మొదలైన వారందఱును మేము బయలుదేఱి వింధ్య పర్వతమునుండి సముద్రము నుత్తరపు చివరి తీరమునకు వచ్చితిమి. అపుడు అంగదుఁడు మొదలైన వానరులు నిన్నుఁ జూడవలయునను నుత్సాహముతో హృష్టులై సముద్రపు గట్టు దగ్గరికి వచ్చి సముద్రము దాటు టెట్లని చింతిల్ల వానరసైన్యమును జూచి అపుడునేను తీవ్రమైన నూఱుయోజనముల దూరపు సముద్రము దాటి వచ్చితిని. రాక్షసులతో నిండిన లంకను రాత్రి ప్రవేశించి రావణునిచే శోకదీనవగు నిన్నుఁ జూచితిని. ఓయనింద్యురాలా! జరిగినసంగతి యంతయు సరిగా నీకుఁ జెప్పితిని నేను దాశరథి దూతను నాతో మాట్లాడుము నేను రాముని కార్యము నకై నీకొఱకు వచ్చితిని. నేను పవనాత్మజుఁడను సుగ్రీవుని మంత్రిగా నన్ను దెలిసికొనుము. సర్వ శస్త్రధరులలో శ్రేష్ఠుడగు నీకాకుత్స్థుఁడు క్షేమముగా నున్నాఁడు అన్నను ఆరాధించుచును సులక్షణుఁడగు లక్ష్మణుఁడు గూడ నుండెను. వీరుఁడైన నీభర్త హితము జేయఁ గోరిన వాఁడను సుగ్రీవ వచనముబట్టి నేనొక్కడనె నీదుమార్గమును వెదుకఁ గోరి కామరూపినై యసహాయుఁడనై వేగ దక్షిణ దిక్కుగా వచ్చితిని. నీవు నశించి పోతి వేమో యని దుఃఖించు చున్న వానరసైన్యముల సంతాపమును మాయ దృష్ట వశమున నిన్నుఁ జూచినట్లు చెప్పి పోగొట్టెదను మాయదృష్టమున సముద్రమును దాటుట వ్యర్థము కాలేదు. నేనే నిన్నుఁ జూచితి ననుకీర్తి నాకు దక్కినది మిత్ర బాంధవ సహితముగా రాక్షసాధిపుఁడైనరావణుని జంపి మహా

వీరుం డగు రాముండు త్వరలో నిన్ను పొందం గలండు ఓ వైదేహీ! మాల్యవంతమను నొకయుత్తమ పర్వతము గలదు. అక్కడనుండి వానరుం డగు కేసరి గోకర్ణపర్వతమునకు వెళ్ళెను. అక్కడ దేవర్షులు ప్రార్థింపం బుణ్యమైన సముద్ర తీర్థమున శంబసాద నాసురుని వధించెను. అట్టి కేసరి క్షేత్రముసం బుట్టిన కుమారుండను. హనుమంతుండను పేరు నాకర్మవల్లం గలిగినది. అనఘురాలా! నీవిశ్వాసమునకై నీభర్త గుణములను జెప్పితిని అని హనుమంతుండు పలుక శోక కర్శిత యగు నాసీత పై హేతువులచే విశ్వాస పెట్టంబడి తగిన యానవాళ్ళచే నన్ను రామదూతగా తెలిసికొని సంతోషమును పొంది వంకర రెప్పలు గల నేత్రములనుండి యానందాశ్రువులు రాల రక్తశుక్లాయతమైన కన్నులుగల యావిశాలాక్షి మొగము రాహు ముక్తమైన తారాపతి బింబము వలెం బ్రకాశించెను. అంత సీత హనుమంతుని జూచి రావణునిగాం గాకవానరునిగా నమ్మ హనుమంతుండు మరల నాప్రియదర్శనయగు సీతతో నిట్లనియెను. మైథిలి! ఇది నీకంతయు చెప్పితిని ఊరడిల్లుము. నీకిప్పు డేమిచేయమందువు. ఎట్లునీ కిష్టము గలుగును నేనింక రాముని దగ్గఱకుంబోవలయును. మహర్షి ప్రేరణచే శంబసాదనుండను రాక్షసుని కేసరిచంపిన పిదప నేను వాయువువల్ల బుట్టిన వాండను వాయువుతో సమానమైన ప్రభావము గలవాండను అని చెప్పిమఱియు. 606

మరల నామహాతేజుండు మారుతసుతుం
డైన హనుమ సీతయు నమ్మ నట్లు పలికె
ఓమహాభాగ! సద్బుద్ధియౌ రాముం డంప
వచ్చి నట్టి దూతను నేను వానరుండ. 607

ఇదిగో రాముని పేర నంకితమయౌ నీయుంగరం బీవు నీ
యదనన్ జూడు, మహాత్ముండైన భవదీయ ప్రాణనాథుండు నె
మ్మది నీనమ్మికకై యొసంగెను, శుభమౌ్యగాక నీదుఃఖ మి
య్యది నేడింతట తగ్గ నూరడిలుమీ యంచున్ బ్లవంగుం డనన్. 6ి8

సతి యా జానకి భర్త యుంగరము హస్తాగ్రాగ్రిం గైకొంచు స
మ్మతి నీక్షించుచు భర్తయే తనకు సంప్రాప్తించి నట్లెంతొ హ
ర్షితయై తెప్పెఱపై వెడందయగు నేత్రేంద్రీవరా లొప్పి స
న్నుతమౌ మోమున రాహు నుండి విడు చంద్రుండట్టులన్ రాజిలెన్. 609

ఔ లజ్జావతి ముద్దరాలు పతి సందేశంబుచే హృష్టయై
పరితోషంబున మెచ్చి వానరుని నీభంగిన్ ప్రశంసించె వా
నరవర్యా! యిటు రాక్షసాలయము మనన్యాజస్సుచే నొంటి ధి
క్కరణంబుం బొనరింతు శక్తుడవు ప్రజ్ఞన్ మీఱు వీరుండవున్. 610

మకరాలన్ దగి నూఱు యోజనములై పర్తిల్లు సంద్రంబిటుల్
ప్రకటంబౌ బహు విక్రమంబునవె గోష్పాదం బటుల్ దాటు ని
న్నిక సామాన్యుంగనెంచ రావణుని యందే మాత్రమున్ భీతియున్
ఒక యింతేని యసంభ్రమంబు గనకే యున్నావహో వానరా! 611

విది తాత్ముండగు రాముడంపెఁ గనుకన్ స్వేచ్ఛాప్తినాతోడఁ జె
ప్పఁదగున్, జెప్పుము దుర్నివారుఁ డగు నా ప్రాణేశుడా రాముడీ
యదనన్ శోధన చేయకుండ బలవీర్యంబుల్ పరికింపకుం
డఁ దగన్ బంపడు వేని నాదరికి నెన్నండున్ విశేషించియున్. 612

ప్రతిభావంతుఁడు సత్యసంగరుడు ధర్మాత్ముండు రాముండు న
ప్రతిమౌజుండగు లక్ష్మణుండు సుమిత్రానంద సంధాయి యీ
క్షితి క్షేమంబుగదా యదృష్ట వశతన్ క్షేమంబు గానున్నచో
నతఁడే మంబుధి మేఖలోర్విని యుగాంతాగ్నిం బలెన్ గాల్చడో. 613

అటు పోనీ విబుధాళిఁ గెల్వగల సామర్థ్యంబ యున్నప్పుడే
నిటు నాబాధకు నంతుగల్గదు గదా యీరాముఁడీ వేళ ను
త్కట దుఃఖంబును పొంది యుండఁడుగదా కార్యంబు లేవైన నిం
తట గావించునె పురుషోత్తముండటన్ దాపంబు పొందండుగా. 614

ఎపుడున్ దైన్యము పొందకుండునుగదే యెన్నండు కార్యాలలో
విపుల భ్రాంతిని బొంది మోహమున నిర్వీర్యుండు కాలేదుగా
ఎపుడైనన్ బురుషుల్ పొనర్చపనులేవేన్ చేయునేరాట్పుతుం
డెపుడేన్ మిత్రుల సామదానములతో హృత్ప్రీతిఁ గావించునే. 616

తన శత్రులను సామదాన భేదోపాయ
ముల విజిగీషుపై గెలుచు నొక్కొ
మిత్రులఁ గూడియు మిత్రులఁ బొందునె
మిత్రుల మేల్ చేసి మైత్రి గొనునె,
దైవ ప్రసాదంబులఁ దఱచుగాఁ గోరునే
పురుషకార్యము దైవములను గొనునె
రాముండు నాయందుఁ బ్రేమ హీనుఁడు గాఁడు
గద; విడిపించునె వ్యధలనుండి

ఒగి సుఖార్హుండు వ్యధకనర్హుండతండు
గొప్ప దుఃఖము పొందుచుఁ గూలఁడు గద
ఓరముఁ గౌసల్యయు సుమిత్ర భరతుల కుశ
లాదికముఁ గూర్చి వినుచున్న యతఁడె నేడు. 616

మానార్హ రాముండు నానిమిత్తంబున
కుమిలి దుఃఖాలచేఁ గూలఁడు గద
కార్యాంత రాసక్తి గల్గెనా యేమి, న
న్నెప్పటి కే నుద్ధరింపఁగలఁడె
భ్రాతృ వత్సలుఁ డైన భరతుఁ డక్షౌహిణి
సేనఁ బంపునె నాదు క్షేమ మెంచి
కపిరాజు సుగ్రీవుఁ డిపుడు పంపునె దంత
నఖ శస్త్ర కపి సేన నన్నుఁ బ్రోవ

వీర సౌమిత్రి యసురుల ద్రీల్చి నొక్కొ
మండు రౌద్రశస్త్రములచే భండనమున
రయమునన్ బంధుయుతముగ రావణుండు
చంపఁబడుచుండ నేను గాంచంగఁ గలనె. 617

కొమరుం బంగరుతో సమం బయిన రంగుల్ గల్గి పద్మంపు గం
ధములన్ జిమ్మెడి రాము నాననము దీనంబై యుష్ట నేలేమి సె
రము లేకెండను వాడు పద్మమటులన్ రమ్యంబుకాకుండ శు
ష్కమొ యైయుండమునా శీఘ్రముగ వక్కాణింపుమీ మారుతీ. 618

జనకాజ్ఞన్ సెఱవేర్చ ధర్మమున రాజ్యంబున్ విసర్జించి బా
ధ నెవండొందఁడొ కాననుండి భయమున్ దర్శింపఁ డెవ్వండు కా
లిసడన్ వచ్చిన నాకునై వగవఁ డీదృగ్ధీరుఁ డిప్పేశ నె
మ్మనమందున్ గడు ధైర్యమున్ గొనుచు నాత్మస్థైర్యమున్ గాంచునే.
619

ఎవఁ డెల్లప్పుడు మాతఁగాని పితఁగానీ ప్రేమ నాకంటె నె
క్కువగాఁ జూఁడఁడొ యట్టి నాప్రియుని బాగున్ గాంచుచున్నంతనే
భువి జీవంబులు దాల్తు దూత! యనుచున్ బుష్టార్థమౌ మాధుర్య మా
ర్దవ వాక్యాలని యూగె దూత మధులాపంబు లాలింపఁగన్. 620

అపుడు భీమవిక్రముఁ డగు హనుమ తలను
అంజలి ఘటించి సీతతో ననియె నిట్లు
నళిననేత్ర! నీ విచటనున్నట్లు రాము!
* తెలుఁగమిఁ గొనిరాఁడు శచిని నింద్రుఁ డట్లు. 621

---

* ఇంద్రుడు అనుహ్లాదుని చేతులలోఁ బడిన శచిని కొంతకాలము తెలియక యుండి తెలిసిన పిదప తనదగ్గఱకు తీసుకొని వచ్చెనని కథయిట గ్రహింపవలెను.

పిదప నావల్ల విని రాముఁ డదను చూచి
ఋక్ష కపి సేనతో వచ్చు నిటకు దేవి!
క్షోభ యిడరాని జలనిధిం గూడఁ గట్టి
చొచ్చి లంకను రాక్షస శూన్యఁ జేయు. 622

ఇంతకును దేవ రాక్షసుల్ మృత్యు వేని
మధ్యగా వచ్చుచో వారి మఱియుఁ జంపు
నిన్నుఁ గనని శోకమ్మున నిండి పోయి
కనఁడు శాంతి సింహగృహీత గజమువోలె, 623

మలయ వింధ్య దర్దుర మేరు మందరముల
తోడె, మూలఫలంబులతోడె దేవి!
మురువు కన్నులు బింబోష్ఠమును సుకుండ
లాల్గల ప్రియు మోముదితేందులాగు గనెదు. 624

నాకపృష్ఠానఁ గూర్చున్న నాక విభుని
లాగు ప్రస్రవణగిరిస్థు రాముఁ గనెదు
* ఇతఁడు మాంసమున్ దినఁ, డానఁ డెట్టి మధువు
వన్య ఫలములె తినుఁ బొద్దు వ్రాలు తఱిని. 625

త్వన్మయాంతరాత్మముతోడఁ దనరి యోగ
దోమ పురువు పాముల సైనఁ ద్రోలఁ డెపుడు
ఎపుడు ధ్యానియై దుఃఖాన నెంతొ కుమిలి
మది నవశుఁడయి తలఁపఁడు మదిని నెదియు. 626

---

* మాంస మనఁగా రుచికరము సంస్కరించిన మాంసమని గ్రహిం
వలెను.

పండి కూడ నిద్రింపఁడు వరనరుండు
జనకజా ! యని మధురోక్తు లనుచు లేచు
* ఫలమొ పూవొ సుందరమైన వస్తు వేదొ
గాంచి హాప్రియా ! యని నిన్ దలంచి యార్చు. 627

నిరత మోదేవి ! నినుగూర్చి పరితపించి
సీత ! యనుచును నిన్నె యోచించుచుండి
వ్రతముపూని మహాత్ముఁడు రాజ సుతుఁడు
నిన్నె గనఁ గడుయత్నముల్ నేర్మిఁ జేయు. 628

రామునకుఁ దనపైఁ గల ప్రేమఁ దలఁచి
శోకమును వీడె, రాముని శోకమునకు
అతిగ శోకము గని శరదృతువు రాఁగ
మేఘ శేషేందు నిశవోలె మీఱె సీత. 629

పూర్ణ చంద్రాస్య సీత యప్పుడు కపీంద్రు
వాక్కు లాలించి ధర్మార్థ ఫణితిఁ బలికె
హనుమ ! ప్రియుఁ డనన్యమనస్కుఁ డనఁగ నమృత,
మార్తితో నుండె నన విషం బడరెఁ జుమ్ము. 630

శర మైశ్వర్యమునందు దారుణమహాకష్టాన త్రాటన్ బలెన్
పురుషున్ దైవము కట్టి లాగు, విధియో భూతాళిచే నెల్లెడన్
మరలింపం గలవాఁడు కాఁ డికను వేమారుల్ వ్యథల్ పొందనుం
దురు నన్నున్ బ్రియు రాము లక్ష్మణుని నిందున్ జూడుమీ మారుతీ.
631

పడవయు మున్గిపోవఁగని వార్ధిని నీది వగర్చువాఁ డటుల్
కడు పెను దుఃఖ వారిధిని రాఘవుఁ డెప్పుడు దాటునో గదా
వడిఁ జెడు దైత్యులన్ దునిమి, పట్టియు రావణు నెప్డు చంపునో
తడవక లంకఁ గూలిచియు దర్శన మెప్పుడు, నాకు నిచ్చునో. 632

ఎంతటిలోన వత్సరము నియ్యది వేగమ నిండిపోవదో
యంతటిదాఁక నేమనుదు నంతటిలోననె వార్ధి దాటు మం
చెంతయుఁ జెప్పుమీ పదవ దియ్యది మాసమ, యింక రెన్నెలల్
చెంతనె యుండె నందనుక నీఖల రావణుఁ డిచ్చెఁ గాలమున్. 633

నను నారామున కిచ్చివేయు మనుచున్ దమ్ముండయౌ నా విభీ
షణుఁ డత్యంతము నమ్రతన్ దెలుపుచున్ సంప్రార్థనం జేసె, నై
నను పాపాత్ముఁడు రావణుం డది చెవిన్ దాల్పండు, రా
వణుఁడో కాలము రాఁగ యుద్ధముననే వాంఛించుఁగా మృత్యువున్.
634

అనల యటంచుఁ బిల్వఁబడు నట్టి విభీషణు పుత్రి తల్లి పం
చినఁ జనుదెంచి నాకిదియె చెప్పెను, తప్పక నాప్రియుండు న
న్నును గొను నంతరాత్మ యిదె నొక్కి వచించును నద్ది శుద్ధ, మిం
దును గుణముల్ తనర్చుఁ గడు దూత ! కపీశ్వర ! యాలకింపుమీ.
63

పరమోత్సాహము పౌరుషంబు గడు సత్త్వం బానృశంస్యంబు దు
ష్కరమౌ విక్రమమున్ ప్రభావము కృతజ్ఞత్వంబు శ్రీరాము నం
దరయన్ మీకు, నతండు తమ్ముని సహాయం బేమిలేకుండ నొ
క్కరుఁ డయ్యున్ బదునాల్గువేవు రసురగ్రామంబు చంపెం జుమీ. 636

ఎవఁడేన్ వాని నెదుర్కొనం గలుగునే యేకష్టముల్ గాని రా
ఘవుఁ గంపింపఁగ జేయలేవు- శచి నాకాధీశునిం బోలె రా
ఘవు మాహాత్మ్యము నేనెఱుంగుదు శర గ్రామాంశులన్ రాముడన్
రవి యెండింపఁగ జేయు దైత్యులను నీళ్ళన్ శీఘ్రమే మారుతీ ! 637

వ. అని యిట్లు రాముని గానని శోకముచే గ్రుక్కియున్న జానకి పలుకగా నపుడు కన్నీళ్ళు విడచు సీతతో హనుమంతుఁ డిట్లనియె. ఓ యనింద్యురాలా! నీ పతి రాముఁడు నామాట వినీవినిన తోడనే వానర ఋక్ష గణసంకులమగు మహాసేనను దీసికొని శీఘ్రమె యిటకు వచ్చును. పోనీ యింత యెందుకు- ఓ వరాననా! యిప్పుడే నిన్ని దుఃఖమునుండి విడిపింతును. నా వీపుపై నెక్కుము. నిన్ను నిముషములో సముద్రమును దాటింతును. నిన్నే గాదుగదా రావణుతోపాటు ఈ లంకాపట్నమునుగూడ మోయు శక్తి గలదు. శక్రునికి హవ్యమును అగ్ని అర్పించు నటు మైథిలి! ప్రసవణగిరియందున్న రామునికి నిన్నప్పగింతును. వైదేహీ! దైత్యవధయందు ప్రయత్నపడు చూపు విష్ణునివలె నాకపృష్ఠమందుఁ గూర్చున్న యింద్రునివలె నీదర్శనముకై యుత్సహించి యాశ్రమమందున్న రాముని లక్ష్మణుని ఇప్పుడే చూడఁగలవు. దేవీ! నావీపు నెక్కుము సంకోచింపకుము. శశాంకునితో రోహిణివలె రామునితో యోగము పొందగోరుము. చంద్రునితో మహార్చిగల సూర్యునితోను కబుర్లు చెప్పుకొనుచున్న దానవు వలె నా వీపెక్కి ఆకాశ సముద్రములను దాటుము. నే నిటనుండి వెళ్ళుచున్నప్పుడు లంకావాసు లెవ్వరును అనుసరింపలేరు. ఎట్లు నేనిక్కడకు వచ్చితినో యట్లే ఆకాశమునందెగిరి నిన్ను నెత్తుకొని వెళ్ళెదను చూడుము. అని హనుమంతుఁ డనఁగా ఆ యద్భుత వాక్యములు విని హర్ష విస్మయములతో శరీరమంతయు నిండిపోవగా హనుమంతునితో నిట్లనెను. 638

హనుమా యింతటి దూర మెత్తుకొని మోయంగల్గుదే నన్ను నీ
వును నీలాగని నీదు కోతిగుణముల్ బోనిచ్చు కొన్నావు కా
విన వంశోద్భవుఁడైన భర్త దరి నన్నెట్లీవు గైకొంచు పో
వను శక్తుండవు స్వల్పదేహుఁడవు నాభారం బెటుల్ మోయుదో. 639

మానిని సీత వాక్కు హనుమంతుఁడు కన్నన నాలకించి య
ద్దాని నవమానముగఁదాఁ దలపోయుచు నీలనేత్ర నా
దైన ప్రభావ సత్త్వముల నారయ నేరదు గాన నిప్పుడే
నానిజ రూప మెల్లను గనంబడఁ జేసెద నంచు నెంచుచున్. 640

తరువందుండియుఁ గ్రిందికిన్ దుమికి సీతాదేవికిన్ నమ్మికన్
వఱలం జేయఁగ మేనుపెంచుచు సుదీప్తాగ్ని ప్రభన్ మేరు మం
దర తుల్యుం డయి తామ్రవక్త్రుఁడయి పల్దంష్ట్రానఖాలన్భయం
కరుఁడై జానకి స్వీయరూపము గనంగా నిల్చియున్ వాకొనెన్. 641

వనముల్ పర్వతముల్ మహాభవనముల్ ప్రాకారముల్ సౌధతో
రణముల్ గల్గిన లంకతోడఁ ద్రుటిలో రక్షఃపతిం గూడఁ గై
కొని పోవంగలశక్తియున్ గలదు నాకున్ జానకీ! చూడు రా
ముని సౌమిత్రి నశోకుఁ జేయు నిలుమీ పోనాడి సంకోచమున్. 642

అప్పు డాభీమరూపుని హనుమఁ జూచి
నళిన దళ విశాలాక్షి జానకి వచించె
ఓమహాకపీ! నీసత్త్వ మురుబలంబు
ననిలు ననలు శక్తి గతు లట్లద్భుతములు. 643

ఇటుల సామాన్యుఁ డెవఁ డిపు డీయమేయు
సాగరము దాటి యిచటకు రాఁగలండు
నీవిటకు వచ్చుటకు నన్నుం దీసికొనుచు
నరుగుటకుఁ గల నీశక్తి నెఱుఁగు దేను. 644

కాని యీమహాత్ముని కగు కార్యసిద్ధి
తప్పక తెలియఁదగు నయుక్తంబు నేను
ననఘ! నీతోడ వచ్చుట; అనిల జవము
మించు నీవడి నను మూర్ఛ ముంచ వచ్చు. 645

జలధి పైపై ని మింటిపైఁ జనెడి నేను
త్వజ్జవమున కులికి వార్ధిఁ బడఁగ వచ్చు
నీదు వీపునుండి తిమి నక్రాదు లున్న
జలధిఁబడి జలజంతు భక్ష్య మ్మయవుదు. 646

అరిదమన! నేను నీతోడ నరుగుదేని
నిన్ను రక్షించుకొనుచు నన్ను రక్ష
చేయుటది కష్ట మిటు రక్షచేయునపుడు
నీవుగూడ సంశయములో నింకను బడెదు. 347

నన్ను దీసికొనుచుం బోవు నిన్నుం జూచి
భీమ విక్రములౌ దైత్యబృంద మింక
దుష్టుండగు రావణునిచేతం దొరగ నాజ్ఞ
యీయంగంబడి యనుసరించి యేగుదెంత్రు. 348

శూల ముద్గరములు దాల్చి శూరు లైన
రాక్షసులు చుట్టుముట్టంగ రయమ నీవు
రక్షణము పొందం దగు నీకు రక్షలేక
నావలన ప్రాణసంశయ మావహించు. 349

ఆయుధములతో రాక్షసు లాకసమున
నిన్నుం బట్టి నిరాయుధు నేర్మిం బట్టు
నన్ను గూడ రక్షింప లేకున్న నీవు
వెట్లు రాముని దరి కప్పుడేగం గలవు. 350

క్రూరు లైన రాక్షసులతో ఘోరరణము
నీవు చేయుచు నుండంగ నిలువ లేక
భయపడియొ నీపృష్ఠము పైని నుండి
వార్ధిం బడిపోవుదు నంత వానరాగ్ర్య! 351

భీమబలు లైన రాక్షసుల్ పెక్కుమంది
యెట్టులైన నాజి నిను జయింపంగలరు
పోని పోరుచు సంగరోన్ముఖుండ వగుచు
నీవు నుండం బడిననన్ హరింత్రు వారు. 352

వసు హరించుటో నానాశనంబొ యగును
ఆజిని జయాపజయములు నస్థిరములె
అసురులును భయపెట్ట నేనయినఁ బడుదు
వపుడు నీప్రయత్నము లెల్ల వ్యర్థమగును. 653

ఒక్కవేళ నీవసురుల నుక్కడింపఁ
గలవె యనుకొండ మప్పుడు కపివరేణ్య!
నీవలన రాక్షసులు కూలి పోవనింక
మేటి రామునికీర్తికిలోటు కలుగు. 654

పోని నన్నుఁ దీసికొనుచుఁ బోయి దైత్యు
లెచ్చటనొ గూఢముగఁ దాచు నెడలఁ గపులు
రామలక్ష్మణుల్ నీవార్త లేమి గనరొ
యపుడు నాకై యొనర్చిన దగును వృధయె. 655

అరయ నీతోడనె మహాత్ముఁడైన రాము
డేగుదెంచుటలోఁ గల దెంతొ మంచి
రామునికి భ్రాతలకు నీరాజకులము
నకును నాయందె తమదు ప్రాణంబు నిలుచు. 656

వారు నాకయి నాశను వదలుకొనుచు
శోక సంతాపమునఁ గడు స్రుక్కి పోయి
అఖిల కపి ఋక్షతతులతో నపుడు వారు
తమదు ప్రాణంబులును వీడెదరు గదయ్య. 657

భర్తపయిని నత్యంతము భక్తి యుంట
రామునకంటె నన్యనరు గాత్రమును తాక
బల్మి రావణు గాత్ర సంస్పర్శ కలిగె
స్మృతి చెడ ననాథనే మొనరింపఁగలను. 658

రాముఁడే గనుక పరివారంబుతోడ
రావణుని జంపి యిటనుండి రయము నన్నుఁ
దీసికొనిపోయినయెడలఁ దెలియు మిదియె
రాముని కి తగిన పనియై రాణకెక్కు. 659

అనఘుండై బహు విక్రమంబమర నిత్యంబున్ విజృంభించు రా
ముని శౌర్యంబును వింటిఁ జూచితిని దేవుల్ దైత్య గంధర్వు లే
రును నీ ధాత్రిని సంగరంబున నెదుర్కొలేర యింద్రాభు నా
తని విల్గానిని లక్ష్మణున్ బవనుచేతన్ మండు నగ్నింబలెన్. 660

మద దిగ్వారణ మట్లు మీఱి శరసంపాతోగ్రుఁడై యా యుగాం
త దివానాథుని బోలి నేత్రములఁ గానన్ శక్యమే కాని యా
విదితాత్మున్ సహియించు వేడు, హనుమా వీరాగ్ర్య! మావారి నీ
యదనన్ వేగమ చేర్చి యార్త నగు నాకాహ్లాదముం గూర్చుమీ 661

అని వైదేహి వచింప వాక్య నిపుణుండౌ వానర వ్యాఘ్రుఁడా
త్మను హర్షించి వచించె దేవి! శుభచిత్తా! స్త్రీ స్వభావాన కె
చ్చిన సాధ్వీవినయానకున్ దగిన వాసిన్ జెప్పి, తీ నాదు వీ
పున స్త్రీవై శతయోజనా లుదధిపైఁ బో శక్యమే గాదవున్. 662

క్షమలో రాముని కంటె నన్యపురుష స్పర్శంబు గావింప న
ర్హము గాదంటివి నీవు చెప్పిన ద్వితీయంబైన యీ హేతు వెం
త మహోదాత్తమొ యా మహాత్మ సతి కత్యంతమున్ దగ్గ ద
ర్హమయౌ నిట్టి వచస్సు నిన్ విడిచి వేరైనన్ వచింత్రే భువిన్, 663

ఎది గావించితి వేది పల్కితివొ నీ యీ మాటలన్ సర్వమున్
మొదలం బెట్టియు నంతమొందు వఱకున్ బూర్ణంబుగా రాముక
ట్టెదుటన్ జెప్పెద, నెన్నొ హేతువులచే నీ రాము ప్రీతిన్ బొన
ర్పఁదగున్, స్నేహమునన్ బ్రసన్నమగు భావం బొప్ప నిట్లాడితిన్. 664

చాలగా రానిది లంక, సంద్ర మిది యెచ్చోనైన లంఘింపఁగాఁ
దరమే! నాదు సమర్థతం గని సమస్తం బిద్ది వాక్రుచ్చితిన్
త్వరగా నీప్రియ రాముతో నిపుడె చేర్పన్ గోరుదుం గాన నీ
గురుమైత్రిన్ వరభక్తిఁజెప్పి తిటు, కన్గొ మ్మన్యమే కా దిలన్. 665

అటు నాతో నరుదేఱ నిష్టపడకున్నట్లైన నేదేని నా
క్కటి యూ రాముని కానవాలిడినచోఁ గ్గొంచు నా రాముఁడున్
త్రుటి దానిన్ గురుతించు నంచు హనుమంతుఁడున్ వచింపంగ న
చ్చట నాదేవసుతాభ సీత యనె బాష్పార్ద్రింపు వాక్యంబులన్. 666

ఇదె శ్రేష్ఠం బగు నానవా లనుచు నాయిష్టప్రియుంగూర్చి చె
ప్పఁదగుం జుమ్మిటు చిత్రకూట శిఖరి ప్రస్థాన నీశాన్యపుం
బదమందున్ ముని పాశ్రమాంతికమునన్ మందాకినీ తీరమం
దుదకంబుల్ ఫలమూలముల్ గల యరణ్యోపాంత దేశంబునన్. 667

పలు పుష్పాల సువాసనల్ చిలుకు నాప్రాంతంబులన్ రమ్య భూ
ముల హాయిన్ విహరించి చెమ్మట జలంబుల్ గ్రమ్మ నీ యంకమం
దలఁతన్ మెల్లనఁ గూరుచుండ నట మాంసాసక్తిచే కాకి యొ
వ్వల నేతెంచియు ముక్కుతోఁ బొడవఁగా వారించితిన్ బెడ్డతో. 668

అప్పు డాకాకియు నిట్టటుల్ చనుచునే యుండెందొ దాగుండి మాం
సపుఁగోర్కెన్ విడకున్న వేచి యటు హెచ్చౌ నల్క నామేఖలన్
అపుడే యూడఁగ దీసి పై విసర నున్నట్లుండి నా చీర జా
ఱి పడం జూచుచు నీవు నవ్వితివిఁకన్ వ్రీడన్ గడుం జెందితిన్. 669

హృది మాంసంబు తినం దలంచుచునె యెంతేఁ గాకిపై కిన్ బదే
పదె యేతెంచుచు గీఱ నిన్ దరిసి నేత్రాంతిల్లి క్రాంతిల్లి నె
మ్మదిఁ గూర్చుండిన నీయొడిన్ జొఱఁగ నమ్మె మండు నన్ జూచి ప
మ్మదమున్ బొందుచు నన్ను సాంత్వ వచనంబుల్ పల్కి యోదార్చితే
670

దుడుకౌ కాకియుఁ గోప పెట్టఁగఁ గడున్ దోగాడు కన్నీట మో
మడరన్ మెల్లఁగఁ గండ్లు తుడ్చుకొని నాథా ! నేను నీచేఁ గనం
బడితిన్, జుమ్మని సోలి రాము నొడిలోఁ బన్నుంటి నాతండు నా
యొడిలోఁ బండెఁ గ్రమంబుతోడ నిటులెంతో సేపు మేముండఁగన్. 671

నిదురం జెందియు రాము నంకముననుండిన్ లేచియున్నట్టి నా
యెదుటన్ జట్టునఁ గాకి వచ్చి స్తనమధ్యే భాగమందున్ బదే
పదె వ్రాలం గను మాటిమాటి కెగిరెన్ బల్ముక్కుచే గీఱె నా
యదనన్ రక్తపు బిందులన్ దడిసెఁ జుమ్మా రాము గాత్రం బటన్. 672

చనకే బల్మిని గాకి బాధయిడ- స్వేచ్ఛన్ హాయి నిద్రించు రా
ముని లేపన్ బృథు బాహు లేచి సతి తొమ్మున్ గాయమున్ జెందుటన్
గని పాముట్టులు బుస్సకొట్టి యనె నల్కన్ నాగనాసోరు ! నీ
స్తనమధ్యం బెవఁ డిట్లు చీల్చి యిటఁ బంచాస్యాహితో నాడెడిన్. 673

వేడి నెత్తుటఁ దడిసిన వాడి గోళ్ళ
నెదురుగా వచ్చు కాకి నీక్షించె పైకి;
అదియొ శక్రుని సుతుఁ డౌ జయింతుఁ డంద్రు
అవనికిన్ వచ్చె గతిలోన ననిలసముఁడు. 674

అప్పు డామహాబాహువు, నలుకఁ దిరుగు
కనులఁ గను నాసుమతి- మండు మనసుతోడ
దర్భచాపనుండియు నొక్క దర్భ తీసి
దాని బ్రహ్మాస్త్రమునఁ గూర్చి పైని వేసె. 675

అప్పు డాదర్భ కాలాగ్ని యట్లు వెలిఁగి
వేగ నాచెడుకాకిని వెంట నంట
నదియు నానాగతులతోడ నాకసమున
తిరిగి యన్ని లోకాలకు నరిగెనంత. 676

తండ్రిగాని ఋషులు దేవతలును గాని
శరణిడ మిత్రలోకంబులు తిరిగి మరల
రాము శరణొందెఁ శరణొంద భూమిఁ బడిన
వధ్యు వధియింపక యెదుటన్ వానిఁ బ్రోచె. 677

అటుల నావిషణ్ణుని గాచి యనియె రాముఁ
డిట్టి బ్రహ్మాస్త్రము వృధగ నేగదిపుడు
కనుక దేనిఁ గొట్టుదుఁ జెప్పు మనఁగఁ జూచి
"కొట్టు కుడికంటి" నని చెప్పెఁ గూళ కాకి. 678

అపుడు రాముఁడు కుడికంటి నరసికొట్టె
నంత కుడి కంటి నిడికాకి ప్రాణరక్ష
పొంది రాముని దశరథు మ్రొక్కి మిగుల
వీరు రాము వీడ్కొని తనవేశ్మ కరిగె. 679

నా నిమిత్త మీవటు కాకిపైని వేసి
నావు బ్రహ్మాస్త్ర; మేలకు వను హరించి
నట్టి వానిపై క్షమ చూపినావు నాథ
వతిని నే సనాథగ జేతి నరయు దయను. 680

ఆ నృశంస్యము వరధర్మ మనుచు నీవె
చెప్ప వింటిని మఱినీవు గొప్ప వీరు
డవు మహోత్సాహుఁడవని బలాధికుఁడ వని
యెఱుఁగుదు వపారశక్తివి ధృతియుతుడవు. 681

వార్ధి గాంభీర్యమున క్షోభపడని వాఁడు
వార్ధితుది దాఁక గల భూమి భర్త యిందర్కి
సముఁడు నస్త్ర విద్వరుఁడును సత్యవంతుఁ
డతి బలుఁడు, రాక్షసుల వేయఁడస్త్రమేల 682

నాగు లసుర మరుతులు గంధర్వు లేని
సమరమున రాము వేగము సైపలేరు
వీరుఁ డతనికి నాయందె ప్రేమ యున్న
ఘనశరంబుల దైత్యుల వణఁచఁ డేల. 663

శత్రు దమనుఁడు ఘనబలశాలి యైన
యనఘు లక్ష్మణుడే నన్న యాజ్ఞచేత
ఏ నిమిత్తాన నన్ను రక్షించు కొఱకు
రాక యున్నాడు చెప్పుమీ ప్రథిత వీర! 664

అగ్ని వాయుసములు పురుషాగ్రసరులు
పూన సురలే నెదుర్కొన రానివారె
ఏల నన్నుపేక్షింత్రు నే నేదొ చెడుగు
చేసి యుందు శక్తులయి రక్షింపకుంట. 665

జాలిగా నిట్లు కన్నీరు జాఱ సీత
పలుక విని చెప్పెఁ దేజస్వి పవన సుతుఁడు
దేవి! రాముఁడు నీవ్యథార్తిని నివెల్ల
వీడి నిన్నెంచు సత్యము తోడె సుమ్ము. 666

రాము దుఃఖము కని యేడ్చు లక్ష్మణుండు,
ఇంక నీ మూర్తమున దుఃఖమేగఁ గనెదు
పూరుష వ్యాఘ్రములు క్షితీశ పుత్రులిద్ద
ఱింక నినుగాంచి మదిఁ బొంగిలంకఁగాల్తురి. 667

వ. ఓ! దేవీ! యదృష్టవశమున నిన్నిట్లు కనుగొంటిని. శోకించుట 668
కిది సమయముకాదు వినుము.

పోరిలో సబాంధవముగఁ గ్రూరు రావ
ణాసురుని జంపి నినుగొని యరుగుఁ బురికి
రయముగ విపులాక్షి! రామ లక్ష్మణులకు
తెలుపు సుగ్రీవ కపుల కేదేని వార్త. 689

అని హనుమంతుఁడు పల్కగ
విని సురసుత వంటి సీత వెతతో ననియెన్
విను కౌసల్యయు నే భువ
న నాథుఁ గనె నతని మ్రొక్కు నాకయి తలతో. 690

విరుల దండలు సర్వ వివిధ రత్నంబులు
ప్రియులౌ వరస్త్రీల విడిచిపైచి
సువిశాల వసుమతిన్ శోభిల్లు దుర్లభై
శ్వర్యమున్ కాలితో వడిగఁ దన్ని
తల్లిని తండ్రిని తగురీతి మన్నించి
వారి ప్రాసాదంబు వడసి మిగుల
అన్నపై భక్తిచే ననుప మంబైనట్టి
సౌఖ్యంబు భోగంబు సరగ వీడి

ఆ సుమిత్రా సుపుత్రుఁడు నన్ను వెంట
వెడలి వనిని నన్ను నొగి సేవించుచుండె
ఘన భుజుఁడు మనస్వి రామునిఁ బిత వలె
నన్నుఁ దల్లివోలెను జూచి యెన్ని కొలుచు. 691

వ. మఱియు రావణుం డిట్లు నన్నెత్తికొనిపోయి నట్లు ఆ వీరుఁడైన లక్ష్మణుం డెఱుంగఁడు. ఎటిగె నేని ఊరకొనునా! అతఁడు పెద్దలను సేవించు వాఁడు, లక్ష్మీ వంతుఁడు, మిత భాషి, సమర్థుఁడు. ఆ రాజపుత్రుఁడు ప్రియు

డగుటయేగాక శ్రేష్ఠుఁడుగూడ. అతఁడు నామామకు సాటియైన వాఁడు. పైఁగా అతఁ డంటె నాకు చాల ప్రియుఁడు. రాముని భ్రాత యగు నా లక్ష్మణుఁడు ఏ భార మప్పగించినను దానిని సులువుగా వీర్యవంతుఁడై వహించువాఁడు. అన్న యగురాముని జూచి రాఘవుం డగు లక్ష్మణుఁడు తండ్రి పైన తలఁచు కోడు. మృదువు, నిత్యము శుచియైనవాఁడు, దక్షుఁడు, ముఖ్యముగా ఆ లక్ష్మణుఁడు రామునికిఁ బ్రియుఁడు. నీవు నాకు బదులుగా నామాటనుబట్టి కుశలము అడుగఁదగు. ఈ కార్యభారమందు ఎట్లు దుఃఖక్షయము కలుగునో అట్లు చేయ దగు. వానర శ్రేష్ఠా! ఇందు నీవే ప్రమాణము. నీవు ఒసంగిన యుత్సాహము బట్టి రాముడు చేయును ఇదిముఖ్యముగా నా నాథునితోఁ జెప్పుము. నేనొక మాసమువఱకు ప్రాణముల నిల్పియుంచు కొనెదను. ఆపైని జీవింపను. సత్యముతో శపథము చేసి చెప్పుచున్నాను. పాపాత్ముఁ డగు రావణునిచే మోసగించి నిరోధింపఁబడిన నన్ను నీవు పాతాళమునుండి కౌశికిని బలె రక్షింపఁ గలవు" అని సీత పలికి తన బట్ట కొంగున ముడిచియున్న దివ్యమైన చూడామణి నొకదాని నిచ్చి "దీనిని రామునికిమ్ము" అని హనుమంతున కిచ్చెను. అంత నాహనుమంతుఁడు ఆ వెలలేని మణిరత్నమును గైకొని అపుడు సూక్ష్మరూపమున నున్నవాఁడు గాన ఆ మణికి ఆధారముగా కేశసరళియందు వ్రేలు దూర్చి తొడుగుకొనెను. అప్పు డతని భుజము స్థూలముగా లేదు. అతని భుజము దానిని గ్రహింప శక్తి గలది కాలేదు. కావున అభివాదనము చేసి ప్రక్కగా నిలుచుండెను. అంత సీతను జూచుట వలనఁ గలిగినఎంతో సంతోషముతో శరీరమున అక్కడ నిలిచియున్నను రాముని హృదయములో తలపోసెను. సీత ప్రభావమువలన గొప్ప మణిని గ్రహించి ధరించి యతఁడు పెను తుఫానుచేఁ గదల్చబడిన గిరివలె నుండి సుఖించిన మనస్సుతోఁ దిరుగ రాముని దరికిఁ బ్రయాణ మయ్యెను. 662

మణి నొసఁగి సీత యనె హనుమంతుతోడ
సరిగ నానవా లిది రాముఁ డెఱుఁగు జుమ్మి
మణి నరసి రాముఁడు ముగుర స్మరణ చేయు
నన్ను నాతల్లి దశరథ మనుజపతిని. 693

అట్టి నీవింక నుత్సాహ మలరఁ జూపి
ఈమహాకార్యమునఁ జేయు మెంచి పయిని
నీవె యీమహాకార్యాన నెల్ల మాకుఁ
దగు ప్రమాణము పూని మాతాప ముడుపు. 694

ఈవె తలఁచి చేయఁగ దుఃఖ మెల్ల నణఁగు
ననుచు సీత చెప్ప హనుమ యట్లె యనుచు
భీమ విక్రముఁ డయి సీత కామహాత్ముఁ
డగు హనుమ మ్రొక్కి బైల్దేఱ నాత్మఁ దలఁచె. 695

బయలు దేఱిన హనుమఁ తు వానరాగ్ర్యు
నరసి బాష్పగద్గద వాక్కుతో ననియె సీత
హనుమ ! కుశలంబు రాము లక్ష్మణుని నడుగు
కీశ సుగ్రీవ వృద్ధుల క్షేమ మడుగు. 696

ఎటు మహాబాహు వగురాముఁ డీవ్యథాబ్ధి
నుండి నన్ను దాటించు నట్లొగిఁ బొనర్చ
యశము గల రాముఁడును నన్ను ప్రాణసహిత
నగుచు నుండ సంభావించు నట్లు చేయు. 697

నీవు చెప్పిన యుత్సాహ నిపుణ వాక్కు
లాలకించి నన్ గొన మించు రాము శక్తి
ఏను చెప్పిన సందేశ మెల్ల వినియె
వీరుఁడు పరాక్రమమును నెఱవేర్పఁ గలఁడు. 698

జనకజ యనిన వాక్కుల శ్రద్ధతోడ
విని శిరస్సున నంజలి యునిచి హనుమ
యనియెఁ గపి ఋక్ష వరులతో నతిగ త్వరగ
వచ్చి యనిఁ జంపి యరుల, నీవ్యథను బాపు. 699

నరుల సురల నసురుల నెవ్వరును రాముఁ
డేయు బాణవేగము నెదురింపలేరు
నీకొఱకు సూర్యు నింద్రుని భీము యముని
నేని రాముఁ డాజిని నెదురింపఁ గలుగు. 700

అబ్ధి పర్యంత వసుమతి నాతఁ డేలు
జనకజా ! నీనిమిత్తమై జయము కలుగు
అనెడి హనుమంతు సూక్తిని నాలకించి
సీత యది గౌరవించి వచింపఁ బూని. 701

అపుడు బైల్దేరు హనుమంతు నరసి యరసి
భర్త స్నేహాన సౌహార్ద ఫణితిఁ బలికె
వీర ! యిట నుండఁ దలఁతేని విశ్రమింపు
మొక్క దిన మొంటి, రేయి యిందుండి పొమ్ము. 702

అల్ప భాగ్యనౌ నాకు నీయంతికమున
ఈమహా శోకము త్రుటి శాంతించెఁ జుమ్ము
తిరుగ వచ్చుటకై నీవె యరుగ హనుమ !
నాకు ప్రాణసంశయ మగుం దప్పకుండ. 703

నిను గనమి నాకు శోకమున్ బెరిగి కాల్చు
మొదటి వ్యధకంటె నీవ్యధ యొదవి పెరుగు
నీకు సాయమౌ కపిఋక్ష నియతిఁ గూర్చి
నాయెదుటనె యీసందేహమే యొసంగు. 704

ఆప్లవగ ఋక్ష యోధు లాయనుజు లింక;
దాటరాని యీజలధిని దాటఁ గలరె
భూతములలోన నీవు వాత మింక
గరుడి యీముగ్గురే వార్ధిఁ గడువఁ గలరు. 705

కనుక నిట్టి దుష్కరమైన కార్యమందు
నేమి చేతొ చెప్పుము జాణవీవె యిందు
అరిదమన ! నీవ చాలుదు వన్ని పనుల
నీఫలోదయముఁ గీర్తి నీకె దక్కు. 706

సర్వబలముతో రావణుఁ జంపి నన్ను
తీసికొని రాముఁ డేగుచో దీన నాకు
యశము గలుగు; బాణములతో నణఁచి లంక
నన్నుఁ గొనిపోవ సదృశమౌ నాదు పతికి. 707

ఆహవమ్మున శూరుఁడౌ నామహాత్ము
విక్రమంబున కనురూప విధిని నీవు
సలుపఁ దగు నని సనిమిత్త సార్థకమగు
సీత వాక్కు విని హనుమ చెప్పె నిటుల. 708

"దేవి ! కపి ఋక్ష సేన కధీశ్వరుండు
వానరపతి సుగ్రీవుఁడు నీనిమిత్త
మయి బలయుతుఁడై స్థిరబుద్ధి నసుర గణము
కూల్పఁ వచ్చుఁ గపిసహస్ర కోట్లతోడ. 709

విక్రమము సత్వమును మహావేగ మున్న
కపులు బలులు సుగ్రీవు నాజ్ఞను పొనర్ప
నందె సిద్ధమై యున్నారు క్రిందఁ బయిని
నడ్డమున నేగ నవ్వారి కడ్డె లేదు. 710

అమిత తేజులౌ వారు కర్మములు చేయ
నలసి పోరు, మహోత్సాహు లౌచు వారు
సాగరము దాఁటఁ గల భువిన్ జాల సార్లు
అనిల మార్గమునన్ ప్రదక్షిణమ చనిరి. 711

నాకంటె గొప్పవారును
నాకీడౌ వారు నగు వనౌకసు లున్నా
రాకడ, సుగ్రీవు దరిని
నాకంటె నికృష్టుఁడో కనంబడఁ డెపుడున్. 712

నేనో యిటు వచ్చితి నా
వానర వీరుల గుఱించి వాకొనఁ గలనే
హీనులు గానట్టిజనం
బేనాఁడును పంపఁబడర యితరులె గానీ. 713

కనుకన్ వగయింకఁ జాలును
వనట మనసునుండి తీసి వైవుము దేవీ!
క్షణకాలములో లంకకుఁ
జను దెంతురు గంతువైచి సర్వకపీంద్రుల్. 714

ఇక వీరుల్ మన రామలక్ష్మణులు తామే తెంచి యీలంకకున్
వికటాస్త్రంబుల నాక్రమించి ధృతితో వేగంబ యారావణున్
సకలామాత్య సబంధు మిత్రగణునిన్ నాశంబు గావించి జా
నకి! నిన్నున్ గొని యాయయోధ్యపురికిన్ వైళంబ కొంపోదురే. 715

కనుకన్ శాంతి వహింపు భద్ర మగుతన్ కాలంబు వీక్షింపు వ
హ్నినిబోలెన్ జ్వలియించు రాము త్వరలో నీక్షింతు సామాత్యబం
ధుని నారావణుఁ జంపి రాఘవునితోఁ దోతెంతు వీవట్టిరో
హిణి శీతాంశునితో బలెన్ త్వరగ దేవీ! దాటె దార్త్యంబుధిన్. 716

అని వైదేహిని నూరడించియుఁ గరం బావాయు సూనుండు ని
ట్లని పల్కెన్ మఱి, శత్రుహంతకుని ధీరాత్మున్ ప్రియున్ రాము, ల
క్ష్మణు విల్కానిని. వ్యాఘ్ర సింహబల విక్రాంతాత్ములన్ తీవ్రదం
త నఖాస్త్రోగ్రుల వానరేంద్రుల నికన్ దర్శింతు వీలంకలో. 717

గిరిమేఘంబులబోని వానర వరుల్ క్రేళ్ళుబ్బి లంఘించి య
త్తఱి లంకా మలయాద్రి సానుల మహాధ్వానంబులం జేయఁ గ్ర
చ్ఛుఱ నాలింతువులే! కఠోర మదనాస్త్రి లవ్విమర్మంబులన్
కరమున్ వేదన పెట్టు సింహధృత నాగం బయ్యె రాముండికన్. 718

వ్యథ పొంద కింక దేవీ!
హృదిఁ గల్గిక పోవుఁగాక యేవ్యథ నీకున్
ముదమున శచితో నింద్రుఁ ప
గిది, నాథవతి ఐవుదు విఁక క్షితినాథునిచే. 719

రామునికంటె విశిష్టుఁడు
సౌమిత్రి సనుండు గాని క్షమలేరు సుమీ
రాముండు లక్ష్మణుఁ డనలమ
హామారుతసములు నీకు నాశ్రయ భూతుల్. 720

చిర మీరాక్షస దారుణ
ధరణిని నుండ విఁక సీత ! త్వత్రియు రాకన్
అరయుదువు లెమ్ము నేఁ గ్ర
చ్ఛుఱఁ జని చెప్పెడి సమయమె సైపుమి యింకన్. 721

వ. మహాత్ముఁ డైన యామారుతి మాటలు విని దేవ కుమారివంటి సీత యాత్మహిత మైన వాక్యము నిట్లనియె. ఓవానర! ప్రియుమాడు నిన్నుఁ జూచి ఎండు సస్యమున్న భువి వర్షమును పొందివలె సంతోషించుచున్నాను. శోక మునఁ గృశించి యున్న నాయవయవములతో సకామనై నేనెట్టు లాపురుష వ్యాఘ్రుని దర్శింతునో యట్లు చేయుము. వానరవరా ! నేనిచ్చిన యాన వాలును, విసరి కాకియేకనేత్రమును బోఁగొట్టిన యాదర్భపోచను గూర్చిన సంగతిని చెప్పుము మఱియు అతనితో నిట్లనుము. ఒక మారు నామోముపై తిలకము చెరిగి పోఁగా మణిశిలతో నాగండ పార్శ్వమున నీవు దిదిన తిలక

మును గుర్తు తెచ్చుకొనుము. నీవు మహేంద్ర వరుణోపముండవై యుండి కూడ రాక్షసుల మధ్య, దొంగిలింపఁ బడి యున్న నన్ను నుపేక్షింతు వేల. ఇదిగో ఈచూడామణిని బాగుగా దాచి యుంచితిని. దీనిని చూచుచు నిన్నుఁ జూచినట్లు చూచి సంతోషించు చుంటిని. ఇదిగో ఈశ్రీకర మైన మణి నీకుఁ బంపితిని. ఇంక నేను శోకార్తి జీవింపఁ జాలను. ఘోరాకార లైన యీ రాక్షస స్త్రీల సైపరాని హృదయము ఛేదించు దుఃఖవాక్యములు నీకొఱకై సైచు చున్నాను. శత్రుసూదన! ఇంక నొక నెలమాత్రమే జీవితము ధరించి యుందును. ఇంక మాసము దాటిన పిదప నీవు లేకుండ నేను జీవింపను. ఈ రాక్షసరాజు దారుణ మైన వాఁడు. నా యందలి యాతని దృష్టి సుఖకరమైనది కాదు. ఆలసించు చున్నచో నేను క్షణముకూడ జీవింపను అనెను.అప్పుడు. 722

జాలిగా నిట్లు కన్నీరు జాఱ సీత
పలుక విని చెప్పెఁ దేజస్వి పవనసుతుఁడు
దేవి! రాముఁడు నీవ్యథార్తిని నివెల్ల
వీడి నిన్నెంచు సత్యము తోడె సుమ్ము 723

రాము దుఃఖము కని యేడ్చు లక్ష్మణుండు
ఇంక నీమూర్ఛమున దుఃఖ మేగఁ గనెదు
పూరుష వ్యాఘ్రులు క్షితీశ పుత్రు లిద్ద
ఱింక నిను గాంచి మదిఁ బొంగి లంకఁగాల్తు. 724

వ. ఓదేవీ! యదృష్ట వశమున నిన్నెట్లో కనుగొంటిని శోకించుట కిది సమయము గాదు వినుము రాముడు. 725

పోరిలో సబాంధవముగఁ గ్రూరు రావ
ణాసురుని జంపి నినుగొని యరుగుఁ ఖురికి
రయముగా విపులాక్షి! రామలక్ష్మణులకు
ఇంక మరి యొక యానవా లిమ్ము మఱియు. 726

వ. అని హనుమంతుఁ డనఁగా "ఉత్తమమైన యానవా లిదివఱకే యిచ్చితినిగదా ఈశిరోభూషణము చూచి హనుమా! రాముఁడు శ్రద్ధతో నమ్మును. అని యనఁగా సరే యని దేవికి నమస్కరించి బయలుదేఱ నెంచి యుత్సాహముతో తనశరీరమును పెంచఁగా అట్లు పెరుగు దేహముగల హనుమంతుని జూచి గద్గదస్వరముతో సీత యిట్లనియె. హనుమా సింహము వంటి భ్రాతలు రామలక్ష్మణులను అమాత్యులతోఁ గూడిన సుగ్రీవుని సర్వవానరులను గూర్చి ఆరోగ్యమును ప్రశ్నించి ఈదుఃఖమునుండి దాటించు నట్లు రామునితో నచ్చఁ జెప్పుము. రాక్షసులు చేయు బెదరింపు వాక్యములను రాముని దగ్గఱకుఁ బోయి చెప్పుము కపివర! నీమార్గము శుభమగుఁగాక! అని సీతపలుకఁగా విని కృతార్థుఁడయి మనస్సున సంతోషించి ఇంకఁ జేయవలసినవని స్వల్పమే యవశేష మున్నదుటఁగని యుత్తర దిక్కుగాఁ బోవ మనస్సునఁ దలంచెను. 727

ఆమె యనిన ప్రశస్త వాక్యముల చేత
సర్చితుండయి హనుమంతు డచటి నుండి
వెడలి తలపోయ సాగె నీ విధముగాను
అల్ప కార్య మిక మిగిలె నతివఁ గంటి 728

సామ దాన భేదోపాయ సరణి విడచి
ఇక చతుర్ధ భేదోపాయ మిటనె దగును
అసురులందు సామోపాయ మదియుఁ దగదు
యిక సంపన్నులకు దానమేమి చేయు. 729

శక్తి దర్పితు లెడ భేద సరణి పడదు
ఇకను విక్రమించి యు దండ మొకటె వీలు
విక్రమము వీడ నీపని వీలు కాదు
దారికిని వత్తు రసురులు వారిఁ జంప 730

ఎవడు నిర్దిష్ట కర్మ గావించి మఱియు
పూర్ణ కార్యాలకు విరుద్ధములను గాని
ఇతర బహుకార్యములను సాధించు వాఁడె
సర్వ కార్యాలు గావింపఁ జాలి యుండు 731

ఎంత స్వల్ప కార్యము సాధించుటకును
ఒక యుపాయమె కార్య సాధకముగాదు
ఎవ్వఁడైతే నుపాయాల నెన్నొ తెలియు
వాడె యర్థ సాధనలోన ప్రముఖుడగును. 732

ఇటనె నిశ్చయ మొనరించి యెదిరి తనదు
యుద్ధ బల తారతమ్యము లొగి యెఱింగి
వానరపతి పురమునకు బయులు దేఱి
వెళ్ళ పతి యాజ్ఞ సరిగ గావించుటగును. 733

నాకు బల్మి దైత్యులతో రణంబు నెట్లు
సులభముగఁ గల్గునో కద చూడవలయు
అటులె యని రావణుఁడు నన్ను నాత్మబలము
సారయుత మని మన్నింపఁ జలుప వలయు. 734

ఆజిలో రావణు నెదిర్చి యతని బలము
వాని హృదిలోని భావము వానిమంత్రి
వర్గ సంగతి, యేవి యన్ని బాగుగాను
తెలిసికొని మఱిందుండి బైల్దేఱి పోదు. 735

ఇదిగొ నందనవనిఁ బోలు నీవనంబు
ఈనృశంసుని దెంతయో యింపు నింపు
కనులకున్ విందు గూర్చుచుఁ దనరుచుండె
వివిధ తరులతా యుతమౌచు వెలయు చుండె. 736

ఎండు నడవిన్ దావాగ్ని యట్లే వనంబు
ధ్వంస మొనరింతు దీన రావణుఁడు నల్గ
అంత ద్విప రథ హయ సేన నతఁడు పంప
నగు త్రిశూల గదాది మహాస్త్ర రణము. 737

చండ విక్రములగు దైత్యసమితితోడ
రణమున నసహ్య విక్రమ మొనరఁజేసి
రావణుని బలమెల్ల నగ్రముగఁ గూల్చి
హాయిగాఁ జొత్తు సుగ్రీవు నాలయంబు. 738

అని తలఁచి మారుతియుఁ గ్రోధమున మండి
తొడల వేగానఁ జెట్టులు పడఁగఁ గూల్చి
మత్త విహగ యుతంబు ద్రుమలత లొప్పు
నుపవనమును విఱుగ గొట్టి యుక్కు చూపె. 739

విఱుగఁ గొట్టిన చెట్లు భిన్నమౌ సరసుల
క్రిందఁ గూల్చిన కేళి గిరుల తోడ
వివిధ పక్షిరుతాల విడిన యెఱుపుఁ జివుళ్ళ
దావాగ్ని హతతుల్య తరుల తోడ
కూల్చిన పొదరిండ్లఁ గూలు చిత్ర గృహాలఁ
గూలిన వ్యాళ మృగాలతోడ
విఱుగు జాతి గృహాల విహ్వ లాశోక త
రులతా ప్రతానంపు స్థలులతోడఁ

దనరి నిహత శోక లతా ప్రతాన మగుచు
దైత్య ప్రమదావనంబు ప్రమదావనంబు *
సలుపు కపి విజృంభణమున గళిత శోభ
మయి విఱిగి కూలి పాడయి యరయ బడియె. 740

* ప్రమదావనము = ప్రమద సీతను, అవనము = రక్షించునది.

అట్టులామహాత్ముఁడగు దైత్యార్థ పతికి
మది వ్యళీకము పల్ వ్యథలు గూర్ప
ఒంటిగాఁ బెక్కు బలవంతు లొప్పఁ బోర
* శ్రీలవెల్గి తోరణమునఁ జేరె హనుమ. 741

పక్షుల కూతల చేతన్
వృక్షమ్ములు పడనగు పెళపెళ యను ధ్వనులన్
రాక్షసులు లంకఁగను గొని
యాక్షణమున సంభ్రమమున నందిరి భయమున్. 742

మృగముల్ పక్షులు భీతిచే నఱచె నెంతే దుర్నిమిత్తంబులం
దగపించెన్, నిశయేగ భీమ వికృతాస్యల్ రాక్షస స్త్రీలు పా
డగు రమ్యవనంబు చూడ వారి భయదంబౌ రూపముం జూచి యిం
క, గభీరాత్ముఁడు వాయుపుత్రుఁడు మహాకాయుంబుతో నంతటన్. 743

పెరుగం జొచ్చుచు రాక్షసాంగనలకున్ భీతి ప్రదుండయ్యె పెన్
గిరి బోల్ రూపముతోఁ గనంబడిన యా కీశాగ్ర్యు నీక్షించి య
త్తఱి నాకాంతలు సీత కిట్లనిరి యీతండెవ్వం డెవ్వాని కిం
కరుఁ డిందేటికి వచ్చె నేగతుల వక్కాణించె నీతోడుతన్ 744

అత డే సంగతి మాటలాడెనో విశాలాక్షీ! యికం జెప్పు, నీ
మతి భీతిల్లకు మిప్పుడో సుభగ! శ్యామాపాంగి! యంచాడగన్
సతి సర్వాంగ మనోజ్ఞ సీతయనె "రూక్షాకారులౌ దైత్యు" లే
గతిఁ దాముందురొ నాకెటుల్ తెలియు నీ జ్ఞానంబు నా కెట్లగున్ 745

ఎవడో వీడెది చేయునో యదియు మీకే జ్ఞాతమౌఁ గాదొకో
భువిఁ దానెట్లు చరించుఁ దత్పదము లేవో యవ్వి పామే యెఱుం
గ వలెన్ సంశయ మేమి లేద యితనిన్ గన్గొంచు భీతిల్లితిన్
ఎవఁడో యీతఁడు కామరూపి యెటు యిట్లెంచె దైత్యుండగున్ 746

వ. అని సీత చెప్పఁగా విని రాక్షస స్త్రీలు ఇటునటు పరువులెత్తిరి. కొందరిటనేయుండి మఱి కొందరీసంగతి రావణునికి నివేదింపనేగి భీకరుడైన హనుమంతుని గూర్చి రావణునితో నిట్లు చెప్పసాగిరి. 747

అధిప! మన యశోకవన మధ్యమున కిపుడు
భీమతను వున్న యొక కపి వేగ వచ్చి
జనకసుతతోడ మాటాడి శౌర్య మమిత
మొప్ప నుండె నెం తడిగినన్ జెప్ప దామె. 748

ఆతండు విబుధ నాథుని
దూతయొ యావైశ్రవణుని దూతయొ మరియా
సీతాన్వేషణకై యట
దూతను రాముండె పంప త్రుటి వచ్చెనొకో. 749

అతఁ డద్భుత రూపుం డయి
సతత మృగ విహగ యుత మయి చారుతరంబై
మతి కింపగు నీయువవన
మతి బలుఁ డయి పాడు చేసి యట విహరించెన్. 755

అతఁ డచట పాడు చేయని
క్షితి యేదియు లేదు సీత చెంతది తక్కన్
క్షితిసుత రక్షకొ శ్రమనో
అతనికి శ్రమ యెట్లు కోరి యమకొని చేసెన్ 751

మురువు చివురుల శింశుపా తరువు నైతె
సీత యాశ్రయించెను దానిఁ జెఋపఁ దతఁడు
ఎవఁడు సీతతో మాటాడె నెవఁడు పనికిఁ
జెడుగు చేసె వానికి క్రూరశిక్ష యిడుము. 752

బ్రదుకుపై నాస వదలిన వాఁడు తక్క
వేఁడు నీమదిఁ గొను సీత తోడఁ బలుక
ననెడి వారిమాట విని రావణుఁడు కోప
చాలి తాక్షుఁడై హుతవహ్ని వోలె మండె. 753

ప్రజ్వలించిన యతని నేత్రములనుండి
వేడి నీటి బిందువులు తోడ్తోడఁ బడియె
మండు చుండిన దీపాలనుండి మిగుల
జ్వాల గల నూనె చుక్కలు పడిన యట్లు. 754

తనకు నీడయి కింకరు లనెడి పేర
వెలయు నెనుబది వేవురు వేగవంతు
లయిన శూరుల హనుమంతు నంతు చూడ
నపుడ తేజస్వి రావణుం డంపె వేగ. 755

వారి కూటముద్గరములు పాణులందుఁ
దాల్చి ఘోరాకృతిని ఘోరదంష్ట్రి లొప్ప
ఘనబలులు మహోదరు లయి కదనమునకు
వెడలి రట హనుమంతుని వేగఁ బట్ట. 756

అట బహిర్ద్వారమం దున్న హనుమపైకి
అగ్ని నెదురించు మిడతలో యనఁగ వేగ
వెడలి కాంచన పట్టాలు వివిధ గదలు
పరిఘలు రవిసన్నిభ బాణపంక్తి దాల్చి. 757

ప్రాస ముద్గర తోమర పట్టసములు
శూల శక్తులు ధరియించి శూరు లగుచు
హనుమ యెదుటకు వచ్చియు నందె నిలిచి
వానిఁ జుట్టు ముట్టి యతనిపైని పడిరి. 758

అంత తేజస్వి శ్రీమంతుఁ డద్రిసముఁడు
నయిన హనుమంతుఁడును తోక నవనిఁ గొట్టి
గర్జనము చేసి క్రూరమౌ కాయు మెప్ప
బాహు చఱచ, లంకయెు మ్రోగెఁ బక్షులెగిరె. 759

వ. అట్లు లంకలోఁగల్లోలము పుట్టించి హనుమంతుడిట్లు ఘోషించెను.

జై జై రఘురామునికిన్
జై జై యాలక్ష్మణునకు శౌర్యాఢ్యునకున్
జై జై వానరబలతే
జోజవునకు రాము గుప్త సుగ్రీవునకున్. 760

క్లేశం బెవరికిఁ గూర్పని
కోసల భువియేలు రామ కువలయపతికిన్
దాసుఁడ హనుమంతుండను
నేశత్రుబలాంతకుఁడను నే వాయుజుఁడన్. 761

నే వేగరింబున రాళ్ళను
నీ వృక్షములను విసరి ప్రహరించుచు నుండన్
రావణులవంటి వారలు
వేవు రయిన వన్నిపు డెదురింపంగలరే. 762

లంకాపురి మర్దించితి
శంకయె లేకుండ నిచట జనకజఁ గంటిన్
కొంకక నే దైత్యులు గన
నింకఁ గృతార్థుండ నగుచు నేగెద నిపుడే. 763

హనుమంతుని గర్జనచే
దనుజ గణంబులును భీతి తప్తులె యవుచున్
హనుమంతుని నట సంధ్యా
ఘన మేఘముఁబోలె నపుడు కాంచిరి మిగులన్. 764

ప్రభు శాసనము
క భయము విడి రాక్షసులును కపివర్యునికిన్
అభిముఖముగఁ జని వడి వివి
ధ భయంకర శస్త్రములను దాలిచి పడఁగన్. 765

త్వరగా మారుతి యంతఁ గోటకు బహిర్ద్వారస్థమౌ లోహపుం
బరిఘన్ గైకొని రాక్షస వ్రజములన్ బాదన్ విజృంభించి క్రు
మ్మరుచున్ బెన్భుజగంబు దాల్చిన గరుత్మంతుండో నా మీఱియు
త్తరిఁ దైత్యావళిఁ జంపి యాజికి బహిర్ద్వారంబె చేఱెన్ మఱిన్. 766

అంతఁ జావఁగా మిగిలిన యసురు లేగి
కింకరులు చంపఁ బడినట్లు జంకుతోడ
రావణుని కెఱిగింప నేత్రములు త్రిప్పి
యాతఁడు ప్రహస్తజు నజేయు నాజి కనిపె. 767

హనుమ యటు కింకరులఁ జంపి ధ్యానముండి
తలఁచె నిటు వనిఁ గూర్చితి నింక నిపుడు
చైత్య ప్రాసాదమును గూల్పఁ జను నటంచు
మేరు శృంగాభ చైత్యమున్ మీరి యెక్కి. 768

శైలమునుబోలు చైత్య ప్రాసాద మెక్కి
దానిఁ బడఁ గొట్టి పారియాత్రాద్రిఁ బోలి
లక్ష్మితో ప్రజ్వలించుచు భూరి గాత్రంబుతోడ
లంక మార్మోఁగ బాహువుల్ చఱచె నంత. 769

అట్టి చఱపులు విని కడు హడలి పక్షు
లెల్ల దిశలకు భీతిచే నెగిరిపోయె
చైత్య ప్రాసాదమును గాయు దైత్యభటులు
మోహితు లయి క్రిందనె పడిపోయి రపుడు. 770

జై జై యగు రామునికిన్
జై జై యాలక్ష్మణునికి శౌర్యాఢ్యునకున్
జై జై వానరబలతే
జో జవునకు రామగుప్త సుగ్రీవునకున్. 771

క్లేశం బెవరికిఁ గూర్పని
కోసల భువి యేలు రామ కువలయపతికిన్
దాసుఁడ హనుమంతుండను
నే శత్రుబలాంతకుఁడను నే వాయుజుఁడన్. 772

నే వేగంబున తాళ్ళను
నీవృక్షముల విసరి ప్రహరించుచు నుండన్
రావణులవంటి వారలు
వేవు రయిన నన్నిపు డెదిరింపంగలరే, 773

లంకాపురి మర్దించితి
శంకయె లేకుండ నిచట జనకజఁ గంటిన్
కొంకక నే దైత్యులు గన
నింకఁ గృతార్థుండ నగుచు నేగెద నిపుడే. 774

అని యపుడు సౌధమందున్న హనుమ యపుడు
చైత్యమందున్న వారితో సరగఁ బలికి
భీమ గర్జన గావించి వేగ మిగుల
నచట రాక్షసులకును భయంబు గూర్చె. 774

ధ్వాన మయ్యది విని చైత్యపాలకులును
నూఱుగురు వివిధాస్త్రిల మీఱి గదల
ప్రాసముల గండ్రగొడ్డళ్ళ వాడి యసుల
విసరుచున్ వానరశ్రేష్ఠు వెంటఁ బడిరి. 775

వెడలి కాంచన పట్టాలు వివిధగదలు
ప్రాస ముద్గర తోమర పట్టసములు
శూలశక్తులు ధరియించి శూరు లగుచు
వాని చుట్టు ముట్టియుఁ గొట్టి పైనిపడిరి. 776

వడిగ గంగాజలపుఁ బెద్ద సుడియొ యనఁగ
నెల్ల చైత్యులు కపి నాక్రమించి తనరి
రపుడు మారుతి యల్గి భీమాకృతి యయి
త్వరగఁ బాసాదపుం బైఁడి స్తంభ మూడ్చె. 777

నూఱు ధారలు గల దాని మీఱి త్రిప్ప
దహన మడరి ప్రాసాదంబు తగులఁ బెట్టె
అట్లు ప్రాసాద మది దగ్ధమగుటఁ జూచి
హనుమ వజ్రాన హరి యట్లు దునిమి వారి. 778

అవల నంతరిక్షముపైని హనుమ నిలిచి
అనియె సుగ్రీవు వశమున నమిత బలులు
నన్నుఁబోలు మహాత్ము లైనట్టి కపులు
కలరు వారలు భువినెల్లఁ గనఁగఁ జనిరి. 779

కొందఱు దశగజ శక్తులు
కొందఱు శతగజబలములు గూడిన వీరుల్
కొందఱు సహస్రగజబలు
లెందఱొ యమిత బలులు నికనేఱుల బలులున్ 773

ఇటువంటి దంత నఖముల
పటు శస్త్రధరులు శతములు పదివేల్ లక్షల్
ఇటులే కోటలు పదికో
ట్లిటకున్ సుగ్రీవుఁ డంపి యింక మిముఁ జంపున్. 774

ఇటు లిక్ష్వాకు ప్రభుతో
పటు వయిన మహాత్ముతోడ వైరము గొనుటన్
ఇటు లంకాపురి యుండునె
యిటు మీరును రావణుఁడును నిట నుండెదరే. 775

వ. అంతట రాక్షసేంద్రునిచేఁ బంపఁబడిన మహాదంష్ట్రుఁ డయిన ప్రహస్తసుతుఁడు జంబుమాలి ధనుస్సును పూని రక్తమాల్యములు రక్తాంబరములు పూవుమాల ధరించి రుచిరము లగు కుండలములు మెఱయ కనుగ్రుడ్లు త్రిప్పుచు సమరదుర్జయుఁడై చండ ప్రతాపముతో ఇంద్ర ధనుస్సువంటి ధనుస్సున రుచిరంబులగు సాయకము లెక్కుపెట్టి వజ్రాశనులతో సమంబగు ఘోష చేయు నారి సారించుచు వేగముగ బయలుదేఱెను. 776

చాప టంకార పృథుల ఘోషంబుచేత
నింగి దిశలును విదిశలు నిండిపోయె
ఖరరథముతోడ వచ్చు రాక్షసవరేణ్యుఁ
గని హనుమ వేగ హర్షించి గర్జచేసె. 777

తోరణపు వరాండాపైని గూరుచున్న
హనుమపై జంబుమాలి శరాళి గుప్పి
అర్ధ చంద్రాస్త్రము మొగాన హస్తములను
పదిశరాలు కర్ణాస్త్రము పై చెం దలను. 778

విడిన తమ్మిపై రవి కరం బడరి నట్లు
బాణ హత కపివర తామ్ర వదన మొప్పె
రక్తమునం దోగు కపి మోము రాణ మీతె
గంధపుం గణాలు దివిం జల్లు కమల మట్లు. 779

బాణములచేతం గొట్టంగాం బడిన హనుమ
ప్రక్కనున్న పెద్దదౌ గొప్ప బాయి యొకటి
పీకి బలముగా వేయంగా వేగ యసుర
పది శరంబుల నాబాయి పడంగం గొట్టె. 780

అట్లు బాయియును పడంజూచి హనుమ యపుడు
చండశక్తియై గొప్ప వృక్షంబు పీకి
గిరగిరమని త్రిప్పంగ మహాసురుండు వడిగ
నాతరువుపైని గని చాల యమ్ము లేసె. 781

నాలుగమ్ములం దరువు వానరు భుజంబు
శరము పై దింట నొక్కట నురము గొట్టె
బొమ్ము పదిటం గొట్టంగం గపి క్రుద్ధుం డగుచు
తనువుపైం గాడిన శరాల గనక యపుడె. 782

తొంటి పరిఘనె గిరగిర మింటం ద్రిప్పి
మిగుల వడి గల కపి వేగముగనె చూచి
జంబుమాలి వెడద యురస్థ్సలమునందు
విక్రమము మెఱయంగం గొట్టివేసె నంత. 783

భువి నసుర తలగాని బాహువులు గాని
జానువులుగాని విలు గాని బాణములును
గాని రథము గాని హయాలు గాని ఏమి
కానిపింపక పోయెను కనుల కపుడు. 784

అటుల హనుమంతుచేత మహాబలుండు
జంబుమాలి చంపంబడి భూషలును మేను
పిండి యయిపోయినట్టులు విని కరంబు
కింకరులు చావఁగని కోపగించి యంత. 785

రావణుఁడు మండి మెఱుపు నేత్రములు త్రిప్పి
యాప్రహస్త పుత్రుఁడు చచ్చినట్లు వినియు
మఱల వీర్యవిక్రము లౌ నమాత్యసుతుల
వానర వరుని నెదిరింప నాన తిచ్చె. 786

వ. పిదప రాక్షసేశ్వరునిచేఁ బ్రేరేపింపబడి అగ్నివలె మండు వర్చస్సు గల ధనుర్వేదులలో శ్రేష్ఠులగు నమాత్యపుత్త్రులు పైడి భూషలు దాల్చి అపుడు మహాబల పరివారముతో నేను ముందు జయింతు నేను వెళ్ళి జయింతు నని పందెములువేసికొని, హేమ జాలములతో నిర్మింపఁబడి ధ్వజములు, పతాకలు ఎగురుచుండ మేఘములువలె ఘోషించు నిర్ఘోషములు గలిగి గుఱ్ఱములు పూన్చిన మహారథము లెక్కి బయలు దేఱిరి. 787

జాలువా పైడి చిత్రమౌ చాపములను
నలరి యమిత విక్రములై ప్రహర్షమొప్ప
నారి సారించుచును వారు నడచినారు
మెఱుపుఁ దీగలుగల జలధరములట్లు. 788

కింకరులు చంపబడి నట్టు లింకవారి
తల్లులు విని సబంధులై తల్లడిలిరి
మఱి యమాత్య పుత్రులో పరస్పరము పందె
మొదవఁ దోరణస్థ కపీంద్రు నెదురఁ జనిరి. 789

రథ నినాద గర్జనలు శరాలవృష్టిఁ
గూర్చుచును రాక్షసాబ్దముల్ కూడి యుఱుక
బాణవర్షాలుఁ జుట్టఁగ వానరాగ్యు్రిఁ
డంత వర్షాలు గప్పు మేఘాద్రి యయ్యె. 790

హనుమ మింట పల్టీల్ కొట్టి యస్త్రతతుల
రథజవంబును నెంతయు వృథయొనర్చె
మింట హనుమ విల్కాండ్రతో మెలగియొప్పె
మబ్బులను నింద్రధనుసులన్ మారుత మటు. 791

వ. ఆ హనుమంతుఁ డట్లు మింట విహరించుచు ఘోర నాదంబొనరించి రాక్షససేనను భయపెట్టుచు రాక్షస వీరుల పయి మహావేగముతో విహరించుచు. 792

కొందఱ నఱచేఁ గొట్టెను
కొందరిని బాదములతోడఁ గొందఱుఁ గోళ్ళన్
కొందఱను గుప్పిడులతో
కొందఱ వక్షానఁ గొట్టెఁ గొందఱుఁ దొడలన్ 793

భయముతో నాల్గు దిశలకు బఱచె బలము
కరులు రోదించె గుఱ్ఱాలు ధరను గూలె
దండములు ధ్వజములు ఛత్రములు విఱిగి
భువిని బడ రథముల తోడ భూమి నిండె. 794

కారు నెత్తురుచే నేర్లు పాఱె నపుడు
లంక వివిధ వికృతపు స్వరాల నిండె
హనుమ మంత్రి పుత్రుల నెల్ల హత మొనర్చి
రయము నన్యులఁ జంపఁ దోరణము జేరె. 795

వ. అంత మహాత్ముఁ డైన హనుమంతునిచే మంత్రి సుతులు చంపబడి నట్లు తెలిసికొని రావణుండు తనలోఁ గలిగిన వికారమును పైకిఁ గనఁబడనీక బాగుగా నాలోచించి విరూపాక్షు యూపాక్షులను దుర్ధరుఁడు ప్రఘసుడు భాస కర్ణుఁడు అను అయిదుగురు సేనానాయకులను వాయుసమానమైన వేగము గలవారిని పంపుచు నిట్లు శాసించెను. 796

మీరు సేనాను లందఱు మేటిబలము
గైకొని రథాలలో వెళ్లి కపినిబట్టి
దేశ కాల విరోధముల్ తెలిసి దాటి
తీసికొని రండు యత్నించి తెండు వాని. 797

వాని కర్మలు చూడ నావానరుండు
వట్టి మామూలు కపి యని భావమునఁ గనకు
డది మహాబలియగు భూత మగును దాని
మనకొఱకు నింద్రుఁడో వేఁడొ గనెఁ దపసున. 798

యక్ష నాగ గంధర్వ మహర్షి దేవ
అసురులు జితు లయిరి మీసహాయమునను
వా రవశ్యము మన కిట్టి బాధగూర్చి
యుంద్రు వాని బల్మినిబట్టి కొంద్రు గాక. 799

ధీర విక్రముఁ డగుకపిన్ మీరు నింద
చేయకుఁడు మున్ను పృథుశక్తి చెలగు నీల
వాలి సుగ్రీవ జాంభవ ప్రభృతి కపుల
ద్వివిద ముఖ కపులను గంటి వినుఁడు మీరు. 800

వారిగతిగాని తేజస్సు బలముగాని
విక్రమముగాని రూప సంపత్తుగాని
మతియుగాని యుత్సాహసంపదయుఁగాని
యిట్టుల భయంకరంబుగా నెసఁగ దెపుడు. 801

ఇదియుఁ గపిరూపమైన నేదేని యొక్క
గొప్ప తత్త్వమై యుండఁ గన్గొనఁగవలయు
గొప్ప యత్నంబు గావించి కూడ దీని
నిగ్రహము చేయఁబూన్కితో నెఱయవలయు. 802

ఘన శక్రామర దైత్య మర్త్య యుత లోకాల్ మూఁడు పైకెత్తి వ
చ్చినఁగానీ భువి మీదు కట్టెదుట నాజిన్ నిల్వఁగాలేవ యై
నను గెల్వం దలపోయు నీతివిదు లెన్నన్ తమ్ము రక్షించు కో
నను వాయత్నము చేయుగాదగు, ననిత్యంబౌ జయం బెప్పుడున్. 803

అని యారావణుఁ డన్న యర్థవచనా లాలించి యోజస్వులై
ఘన వీర్యంబున వహ్ని తేజమున వేగంబొప్పి యెంతో మదిం
చిన మాతంగ రథాశ్వ సైన్యములతో శీఘ్రంబుగాఁ బోయి క
న్గాని రంతన్ జ్వలియించు సూర్యునటు లుగ్రున్ ద్వారసంస్థున్ గపిన్ 804

సుమహా సత్త్వ మహాబలాఢ్యుని మహాశూరున్ మహోత్సాహు దీ
ర్ఘ మహాబాహు మహామతిన్ భువి మహాకాయున్ మహాత్మున్ మహా
క్రమును నాతోరణమందు వారు గని సర్వంబౌ దిశల్ జొచ్చి భీ
మములౌ శస్త్రములన్ ధరించి ధృతితో మార్కొగ నయ్యాజిలో. 805

బలుఁడౌ దుర్ధరుఁ డంతఁ బీతముఖమై వాఁడైన లోహంపు ను
త్పల పత్రాభములైన యైదుశరముల్ తద్వానరాగ్రేసరున్
తలపై గొట్టఁగ బిట్టు కొట్టఁబడియున్ తద్వాయుపుత్రుండు ది
క్కులు మార్మ్రోయ ధ్వనించి పైకెగిరె దిక్కుంభింబలెన్ ధీరుఁడై. 806

ద్రుతవేగంబున దుర్ధరుండు రథ మారోహించి విల్లెక్కి పె
ట్టి తత్కాలన్ శతబాణముల్ గురిసి దాడిం జేయు నావానరుం
డతివేగాన శరాల నెల్ల శరదృత్త్వంతానమేఘంబు మా
రుతఘట్టుల్ గడు నడ్డగా నసురుఁడయో క్రోధించి కొట్టెన్ గపిన్. 807

అటు లాదుర్ధరుచేతఁ గొట్టఁబడి యత్యంతంబు వర్ధిల్లుచున్
పటు శౌర్యాన మహాశరీరుఁడయి పైపై కెంతయో దూరమ
ట్టిటులన్ మారుతి దూకి దుర్ధరురథం బిట్టే కడున్ విద్యు దు
త్కటరాశిం బలెఁ బట్టి దూకి చదిపెన్ గంభీర ఘోషంబుతో. 808

వ. అంత గుఱ్ఱములు కూలిపోవ, రథపుఁ జక్రములు ఇరుసులు విఱిగి పడిపోవ నందుండి దుర్ధరుఁడు హతుఁడై క్రిందఁబడి పోయెను. అట్లు హతుఁడైన దుర్ధరునిజూచి విరూపాక్ష యూపాక్షులు దుర్ధర్షులై రోషంబుతో పైకెగిరి హనుమంతుపైఁ బడిరి. అంత నాహనుమంతుఁడు వారితో పాటు స్వచ్ఛమగు నాకాశమున నెగిరి వారిచే ముద్గరములచేఁ గొట్టఁబడి వారి వేగము నడ్డగించి గరుత్మంతునితో సాటివచ్చు విక్రమముతో భూమి పయిని ప్రాలి సాలవృక్షము నొకదానిఁ బెల్లగించి వారిద్దరను చావమోదెను. అంత వారు మువ్వురు వేగవంతుఁ డగు వానరువలన చచ్చుటయుఁ జూచి ప్రఘసుఁడు మహా వేగముతో హనుమంతునిమీఁద కుఱికెను. ఇంకొక ప్రక్క భాసకర్ణుఁడును క్రుద్ధుండయి యశస్వి యగు కపిశార్దూలుని శూలము గైకొని కొట్ట శిలాగ్రం బగు పట్టసముతో ప్రఘసుండు పోరాడె అంత వారిరువురిచే గొట్టఁబడి రక్తముచేఁ దడిసి వెంట్రుకలతో కపికుంజరుఁ డగు హనుమంతుఁడు బాలసూర్యుని వంటి ప్రభతో

మీఱి మృగంబులు పాములు చెట్లతోనిండిన యొక పర్వత శిఖరమును పెల్లగించి వారిని బడఁగొట్టె. ఇట్లు వారు అయిదుగురు సేనాపతులు మడియఁగా మిగిలిన సైన్యమును వానరవరుఁడు పూర్తిగా నాశముచేసి గుఱ్ఱములతో గుఱ్ఱములను గజములతో గజములను యోధులతో యోధులను రథములతో రథములను కొట్టి సహస్రాక్షుండువలె రాక్షసులను చావమోదఁగా గూలిన యేనుగులతో పడిన గుఱ్ఱములతో విఱిగిన రథములతో హతులైన రాక్షసులతో భూమి యంతయు మార్గములు లేకయు చిందఱ వందఱ యయిపోయెను. అంత నావానరవరుండు సేనాపతులను బలవాహనములతోఁ జంపి ప్రజలు క్షయ మొందు అవసరము చూచి చేరిన యమునివలె మరల తోరణమున వేచి యుండెను. 8'9

అనుచరులతోడఁ దద్వాహనాళితోడఁ
 ఱ పడు సైన్యాపతులైదుగురను జూచి
సమరమునకు సిద్ధపడి యక్షాఖ్య సుతుఁడు
తన యెదుట కరుదేఱ రావణుఁడు చూచె. 819

ఇట్లు పితదృష్టి ప్రేరేప నిట్టిలేచి
విక్రమాన్వితుడై పైడి విల్లు పూని
ద్విజ వరులచేత మంత్రాల వేల్చఁబడిన
పావకునివలె నక్ష తనయుఁడు పైకి నెగిరె. 810

బాలార్కువలె వెల్గి బంగరు జాలాలు
 చెలఁగఁ దపసుల నార్జింపఁబడిన
ధ్వజముల మణు లొప్ప వరపతాకల మీఱి
 స్వమనోజవా ష్టాశ్వవరము లెసఁగ

అసుర సురల కజేయం బౌచు భూమిని
నంటక మింటిపై నరుగఁ జాలి
అర్కప్రభ గలిగి, యంబుల పొదులుండి
యెనిమిది కత్తులఁ దనరి యున్న

సరిగ తగుచోట్ల శక్తి తోమరము లున్న
సజ్జమై వస్తువుల నిండి చంద్ర సూర్య
వర్చసుగల బంగరు మాల వఱలు రథము
అమరసముఁ డక్షసుతుఁ డెక్కి యరిగె ననికి. 811

హయ మాతంగ మహారథ ధ్వనుల సైన్య శ్రేణిచేఁ గాననా
ద్రి యుతోర్విన్ దివి నింపుచున్ జనియు నందేపోర ద్వారస్థుఁడై
న యుగాంతాగ్నిని బోల్ కపీంద్రు బహుమానాశ్చర్యముల్ మీఱ నం
ద యదేదృష్టిని సంభ్రమానఁ గని దైత్యేశాత్మజుం డంతటన్. 812

అరులపై నామహాత్ముఁడౌ హనుమ చూపి
యున్న శౌర్యమున తన బలంబూహ చేసి
నృపసుతుఁడు మహాబలుఁ డక్షుఁ డెదురు కొనుచు
హిమ ఋతు తుది సూర్యుం డట్లు హెచ్చి వెలిగె. 813

శ్రమ లేకుండనె శత్రుసేనల జయింపం జాలి గర్వించి వి
క్రమమున్ జూపెడి యాకపీంద్రుఁ గని వేగన్ వాడియౌ మూడు బా
ణములన్ వేసి రణోర్వికిం బిలిచె స్వర్ణాభూషుఁడక్షుండు క
ర్ణములన్ గుండములన్ చలింప గపిఁగూల్చన్ బైపడెన్ శీఘ్రమే. 814

క్షితిపై వారల పోరు చూచి క్షితి యూగెన్ వెల్గఁడౌ సూర్యుఁడున్
గతి స్తంభించెను గాలి కబ్ధి కలగెన్ గర్జించె నాకాశ మ
ప్రతిమంబై యని దేవదానవులు కెల్లన్ గూర్చెఁ గంగారు నీ
గతి యుద్ధంబు మహాభయంబు జగతిన్ గల్గించె నుగ్రంబుగన్. 815

అట శరప్రయోగోపసంహారములను
లక్ష్య వేధము తెలిసిన రాజసుతుండు
సవిష సర్పాల బలె మూఁడు శరము లిట్టె
వానరు శిరస్సుపై వేగవైచి కొట్టె. 816

అవలన్ సుగ్రీవు వరస
చివుఁడగు హనుమయు నుదగ్ర చిత్రాయుధముల్
వివిధతఁ గల యక్షుఁ బొగడి
జనమునఁ మెయిఁ బెంచి యుద్ధ సమ్ముఖుఁ డయ్యెన్. 817

శరములచేఁ గొట్టఁబడిన
శిరసున నుండి పడు నెత్తుచేఁ దడిసియు నే
తిరిగెడి కన్నులతోఁ గపి-
కరముల నుదయించిన రవికరణిం దోఁచెన్. 818

ధరకు నడుమ గల మందర
గిరి యందున్న రవివోలె గినుకను గని వా
నరుఁ డఖిలాశ్వయుతముగను
ఖరమగు నయనాగ్నిఁ జూచె గడు నక్షసుతున్. 819

ధను సను నింద్ర ధనుస్సును
ఘన శరవృష్టి, గల దైత్యఘన మేఘంబో
ఘనముగ గిరికపిపై బాణము
లను గురిసెను, గిరిపయిన్ వరాబ్దము వోలెన్ 820

అవలన్ వానరుఁడున్ ప్రచండ బలుఁడై యత్యంత తేజో బలా
న విరాజిల్లెడి యక్ష పుత్త్రుగని యానందాన గర్జించి చా
ల విజృంభించి పయోద మట్లు పడ బాల్యత్వాన గర్వించి క్రో
ధ వశుండై తృణ గూఢవాసిని ద్విపేంద్రం బట్టు లక్షుం డటన్. 821

మెస నాదంబొనరించి పైబడి యమోఘంబైన బాణాల వృ
ష్టిని వేగన్ గురిపింప నూరు భుజ నిక్షేపాల ఘోరాకృతిన్
గొని పైపై కెగురన్ గపిన్ గనుచు రక్షోనాథ పుత్రుండుపై
కొని శౌర్యాన మహారథుం డయి శిలల్ కుర్పించు మేఘంబటుల్. 822

శరవృష్టిన్ గురిపింప దాని నుడిగింపన్ విక్రమంబార వా
నర శార్దూలుడు వాయుమార్గమునఁ జండౌజస్సుతో మీఱి సం
చరణమ్ముల్ పొనరించి బాణముల సంచారంపు మధ్యన్ సము
ద్ధర పాతంబటు సంచరించెను మిగులన్ దోడ్డో మనోవేగతన్. 823

అటు వింటిన్ గొని బాణ వర్షముల సర్వాకాశమున్ గప్పి యు
ద్భటుడై యట్టి మహాత్ముఁ డంతక్షసుతు స్వీయ వక్షంబు ప్రీ
ల్చుట యీక్షించియు వాని గౌరవపుఁ జూపున్ నిల్పియుంజూపి వి
మ్మట నామారుతి యట్లు లోఁ దలఁచెఁ గర్మ ప్రాభవ జ్ఞానియై. 824

ఇతఁడో ప్రౌఢుని బోలె బాల రవియట్లే గొప్ప తేజస్సుతో
క్షితి సర్వావహ కర్మశోభి యయి మించెన్ వీని మాపంగ నా
మతి వాంఛింపద, ఈ మహాత్ముఁడు బలంబందెంతొ వీరుండు సు
స్థితుఁ డాజిని ముని యక్ష నాగసుతుఁడౌ ధీరుండు కర్మోన్మతిన్. 825

ఇతఁ డుత్సాహ వివృద్ధ చిత్తుడయిన న్నెంతో యెదుర్కొఁ గలం
డతి వీర్యాత్ములు దేవ దైత్యుల బలం బైనన్ వడంకించు నే
నితనిన్ మార్కొనకున్న నీఘనుఁడు నన్నే యోర్చు వర్ధిల్లు నీ
కతనన్ వీనిని మావ యుత్తమ యుపేక్ష్యం బౌనె దీప్తాగ్ని యున్. 826

అని యా యక్ష కుమారు కార్య మెదలో నాలోచనం జేసియున్
దన కర్తవ్యము నిశ్చయించుకొని యాతం డక్ష పుత్రుం వధిం
ప నెదన్ బూని తలప్రహారముల నష్టాశ్వాలఁ గూల్చన్ రథం
బున గూలెన్ దివి చక్రముల్ నొగలు మున్ముందే భూమింకూలగన్. 827

ఇక నాభిన్న రథంబు వీడి ధను,వెంతే వాడియౌ ఖడ్గమున్
స్వకరాలంగొని మింటిపై కెగిరి తీవ్రంబౌ తపశ్శక్తిచే
స్వక దేహంబును వీడి మౌని దివి కేగం బూనినట్లక్షుఁడో
ప్రకట స్థైర్యముతో రణంబు నొనరింపన్ బూనె నా క్రోతితో. 828

హనుమంతుండటు వేగ నభ్రమున నిట్లట్లుల్ విజృంభించు వీ
రుని నా యక్షకుమారుఁ బాదములతో శీఘ్రోదగ్ర వేగంబునన్
గొని సర్పంబును పక్షిరాజటు దివిన్ క్రూరంబుగా వేల సా
ర్లెన నుస్ గిరుసఁ ద్రిప్పుచున్ ధరణిపై నే కూలవైచెన్ తటిన్. 829

వ. అట్టు లా హనుమంతుఁ డక్షకుమారుని నేలపైఁ గూలవేయ నతడు ఎముకలు, కండ్లు, కీళ్ళు విరిగి తెగిపోవ బంధనము లూడిపోయి భువిఁబడి మృతుండు కాగా నంత నా వానరుడు వానిని నేలపై పీడించి క్రుమ్మి యా రావణునికి మహాభయంబు కూర్చి జ్యోతిశ్చక్ర చరులగు మహర్షులగు యక్ష పన్నగులును యక్షపన్నగులతో గూడిన భూతములును ఇంద్రునితోడి యమరులును భృశముగా ఆశ్చర్యముతో వీక్షింప నింద్రుని సుతుని వంటివాడును రక్తమువంటికన్నులుగల యక్షకుమారుని జంపి మరల ప్రజాక్షయమును చేసెన పిదప గాలుడువలె బహిర్ద్వారమునుచేరి హనుమ మరల యుద్ధమునకు సన్నద్ధుడయి యుండె నంత 830

ఇక నా మహాత్ముండగు దైత్యేశుడపుడు
వానరునిచే సుతుడు హతుడయిన వార్త
యెరిగి మనసు సమాధాన పఱచుకొనుచు
నింద్ర తుల్యు నింద్రజిని బిల్పించి యనియె. 831

నీవు సురాసుర జేతవు
నీవో శస్త్రాస్త్ర విదుల నిపుణుండవు నిన్
దేవులు నింద్రుదు డెఱుంగుదు
నీవు పితామహుని గొలిచి యొనసితి వస్త్రాల్. 832

నీ విక్రమమున కెదురుగ
దేవేంద్రుఁడు సుర లసురులు ధృతినిలువగ లే
రీవు వ్యథపెట్టని జనుం
డే వాడును లేడు సుమ్మి యీ జగములన్. 833

రక్షితుఁడవు స్వబలముచే
రక్షితుఁడవు తపసుచేతఁ బ్రవిదిత మతివిన్
సాక్షాత్కరించు కొంటివి
యక్షయముగ దేశకాల యాథార్థ్యములన్. 834

నీ వానరింప లేని పని నేఁ గనలేద మహారణోర్వులన్
నీవు వివేకపూర్ణముగ నేర్చి యెఱుంగని దేది లేదిలన్
నీ విపులాస్త్ర నైపుణియు నీదు భుజాబలశక్తి యుక్తులన్
నీ విజయాలు గన్గొనని నేర్పరి లేడిట నీ త్రిలోకిలో. 835

నా కనురూప మైనదె
నీకుఁ గల తపోబలాస్త్ర నిపుణత, బలమున్
నీకుఁ గలశక్తి గన నిఁక
నాకుఁ గల మనశ్శ్రమం బణంగెను వనికై. 836

కింకరులు జంబుమాలియు నింక మంత్రి
సుతులు పంచసేనానులు హతులె యైరి
గుల్మములు నేన్గులు రథాలు కూల్చఁబడియె
అనుజుఁ డక్ష కుమారుఁడున్ హతుఁడె యయ్యెఁ. 837

వారికడ నీకు నాకును వఱలు శక్తి
కానిపింప, దాకపియందుఁ గలుగు బలము
విక్రమము, నీదు శక్తియు సక్రమముగ
నీవు కని మఱి శౌర్య మిపుడ నెఱపు. 1838

శత్రువులఁ జంపు నీవట్టి శత్రువునకు
కపికి దరినుండి నెటు శత్రు గర్వమణఁగు
నట్లె నీబలమును జూచి, యన్య బలము
నెంచి యస్త్రవిద్వర! యాచరింపవలయు. 1839

సేనలే గణములుగ నశించుచుండె
ఆవిపుల సారమగు వజ్ర మనువుగాదు
వీనిగతికి వాయుగతియు వీలు గాదు
ఇతఁడొ యగ్నికల్పుఁడు, చంప వెవియు వీని. 1840

ఇటుల ఆయర్థమును చక్కనెంచి చూచి
నీదు కర్మ సామ్యముబట్టి నెఱపి శ్రద్ధ
నీధనువు దివ్యవీర్యమున్ నిలిపి మదిని
నడుపు మక్షత కర్మను వడిగఁ బూను. 1841

ఇటుల నిన్నాజి కంపుట యేమి తగదు
నృపునికిని రాజనీతికో యిదియొ తగును
అస్త్ర శస్త్రయుద్ధముల నేర్పవసరంబు
మీఱి పోరవలె జయంబు కోరవలయు. 1842

అనఁగఁ బితృవాక్కు విని సురవినుత బలుఁడు
ధృతిని పోరఁబూని ప్రదక్షిణించెఁ బితకు
అంత నిష్టగణార్చితుఁ డగుచు రెచ్చి
యింద్రజిత్తు సోత్సాహాన నేగె ననికి. 1843

శ్రీమంతుండు సరోజనేత్రుఁ డసురజ్యేష్ఠాత్మజుం డింద్రజి
త్తామాడ్కిన్ జలరాశి పర్వములయం దట్టుల్ విజృంభించి, తే
జోమంతుం డయి పక్షిరా జటులు- దంష్ట్రోగ్రంపు నల్వ్యాళముల్ *
వే, మోయన్ రథమెక్కి విక్రమముతో వెళ్ళెన్ గపిన్ మార్కొనన్. 844

విలుకాండ్రన్ ఘనుఁడైన శస్త్రవిదుఁడున్ పెక్కస్త్రవిజ్ఞాన వే
త్తలలో జ్యేష్ఠుఁడ యింద్రజిత్తు రథియై తత్కాలమే వానరున్
పెలుచన్ మార్కొన నేగి నంత రథపున్ వేగంబు తద్ఘోషమున్
విలుజ్యాఘోషము నాలకించి కపియో వేహంగి పోయెన్ గడున్. 845

ఘనచాపంబు గ్రహించి తీవ్రశిత దీర్ఘంబైన బాణమ్ములన్
గొని యుత్సాహముతోఁ గపిప్రముఖు రక్షోనాథ పుత్రుం డెదు
ర్కొన దిక్కుల్ కలుషంబు లయ్యె మృగపక్షుల్ బిట్టుగా నార్చె నం
దున నేతెంచిన నాగ యక్ష ఋషి సిద్ధుల్ చేసి రుద్ఘోషముల్. 846

అరదం బెక్కియు వచ్చు నింద్రజిని వీరాగ్రేసరుం డైన వా
నరుఁ డంతన్ గని ఘోరగర్జన మటన్ గావించి మైఁబెంచెఁ బల్
వరవజ్రం బటు లింద్రజి త్తుఋమఁ జాపం బెత్తి సారించి యు
ద్ధురులౌ వీరులు నింద్రజిత్తు హనుమంతుండున్ విజృంభించుచున్. 847

అట దీవ్రంబుగ బద్ధవైరు లయి ఘోరాయోధనంబున్ పొన
ర్చుటకై పైకొన వండు నింద్రజియె విల్పూరించి బాణాలఁ జి
మ్ముటయున్ మారుతి మింటిపై కెగిరి వమ్ముంజేయ నాయింద్రజి
త్తటకాయించి సువర్ణ పుంఖములు శల్యాస్త్రాలు వేసెన్ వడిన్. 848

రథ ఘోషంబు మృదంగ భేరి పటహారావంబు లాకృష్యమా
ణ ధనుర్ఘోషము నాలకించి కపియున్ స్వైరంబ వేగన్ వియ
త్పధి సంచారము చేయు చింద్రజి శరాపాతాంత రాలందు ల
క్ష్య ధురీణత్వము వమ్ము చేసెను మహాచాతుర్య మేపారఁగన్. 849

శరపాతంబుల కగ్రమందుఁ గరముల్ సారించి పైపైకి ను
ద్దురతన్ మారుతి లాఘవంబ యెగిరెన్ దూర్ణంబుగా నిట్లు ది
క్కరులి ట్లిద్దరు సారభూత హృదు లాకర్షించుచున్ బోరుచున్
మరి వారొండొరు చూచువారల మదిం భ్రాంతి వ్యగ్రతల్ గూర్చిలన్. 850

హనుమంతుని యంతర మా
దనుజుఁ డెఱుంగండ యట్టి దనుజాంతరమున్
హనుమంతుఁ డెఱుఁగఁ డొకడొ
క్కని బుధసము లిట్లు గెల్వగా లేరైరెందున్. 851

గుఱియయిన హనుమంతుడు దొరకకుండె
ఆ యమోఘ బాణంబులు వ్యర్థ మయ్యె
చేయునదిలేక యింద్రజి చింత మునిఁగి
ఆ మహాత్ముఁడు లక్ష్మ సిద్ధాత్ముఁ డయ్యె. 852

ఇతఁ డవధ్యుఁడు పట్టుట యెట్టు లింక
అని తలఁచి యింద్రజిత్తు తత్త్వార్థ చింత
చేసి యతనిపై బ్రహ్మాస్త్రమేసి యపుడు
అతని ఁబట్టె మిక్కిలి తేజస్వి యగుచు నపుడు. 853

అంత బ్రహ్మాస్త్రమున బద్ధుఁ డగుచు హనుమ
చేష్ట దక్కి యూపిమ్మట క్షితిని బడియె
పిదప బ్రహ్మ ప్రభావాన విగత వేగు
డయితి నని యెంచె బ్రహ్మ వరాదికమును. 854

అపుడు బ్రహ్మ దేవతగల యట్టి మంత్ర
మునసె బ్రహ్మాస్త్ర బంధ విముక్తి పొంది
నాకు శక్తిలే దని యెంచి బంధంబు పొందె
బ్రహ్మ యాజ్ఞ మన్నింపగా వలయు నంచు. 855

అస్త్ర వీర్యము మదిలోన హనుమ తలఁచి
* బ్రహ్మ యిచ్చిన యాయనుగ్రహము నెంచి
అస్త్ర బంధ విముక్తిని నాత్మఁ జూచి
బ్రహ్మ యిడిన యాజ్ఞప్రకారము లొంగె. 856

బ్రహ్మ దేవేంద్రుఁ డనిలుండు రక్ష చేయు
నేను నస్త్రాన బద్ధుఁడ నైనఁ గాని
నాకు భీతి గలుగదు దానవులు నన్ను
పట్టి నాకె మేలగు రావణుని గాంతు. 857

రావణునితోడ సంవాద లాభ మగును
కనుక దైత్యులు నను పట్టుకొనుట మంచె
అనుచు నిశ్చయించి పరవీరాంతకుఁడును
పరిగఁ గని చేయువాఁ డయియుఱక యుండె. 858

బల్మిని గ్రహించి యసురుల్ పట్టుకొనియు
తెచ్చి యాయా పనుల బెదిరించి నంత
ఏమి బదులును తాను గావింప కుండి
యుఱచె నంతట హనుమంతు డట్టి తఱిని. 859

* బ్రహ్మాస్త్రము హనుమంతునికి హాని ఏమియు చేయదని బ్రహ్మవరము.

వైరి దమను డయ్యును జేష్టఁ బాసి యున్న
హనుమ నీక్షించి దైత్యులు జనప నార
త్రాళ్ళతోడఁ జెట్టుల నార త్రాళ్ళ తోడఁ
గట్టి బంధించినారు వేగంబ యపుడె. 360

రాక్షసేంద్రుఁడు నను జూడఁ బ్రయతనంబు
చేయవలె నని నిశ్చిత చిత్తుఁ డగుచు
పరుల బంధనమును బల్మి వైరి వీరు
లడఁచి నిగ్రహించుట కిష్టపడియె నపుడు. 361

ఎపు డయితేఁ గపి త్రాళ్ళ బంధింపఁబడెనొ
అపుడె బ్రహ్మాస్త్రమునుండి త్యక్తుఁ డయ్యె
అస్త్ర బంధము నితరమైన బంధ
మనుమతింపదు కావున నదియె పోయె. 362

వ. వానరుండు నారత్రాళ్ళతోఁ గట్టఁబడినట్లు తెలిసికొని ఇట్లు ఇంద్రజిత్తు ఆలోచించి "యింక ఈవానరుఁడు బ్రహ్మాస్త్రమునుండి విముక్తుఁ డయ్యె ఇతరమగు తాళ్ళతోఁ గట్టఁబడిన వానికి ఈబ్రహ్మాస్త్రముపనిచేయదు. యాహా ! నేను చేసిన యీమహాకర్మ యంతయు వ్యర్థమైనదే. ఇట్లు త్రాళ్ళతోఁ గట్టినచో మంత్రములు పనిచేయు వని యెఱుగరు. ఈమహాస్త్రమును వ్యర్థమును జేసిరి. పోనీ మఱల ప్రయోగింత మన్నచో ఒకసారివేసిన యస్త్రమును మరల ప్రయోగించినచో పని చేయదు గదా. ఇంక మనస్థితి సంశయములో పడినది" అని చింతలో మునిగెను. మఱి యాహనుమంతుఁడు తాను రాక్షసులచే లాగఁబడుచు త్రాళ్ళతోఁ బీడితుఁడై అస్త్రము నుండి విముక్తుఁ డయిన ట్లెఱుంగడు. క్రూరు లగు రాక్షసులు గుప్పిళ్ళతోఁ బొడువఁబడుచు రాక్షసేశ్వరుని సమీపమునకు హనుమంతుఁడు ఈడ్చుకొని పోఁబడె. ఇంద్రజిత్తు మాత్రము బ్రహ్మాస్త్ర

ముచే ముక్తుఁడై నార్త్రాళ్ళతోఁ గట్టఁబడిన మహాబలుఁడైన వానర వీరుని స్వగుణములతోఁ గూడియున్న రాజునకుఁ జూపె. మఱి యా రాక్షసులు బంధింపబడిన యేనుంగునుబోలె కపివీరుని రాక్షసేశ్వరునికి నివేదించిరి. వీఁ డెవఁడో, ఎవ్వరి వాఁడో, ఇక్కడ పనియేమో, ఇక్కడ నున్న యాశ్రయ మేమో ! అని రాక్షసవీరులు చెప్పుకొనఁ దొడంగిరి. వీనిని కొట్టుఁడు దగులఁ బెట్టుఁడు లేనిచో భక్షింపుడు అని మఱి కొందఱు రాక్షసులు క్రుద్ధులై పలికిరి. అంత మహాత్ముఁడైన యా హనుమంతుఁ డా మార్గమును దాటి రాక్షసరాజు పాదమూలమున నున్న పరిచారక వృద్ధులను మహారత్నములచే విభూషింపఁ బడిన గృహమును చూచెను. మహాతేజుఁడైన రావణుఁడును వికృతాకారులైన రాక్షసులచే నీడ్చుకొని తీసికొని రాఁబడుచున్న కపి సత్తముని జూచి తేజో బల ములతోఁ గూడిన రాక్షసరాజును తపించు భాస్కరుని బోలెవానరుఁడు చూచెను అంత నారావణుండు కపిని జూచి రోషముచే నెఱ్ఱని కన్నులను త్రిప్పుచు కుల శీలంబుల వృద్ధులైన మంత్రిముఖ్యులతో ఆ వానరునిగూర్చి తెలిసికొనుఁడని యాజ్ఞాపింప వారును యథాక్రమముగ వచ్చిన కార్యప్రయోజనమును దాని మూలకారణమును గూర్చి ప్రశ్నింపఁగా వానరరాజు దరినుండి దూతనై వచ్చితినని నివేదించె. 663

అటులు తన్ను రప్పించు కృత్యంపుఁ దెలివి  
నచ్చెరువు వడి భీమ శౌర్యంబు గలుగు  
హనుమ రోషాన నెఱుపైన కనుల నొప్పె  
రాక్షసేశ్వరు పైకి నేత్రములఁ బఱపె. 8(4

వెలుగు పసిండి వెలగల్గి ముత్యాలు  
సరులు వ్రేలు కిరీట మొరుగఁదాల్చి

వజ్రాలు పొదిగిన స్వర్ణంపు నెలగల  
మనసె చేయు మణి భూషణము లూని

వెల గలిగిన పట్టు వలువలు దాలిచి
రక్త చందనముల రకము లలఁది
తెలిచిన కనదగు నెఱుపైన నెఱగొల్పు
మెఱయు తీక్ష్ణపుఁ బండ్ల వరలు చుండి

చరిని వ్రేలు మోవుల పదితలలతోడ
వర భుజంగాఢ్య శృంగ మందరముఁ బోలి
దశముఖుఁడు హారకంతుడు శశిముఖుఁడు
కాటుకల ప్రోగు, సబలాక ఘనుని బోలె. 365

అయిదు తలల పాములువోలె నమరి బాహు
పురులు దాల్చిన బలిసిన భుజము లొప్ప
మణులు పొదిగిన చిత్రా స్తరణము గలుగు
నుత్తమ మగు స్ఫటిక పీఠి నుండె నపుఁడు. 366

కడు నలంకరించు కొనిన కాంత లతని
వాలమును వ్యంజము గొనిలీలఁ గొల్తురిఁ
దుర్ధరుఁడు ప్రహస్తుఁడు మహాపార్శ్వుడును ని
కుంభుఁడనెడి నల్వురు మంచి కుశలు లచట. 367

బల మదాంధులై నాలుగు వార్ధులట్టు
లలరి మంత్రతత్త్వజ్ఞులై యమల బుద్ధి
గలిగి సురలచే నింద్రు నట్టులను హనుమ
మేరుగిరి గాఱు మబ్బట్లు మీరఁ జూచె. 368

అతఁడు భీమశక్తి గల దైత్యాళిచేత
బాధ పెట్టబడుచుఁ గూడ బరమ మైన
యచ్చెరువు పొంది, భాసిల్లు నసుర పతిని
గనీ యుతని తేజసున మోహ మొనసి తలఁచె. 369

ఏమి యసురపతి రూపం
బేమి యతని ధైర్యగరిమ యేమి సత్త్వం
బేమి యతని తనుకాంతియు
నేమి యఖిల లక్షణాఢ్య వృత్తియు నౌరా. 870

ఇతని దరి నధర్మము బల
యుతంబుగా నుండదేని సురతర శక్రా
న్విత సురలోకము గూడను
నితఁడు ప్రోవ గలవాడె యిది నిశ్చయమే. 871

ఇతఁ డొనరించు భువన కు
త్సితోగ్ర కర్మములచేత దితిజ త్రిదశా
న్విత లోకములన్నియు
సతతంబు భయంబు చెంది సంతాపింపన్. 872

అతి తేజసు గల దానవ
పతి ప్రభావంబు చూచి వానరుఁ డెంచెన్
యితడే గనక అలిగిన జ
గతి నేకార్ణవముఁ జేయఁగల డని మదిలో. 873

ఎదుట నున్న పింగాక్షు మోమెత్తి చూచి
ప్రకట పృథుబాహువును లోక రావణుండు
నయిన రావణుఁడు క్రుధావ శాత్ముఁడగుచు
హనుమఁ దేజస్వి నతి శంక నరసి తలచె. 874

మును కైలాసము నేఁ బెకల్చినపుడే పూజ్యుండు నన్నున్ శపిం
చెనొ యానంది కపీంద్రు రూపమున వచ్చెంబో యిటుల్ వేగ తే
కను బాణాసురుఁ డింపు వచ్చెనొ కనంగా నౌ నటంచున్ బ్రహ
స్తుని రోషారుణనేత్రుఁడై పలికె నబ్బో నర్థకాలోచితిన్. 875

అడు, గెందుండి ఖలుం డితఁడు నీ ప్రాంతాన కేతెంచె ని
క్కడికిన్ రాగతమేమి యీ వనము భగ్నం జేల కావించె ని
క్కడి దైత్యాంగనలన్ భయంపడు నటుల్ గావించె నే హేతుచే
గడు దర్శింపగ రాని నాపురికి రాఁగా నేల, పోరేటికిన్. 876

అడుగుమి యీదురాత్ము" నని యాదనుజేంద్రుఁ డనన్ ప్రహస్తుఁడ
ప్పుడని యెఁ "గ్రోతి ! యూరడిలు పొందుము భద్రము భీతి వీడు యిం
ద్రుఁడె నిను రావణావనికిఁ ద్రోసెనెయేన నిజంబు చెప్పు మి
య్యెడ భయ మొందకీవు నిను నిప్పుడె ముక్తుని జేతుమో కపీ ! 877

అటుకాదేని కుబేరుఁడో వరుణుఁడో యాకాలుఁడో నిన్ను ని
చ్చటకున్ దూతగ బంపఁ నీపురికి స్వేచ్ఛన్ వచ్చితే లేక ని
న్నిటు సర్వంబు జయింపఁ గోరు హరియే నేడంపెనా పైకి నీ
విటులన్ వానరరూప మొందితివి గానీ వాన రౌజ స్సేదీ. 878

నిజము వచింపు మోరి కపి ! నిన్నిక ముక్తుని జేతు మిప్పుడే
నిజము వచింప కున్న యెడ నీవిదె ప్రాణముతోడ నుండ, వి
ట్లు జవముతో దశాస్యు పురిలో నిటు చొచ్చితి కేటి కోరి వే
నిజము వచింపుమం చనఁగ నేర్పున మారుతి చెప్పె నిట్టులన్. 879

ఏను యమునికి వరుణుని కింద్రునికిని
దూతఁగాను కుబేర మిత్రుఁడనుగాను
విష్ణువేనిఁ బంపఁగ లేదు వినుము క్రోతి
జాతి వాఁడనె, వచ్చితిఁ గ్రోతి నగుచు. 880

రాజదర్శన మది దుర్లభము గాన
వేగ రావణుఁ గన వనిన్ విఱిచినాను
రాక్షసులు పోరు చేయుచు రాఁగ నేను
నాతనువు గావఁ జేసితి వ్రణము నిపుడు. 881

అస్త్రప్రాశాలచేత సురాసురులును
బద్ధు నను జేయఁ లేరిది బ్రహ్మవరము
రాజు గనంగ లొంగితిని నస్త్రమున కిట్లు
రాక్షసులు కొట్టఁ గంటి నస్త్రముల ముక్తి. 441

ఒక్క రాజకార్యం బది యుంటవలన
నీ సమీపమునకు వచ్చి నిలిచి యుంటి
తొరగ తేజస్వి గల రాముదూత నగుచు
వచ్చితిని ప్రభు ! నాహిత వాక్కు వినుము. 442

వ: అని చెప్పి మఱియు సత్త్వవంతుఁ డయిన వానర సత్తముఁడు మహాసత్త్వుఁడైన దశకంఠుని జూచి యర్థవంతము నవ్యగ్రము నగు వాక్యమిట్లు పలికెను. నేను సుగ్రీవుని సందేశముచే నిట్లు నీ భవనమునకు వచ్చితిని. వానరేశ్వరుడు రాక్షసేంద్రుఁడవును భ్రాతృసమానుఁడ వగు నిన్ను కుశల మడిగె. భ్రాతృ సమానుఁడు మహాత్ముఁడు నగు సుగ్రీవుని ధర్మార్థ సహితమైన యిహలోక పరలోక యుక్త మయిన వాక్యమును వినుము. రథ వారణ వాయు బలంబులు గల దశరథుం డను రాజు గలఁడు. అతఁడు లోకమునకు తండ్రివంటి బంధువు. సురేశ్వరునితో సమం బయిన ద్యుతి గలవాఁడు. అతనికి జ్యేష్ఠపుత్త్రుఁడును మహాబాహువు ప్రభువు ప్రియకరుఁడు నగు పుత్త్రుఁడు కలఁడు. తండ్రి యాజ్ఞచే బయలుదేఱి ధర్మమార్గము నాశ్రయించి సోదరుఁడైన లక్ష్మణునితోను భార్య సీతతోను మహా తేజుఁడైన యా రాముఁడును ఆమహారాజుకొడుకు దండకావనము ప్రవేశించెను. మహాత్ముఁడైన విదేహరాజు జనకుని కుమార్తె సతిని అనువర్తించిన సీత వనమున నష్టమయ్యె. అనుజునితోఁగూడ ఆరాజపుత్రుఁడు ఆ దేవిని వెదకుచు ఋష్యమూక గిరికి వచ్చి సుగ్రీవునితోఁ గలిసికొనెను. అతఁడు సీతను వెదకింతునని ప్రతిజ్ఞ చేసె. సుగ్రీవునికిఁ గూడ రామునిచే వానర రాజ్యము నివేదింపఁ బడినది. పిదప రాముఁడు యుద్ధమున రాజపుత్రుఁడు వాలిని జంపి వానర ఋక్షుల రాజ్య మందుఁ

సుగ్రీవుని స్థాపించెను. నీవు ఇదివఱకె ఎఱిఁగి యున్న వానరశ్రేష్ఠుఁ డైన వాలి యుద్ధములో రామునిచేత ఒకబాణముచేతనె చంపఁబడెను. సత్యసంగరుఁ డగు సుగ్రీవుఁడు సీతను వెదకుటకు శ్రద్ధ గలవాఁ డయి సర్వ దిక్కులకు వానరులను పంపెను. ఆ వానరులు వేలు లక్షలు సర్వదిక్కుల క్రిందికి పైకి పంపఁబడిరి. ఆవానరులలో కొందఱు గరుత్మంతుని వంటివారు. కొందఱు వాయు సమానులు. వారు నేలను అంటని గతి గలవారు. మహాబలులు, శీఘ్ర గతి గల వారు. వాయువు కన్న కొడుకైన హనుమంతు డనుపేరు గల నేను సీత కై నూఱు యోజనములు పొడవుగల సముద్రమును లంఘించి యామెను చూడఁ గోరి యిక్కడకు వచ్చి తిరుగుచు నీ గృహమున జానకిని చూచితిని. 884

ఇంక నీవో-

భువి ధర్మార్థములెల్లఁ గంటివి తపంబున్ చాలఁగాఁ జేసినాఁ
డ. వతిప్రాజ్ఞుఁడ వన్య భార్యను నిటుల్ బంధింప న్యాయుంబె ధ
ర్మ విరుద్ధం బయి బహ్వపాయ మగు మూలచ్ఛేది కృత్యంబు లి
య్యవి నిన్బోలిన బుద్ధిమంతు లిటు చేయుంబోరు సుమ్మెప్పుడున్. 885

రాముకోపముఁ బట్టి లక్ష్మణుండేయు శ
రము లోర్చు దేవాసురాళి నెవఁడు
రామునికి నపకారముచేసి సుఖపడు
వాఁడు గలఁడె త్రిభువనములందు
ధర్మార్థ సహితమై త్రైకాలిక హితమౌ
నామాటను విని జానకిని విడుము
కంటి సీతాదేవిఁ గని దుర్లభం బైన
యది కంటి, రాముఁడె యవలఁ జేయు

శోకమునఁ గుందు జానకిన్ జూచినాఁడ
తన్వి యెవరో తెలియు, నైదు తలలపాము,
దితిజ దేవు లామెను గోరి బ్రతుకఁగలరె
బహువిష యుతాన్నము తిని బ్రతుకు నెవఁడు. 886

ధృతిఘోరంపు మహాతపోవ్యధలచే దీర్ఘాయు వైశ్వర్య మొం
దితి వద్దానిని పాడుచేసి కొననౌనే యుగ్రమో చాల గొ
ప్ప తపశ్చర్యల దేవదానవుఁకున్ వధ్యుండవే గావ యీ
గతి సుగ్రీవుఁడు కాఁడు దేవుఁ డహియున్ గంధర్వుఁడున్ దైత్యుఁడున్. 887

కనుకన్ ప్రాణము లెట్లు గాచుకొన శక్యంబౌను, ధర్మంబుచే
ఘనమై వచ్చు సుఖంబ ధర్మఫలమౌ కష్టంబులే నొక్క వే
శనెగా; వింక ఫలంబొ ధర్మమునె గూడన్తోనె వెంటాడు నా
ఘన ధర్మంబో యధర్మనాశనమునే గావించుఁ జుమ్మెప్పుడున్. 888

ఇంతవఱకు పుణ్య మనుభవించినావు
ఇంక పాప ఫల మనుభవింపఁ గలవు
క్షితి నసుర వధ సుగ్రీవ మైత్రి
వాలి వధఁ దెల్పి స్వహితంబుఁ బట్టి నడుపు. 889

రథ గజ హయ యుక్తయె యైన లంకనెల్ల
నిపుడె పూర్తిగ క్షయ మొనరింపఁగలను
కాని యారామునికి నీకార్య మేమి
నిశ్చయము నిష్టమును గాదు నేర్మిఁ జూడ. 890

జనకజను హరించిన శత్రుఁ జంపెద నని
రాముఁడు కపి ఋక్షుల ముందు ప్రతినచేసె
రామునికి హాని చేసి సుత్రాముఁ డేని
క్షేమ మొందఁడు త్వాదృశున్ జెప్ప నేల 891

ఏసతిని సీతగఁ గనితి
వేసతి నీవశమునందు నిపు డుండెనొకో
ఆసతియొ సర్వలంకా
నాశిని యగు కాళనిశయె నయముగఁ గనుమీ. 892

కనుకన్ సీతా విగ్రహ
ముననుండిన కాలపాశమును నిటు నీయం
తనె మెడలోఁ దగులుచు కొని
తనరెడు నీపె నినుగూర్చి తలఁచుకొనఁదగున్. 893

ఇదె కోటల బురుజులు రా
ట్పదవులు పురి రాము కోప బాధిత మగుచున్
పదపడి సీతాతేజను
న దగ్ధ మగుచుండ నిఁక గనంబడుఁ గనుమీ. 894

హితులను సఖులను జ్ఞాతుల
సుతులను మంత్రుల సుఖముల సోదరులను నీ
సతులను లంకాపురమును
హతముం బొనరుపక యుండు మసురాధీశా. 895

అసురేశ! సత్య మగునా
యసలు పలుకు నాలకింపు నందు విశేషిం
చి సత్యరణుఁడగు రాముని
సిసలగు దాసుండఁ గపిని శ్రేష్ఠపు దూతన్. 896

స్థావర జంగమ యుతభూ
తావళి గలిగిన జగంబు లన్నిటిఁ ద్రుటిలో
వేపధుల సంహరించియు
నీవేళనె రాముఁడు సృజియింపఁగఁ జాలున్. 897

సుర గంధర్వ పతత్రి యక్ష నర రక్షో నాగ దేవేంద్ర కి
న్నర విద్యాధర సిద్ధ సంఘములలోనన్, సర్వభూతాలలో
ధరలో నెల్లెడ సర్వకాలములలోఁ దద్రాము శ్రీవిష్ణుతో
సరెయౌ విక్రమ మున్న వాని నెదురం జాలం డెవం డేనియున్. 898

నృపతి సింహుఁడు సర్వ లోకేశ్వరుండు
నైన రామునికిని విప్రియంబు చేసి
యావు బ్రదుకుట దుర్లభ, మిహ పరాల
లోక నాయకు నెదురఁ జాలుదురె యెవరు. 899

స్వయము పుట్టు చతురాస్య బ్రహ్మ గాని
మండు ముక్కంటి త్రిపురాంతకుండు గాని
ఎల్ల సురలకు విభుండు దేవేంద్రుఁ డైన
ఎవ రయిన రామవధ్యు రక్షింపలేరు. 900

అట్లు సుష్ఠుగఁ గపి చెప్ప నాలకించి
అప్రతిముఁ డప్రతిమ మప్రియాలు వినుచు
నలుకఁ గన్నులు త్రిప్పుచు హనుమ నపుడు
చంప మని యాజ్ఞ యిడె చావు మూడ. 901

అట దౌత్యంబు వహించు క్రోతివధ దుష్టాత్ముండయౌ రావణుం
డట శాసింప విభీషణుండు విని తా నంగీకృతిన్ జూప కు
త్కట కోపంబున నున్న రాక్షసవిభున్ తచ్ఛాసనంబున్ మదిన్
పటు కార్యంబును గూర్చి చూచి యెదలో భావించి లోనెంచుచున్. 902

వైరి జేతయు వాక్యవిశారదుఁడును
నగు విభీషణుఁ డన్నఁ బూజార్హు నరసి
హృది స్వకర్తవ్యమును నిశ్చయించి కొనుచు
నెంతొ హితము సామముగ వచించె నపుడు. 903

క్షమియింపు. రోషము త్యజిం
పుము, దైత్యాధిప! ప్రసాదము గని, నావా
క్యము విను ముచితానుచిత ని
జము లెఱిఁగిన సాధు నృపులు చంపరు దూతన్. ౯౦౪

ఇది నృప ధర్మ విరుద్ధం
బిది లోకాచారమునకు నేహ్యము కూడన్
మదిలోపల నీవానరు
వధ నిను బోలిన ఘనునకు పాడియె వీరా! ౯౦౫

నీవో ధర్మజ్ఞుండవు
నీవెందును రాజధర్మ నిపుణుఁడవు గదా
నీవు కృతజ్ఞుఁడవును ప
రావర విదుఁడ వెఱుఁగుదువు ప్రాణుల ప్రకృతిన్. ౯౦౬

నినుబోల్ ప్రాజ్ఞులె క్రోధం
బునకున్ వశు లయిన యెడల భువిలో నింకన్
ఘన శాస్త్ర పాండితీ గరిమ
కును ఫలమేది కేవల మది కూడ శ్రమంబే. ౯౦౭

కావున ననుగ్రహింపుమి
యో వైరిఘ్నా! దనుజేంద్ర! ఓదుర్వారా!
ఏ విధి యుక్తాయుక్తము
లీ విటఁ గని దూత దండ మిడఁగావలయున్. ౯౦౮

అని విభీషణుఁడు వచింప నాలకించి
రాక్షసేశ్వరుఁ డైన యారావణుండు
చాల రోషంబుతో గూడి స్వాంత మందు
నిట్లు ప్రత్యుత్తరంబును నిడియె నంత! ౯౦౯

పాపాత్ముని వధలోనే
పాపము నుండఁగఁ బోదు వరవీరఘ్నా!
పాపాత్ముఁ డైన వానరు
నీపట్టునఁ జంపి వైతు నిట్లే యనఁగన్. 910

పూర్ణ దోష మయి యధర్మమూల మగుచు
నార్యులును మెచ్చని పలుకు నాలకించి
బుద్ధిమంతుల లోపల ముఖ్యుఁ డైన
యావిభీషణుఁ డనెఁ బరమార్థసూక్తి. 911

రాక్షసేశ్వర! లంకాధిరాజ! నీవు
కనికరింపు ధర్మార్థ యుక్తంబ యైన
నాపలుకు విను, మెప్పుడే, నేప్రదేశ
ముందు, నేదూతయు నవధ్యుఁ డంద్రు బుధులు. 912

ఈరిపు, వనంశయంబుగ వృద్ధి చెందె
ఇతఁ డమితమైన యప్రియమే యొనర్చె
అయిన దూత యవధ్యుఁడే యనుచు సుజను
లంద్రు, దూత శిక్షలో చాల నవనిఁ గలవు. 913

విఱచుటో యవయవముల, తల
గొఱుగుటో కొరడాలచేత కొట్టుటో వాతల్
తరితరి పెట్టుటో దూతల
కిరవగు శిక్ష లనుదురు, వధించుటో వినమే. 914

మతి ధర్మార్థంబుల నే
ర్పుతి నుచితానుచితముల నెఱింగిన నినుబోల్
ధృతి యుతు లెట్టులు కోప వ
శత గాంతురు, నిగ్రహింత్రు సాత్త్వికు లలుకన్. 915

ధర్మశాస్త్రిన లోక వృత్తముల యందు
శాస్త్రమున జ్ఞానధారణ సమితులందు
నీకు సాటిగ నెవరును నిలువలేరు
నీవు నరసు రాసురలన్ శ్రేష్ఠుడవును 916

ఈ కపిని వధించుటలో
నాకెట్టి గుణంబయినఁ గనంబడ దిపుడున్
ఆ కపి నెవ్వరు పంపిరొ
యా కపిరాజు పయి వేయుమీ దండంబున్. 917

ఇతఁడు సాధు వసాధువొ యితరుచేత
నంపబడెఁ బరులకయి యస్వతంత్రు
డయి పలుకుచుండెఁ గావున నస్వతంత్రు
డగుట దూత నెప్పుడు చంప దగదు సుమ్ము. 918

ఇతడు చంపబడిన మింటనేగి తిరిగి
ఎవఁ డుదధిదాటి రిపును రావించు నితడు
అపుడు రిపువధ యెట్లగు నందు చేత
వీని వధియింపఁదగదు విద్వేషి దమన. 919

కనుక సురలు నింద్రుని నెదుర్కొనఁగఁ దగును
ఈతడు చావ రణ ప్రియుఁ! యెవడు దూత
యగును, నితని జంపఁగ ద్వారమందె యున్న
దుర్వినీతరాట్సుతుల నే దూత దెచ్చు 920

విక్రమోత్సాహ గర్విత విబుధ దైత్య
సేనలకుఁ గూడనెపుడు నిర్జింప రాని
యీవు యుద్ధావకాశంబు నెల్ల వమ్ము
పలుపదగదు సూచిత్త హర్ష ప్రదాయి. 921

హితులు శూరులు శ్రద్ధతో నెసగువారు
గుణులును కులీనులు మనస్వి కోవిదులును
శస్త్రధరులు కోట్ల కొలంది యస్త్రధరులు
కలరు నీదరి సిద్ధముగా సతంబు. 922

వారిలోఁ గొందఱను నీవు పనుపు మిపుడె
వారు వెడలి రాజసుతులఁ బట్టి తెత్తు?
మూఢులగు వారిపైని నమోఘమైన
తమ ప్రభావము చూపింపఁ దరలఁ బంపు. 923

ఇటు లపుడు విభీషణుఁడు వచింప వినియు
రాక్షస పతి రావణుఁడు సురారి బలుఁడు
బుద్ధిఁగని దేశమును గాలమును నెఱిఁగి
భ్రాతతో నీవిధంబుగఁ బలికె నపుడు. 924

బాగుగాఁ జెప్పితివి దూతవధయె నింద్య
మింక వధకంటె వేఱె గావింపవలయు
కపులకో తోక ప్రియము యోగ్యంపు భూష
కనుక దానిఁ గాల్చియె గెంటి యనుపుఁ డితని! 925

అంగవికలతన్ జిక్కి దైన్యంబు గనిన
కపిని జ్ఞాతి మిత్రాప్తులు గాంచుచుండ
తోక యంటించి ప్రతివీధి తొరగ పురిని
త్రిప్పుదురుగాక యని యాన తిచ్చెఁ బ్రభువు. 926

వ. అంతట రాక్షసులు తమ ప్రభువు శాసనము విని కోపముచేఁ జిక్కిన వారై చిఱిగిన గుడ్డపీలికలను ఆ హనుమంతుని తోకకుఁ జుట్టిరి. అపు డాతోక ఎండు కట్టెను పొంది యగ్నివలె గుడ్డలు చుట్టినకొలది నూరక పెరుగ సాగినది.

అంత వారు ఆ తోకమీద నూనె పోసి దానిపై నిప్పువైచిరి. అపుడు హనుమంతుండు మండిన తోకతో ఆ రాక్షసులను బడఁగొట్టి రోషముతో నిండి లేత సూర్యునివలెఁ బ్రకాశించుచుండె. పిదప మండుచున్న తోక గల యా వానరుని చూచుటకు సంతోషముతో స్త్రీలు బాలురు వృద్ధులు ప్రోగులయి చూడదొడగిరి. ఆ హనుమంతుఁడు మరల కలసి వచ్చిన క్రూరరాక్షసులచే బంధింపఁబడి యా కాలమునకుఁ దగునట్లు ఇట్లు తలఁచెను. 927

అసురుల్ నన్నిటు కట్టి వైచినను నావంతైన నన్నావలే
రస లీ త్రాళ్ళను త్రెంపివైచి మఱి దైత్యాళిన్ వధింపంగలన్
దశకంఠాజ్ఞను వీరు రాముని హితార్థంబై విజృంభించు న
న్నుసరే కట్టిరి దీనిచేఁ గలుగ దెందున్ హాని నాకింతయున్. 928

ఇట నేనందఱ కాజిఁ జాలుదును గానీ రాము ప్రీత్యర్థమై
యిటు లీ రాక్షసు లేమి చేసినను నేనెల్లన్ మదిన్ సైతు నిం
కిట లంకన్ మరలన్ జరింపవలె రేయిన్ నేను వీక్షింప లే
దిట దుర్గంబున నెట్టిరీతి గలదో యెట్టుల్ రచింపం బడెన్. 929

వవ లీలంక యవశ్యమే కనఁదగున్, బంధించి నాతోక నె
క్కువగాఁ గాల్చిన గాల్తురిగాక వ్యధ చేకూర్తురిని చేకూర్తురిగా
క వెసన్ జూచెద లంక నాకు శ్రమమే కన్పట్ట దంచున్, గరం
బవలోకించి రహస్య మానసముతో నల్లాడు నా మారుతిన్. 930

దివిజుల్ హర్షముతోడఁ బట్టుకొని యెంతే శంఖ భేరీ స్వనం
బఱిగా మ్రోయఁగఁ జప్పటుల్ చఱచి సింహధ్వానముల్ చేయుచున్
ప్రతివీధిన్ బురి ఘోష పెట్టుచును త్రిప్పన్ వాయుజుం డంతటన్
మతి సౌఖ్యానఁ జరించుచున్ గనియె నమ్మో సర్వలంకాపురిన్. 931

పలుమేడల్ పలువీధులున్ సదన సంబాధాలు శృంగాట కం
బులు పల్ సందులు గొందులున్ పురవనంబుల్ మబ్బుబోల్ సౌధపం
క్తులు వాతాత్మజుఁ డంతఁ జూచుచు వడిం దోతేర నవ్వేళ దై
త్యులు గగ్గొం డిది గూఢ చారి యని యెంతో పెట్టి రుద్ఘోషముల్. 932

అటు లావింతను జూడఁ గౌతుకముతో నాబాలగోపాలమున్
అటకున్ వచ్చియుఁ దోక కాలు హనుమన్ హర్షంబుతోఁ జూడ నం
తట వేగంబ విరూప నేత్ర లగు దైత్యస్త్రీలు నాదేవి క
చ్చట నాయప్రియవార్త చెప్పి రిటులన్ క్ష్మాపుత్రి చింతిల్లఁగన్. 933

వ. ఓ సీతా ! నీవెవ్వనితో సంభాషించితివో యా యెఱ్ఱని ముఖము గల క్రోతికి తోక యంటించి యిదిగో వీధివీధులఁ దిప్పఁబడుచున్నాఁడు" అని. అపుడాసీత ఆవాక్కు విని చిత్తము సెత్తుకొని పోయినట్లయి శోకముచే తపించుచు నా యగ్ని హోత్రుని ధ్యానించి నా హనుమంతునికి మంగళము గావింపఁగోరి నియమము పూని యగ్నిని సేవించి యిట్లు ప్రార్థించెను. 934

నేను పతిని శ్రద్ధపూని కొల్చెద నేని
యెంతొ తపమును గావింతు నేని
నేను పతివ్రతనై నిల్చెదనేని
నాపైఁ బ్రియుడు జాలి చూపునేని
వినుత శీలఁ బ్రియేష్ట నని కపి కనునేని
మద్భాగ్య శేషంబు మసలె నేని
సత్యసంగరుఁడౌచు సరగ దుఃఖ జలధిన్
సుగ్రీవుఁడిఁక దాటఁ జూచు నేని

అగ్నిదేవ! హనుమకు శైత్యంబు గూర్చు
మనుచు సీత ప్రార్థన చేయ నగ్ని హనుమ
కాక్షణమశుభమునకై ప్రదక్షిణముగ
మండె హనుమ తండ్రియు దేవి మనవి వినియె. 935

అంత శ్రీమంతుఁ డైనట్టి యంగదుండు
ఎల్ల సురలతోఁ గూడిన యింద్రుఁ డట్లు
సకల వానరులతో సంతసమునఁ
గొలువఁ బడుచుఁ గూర్చుండెను గుతుక మొప్ప. 1014

అపుడు కీర్తిమంతుఁడె యైన యనిలజుండు
అంగదముల నొకు యశస్వి యంగదుండు
ఉల్ల మలరఁగఁ గూర్చుండ నున్నతమగు
నాగిరివరంబు శ్రీలతో నలరి వెలిఁగె. 1015

అతిగఁ బ్రీతితో ముద మొందు హనుమఁ గాంచి
పరమగు ప్రీతి గల జాంబవంతుఁ డడిగె
"దేవి నెట్లు చూచితి వెటు దేవి యుండె
దేవియెడ నెటుండెను క్రూరరావణుండు. 1016

సరిగ నిది యెల్లఁ జెప్పుము వరకపీంద్ర
సరిగ గ్రహియించి కార్యనిశ్చయము చేతు
మెట్టి యర్ధ మటుఁ జని కావింపవలెనొ
యేది కావలెనొ యది యీవ తెలుపు. 1017

వాయు పుత్రుఁ డటుల జాంబవంతుని చేత
తగ నియుక్తుఁడై యొడలెల్ల గగురుపాటు
కలుగ దేవి సీతకు నంత తలను వంచి
ప్రణతి చేసి యీరీతిగ వాక్కు పలికె. 1018

మీర లందరు కనుచుండ మింటిపైకి
అతిగ నెగిరితి ఆ మహేంద్రాది నుండి
వారినిధి దక్షిణతటంబు త్వరగ నేను
తగిన శ్రద్ధతో నప్పుడె దాటగోరి. 1019

వింటిఁ జనుచుండ ఘోరమౌ విఘ్న మొదవె
కడు మనసు లాగు కనకశృంగంబు కంటి
అది పథమును నడ్డిన విఘ్నమట్లు తోచె
దారి దరిఁజేరి ఛేదింపఁ దలచినాను 1020

రవిని బోలిన యాశిఖరమును నేను
తోకచే గొట్టివేయుగా దొరగఁ జీలె
నాదు పూనిక గని మహానగము పలికె
మదికి ముదమిడ సుత! యని మధురవాక్కు. 1(21

నే ననిల సఖుడఁ బితంద్రిగ నెఱుంగు
నన్ను మైనాకు డంద్రు సంద్రమున నుందు
నాయన! మును తెక్కలుండె నగములకును
ఇవ్వి భువినెల్ల బాధించి స్వేచ్ఛఁ దిరుగు 1022

ఈ గిరుల సంగతి విని దేవేంద్రు డపుడు
వీని తెక్కలు గొట్టి వజ్రాన నలిగి
యట మహాత్ముడో నీతంద్రి యనిలు డింక
నన్ను విడిపించి వైచె సంద్రమున వత్స! 1023

రామునికి సాయమే నొనర్పంగవలయు
రాముడు నరధార్మికుఁ డింద్రసమబలుండు
అని మహాత్ముడో మైనాకుఁ డనిన నుడులు
విని యంతనికిఁ గార్యము దెల్పి వెడలినాను. 1024

ఆ మహాత్ముఁడో మైనాకుఁ డనుమతించి
మానుష శరీరమున వేగ మాయ మగుచు
శైల రూపము తోడను సంద్రమందు
కలియు నేవేగ కడమ మార్గమునఁ జనితి. 1025

అవల నాగమాత సురస నరయు నామె
జలధి మధ్యను నా తోడఁ బలికె నిట్లు
అమరులో నాకు నిన్ను భక్ష్యముగఁ జూపి
రందుచే తిందు నిను, నేటి కరయఁబడితి. 1026

అని సురస పల్క ప్రాంజలి నగుచు మొగము
వెలవెలగఁ బోవ నీరీతిఁ బలికినాను
దాశరథియు శ్రీరాముఁడౌ దండ కలకు
భ్రాత సౌమిత్రి సతి సీతరాగ వచ్చె. 1027

ఆ దురాత్ముఁడో రావణు డతని భార్య
నపహరింపఁగ రాముని యాజ్ఞవలన
ఆమె దరికి దూతగఁ బోదు రామునకును
నిప్పుడే స్వదేశమున సాయమీవు కమ్ము. 1028

పోని సీతను, సెవ్వరిసై నఁగాని
కష్టపెట్టని రాముని గాంచి నీదు
వదనముం జొత్తు సత్యము ప్రతిన యిదియె
పలువు చుంటి ననుచుఁ బల్కఁ బలికె సరస. 1029

ఎవ్వఁడును నన్ను దాటి పోఁ డిదియె వరము
అని సురస పల్కఁ గపి పదియామడలును
ఇంకఁ గొంత దాటెద నని యెంతొ పెరుగ
దీనికిఁ దగినట్టులు నోరు తెఱచె నామె. 1030

అట్లు తెఱచిన వదనంబు నరసి నేను
అపుడు బొటన వ్రేలంత చిన్నగుచు నామె
నోటఁ బడి వేగ వెడల నానోటినుండి
అప్పు డాదేవి తనరూప మంది యనియె. 1031

వానర శ్రేష్ఠ! సౌమ్య! నీపనియుఁ దీఱ
హాయిగాఁ బోయియు మహాత్ముడైన రాము
తొరగ సీత నోదార్చు, తోడ్తోడఁ బొమ్ము
ఓపృథుభుజ: నీయెడఁ బ్రీతి నొందినాను. 1032

వ. అంత.

మేలు మేలని సర్వభూతాలు మెచ్చ
గరుడునివలె విశాల మౌగగన సీమ
నెగిరితిని, నాదు నీడ గ్రహింపబడియె
నైన నేనది యెఱుఁగ నాపంతగూడ. 1033

ప్రథిత వేగుఁడ నగు నేను పదియు దిశలు
చూచి నాగతి యడ్డిన చొప్పు తెలియ
అవుడు నాగమనము మింట నడ్డె నేల
యనుచు రూప మేది గనక యతనిఁ గంటి. 1034

అపుడు క్రిందిభాగంబున నరయ నచట
జలమున భయంకరియగు రాక్షసిని గాంచి
యపుడు నగి భీమరాక్షసి స్థిరంబైన భ్రాంతి
లేని యప్రియ వాక్కు లీరీతిఁ బలికె. 1035

ఓమహాకాయ! యిటు పోవ నుంటి వెటకు
ఆఁకలి గొను నాకిపుడు భక్ష్యంబు వలయు
చిరమునుండి తిండియె లేక వఱలుచున్న
నాశరీరమునకుఁ దృప్తి నయతఁ గూర్చుఁ. 1036

అనఁగ సరె యని యామె వాక్కును దలంచి
యామె నోరుపట్టని యట్టు లతితఁ బెరుగ
ఆమె నను మ్రింగ నోరును నతిగఁ బెంచె
నావికృతి సరిగ దెలియన్ జాల దామె. 1037

వ. అపుడు "రాక్షసి సింహిక వేగముగా హనుమంతునిచేఁ జంపబడిన దని సిద్ధచారణులు చెప్పుకొనుచుండ వింటిని. అంత ఆమెను జంపి మరల నాతొందర పనిని తలఁచుకొని పర్వతములతో నందమైన చాలదూరమును దాఁటి లంకాపట్టన మున్న సముద్రదక్షిణ తీరమును చూచితిని. అపుడు సూర్యు డస్తమించువేళ భీమవిక్రము లైన రాక్షసులకుఁ గనఁబడకుండ రాక్షసుల పట్టణము ప్రవేశింప అక్కడ కల్పాంత మేఘమువంటి యొక స్త్రీ యట్టహాసముచేయుచు నన్నుఁ జంపఁ గోరి రాఁగా మండుచున్న యగ్ని శిఖలవంటి వెండ్రుకలు గలిగి భీకర మైన యామెను ముష్టి ప్రహారంబుచేత పీడింప భీతురాలయి ఆమె యిట్లనె. ఓవానరా! నేను లంకాపురదేవతను నీవిక్రముచే జయింపఁ బడితిని కనుక నీవింక సర్వరాక్షసులను జయింపఁగలవు" అని. అపుడక్కడ సీతకై రాత్రి యంతయు పెదకుచు రావణుని యంతఃపురములోఁ గూడ ఆసుమధ్యమను చూడ నైతిని. అక్కడ రావణుని యింట సీతను జూడక శోక సముద్రమునఁబడి పారమొందక విచారించుచుండ దూరమున బంగారపుఁ బ్రాకారముతోఁ గూడిన గృహోపవనమును చూచితిని. అపుడా ప్రాకారము దాఁటి అశోకవన మధ్య మున్న యొక గొప్ప శింశుపావృక్షము నెక్కి బంగారు కదళీ వనమును గాంచితిని. అందుండి యొక స్త్రీని చూచితిని. 108

నడి జవ్వనము మీఱు నళిన దళాక్షిని
ఉపవాసములఁ జిక్కియున్నదాని
ధూళిఁ బాడగు జుట్టుచేల మొక్కటె గల్గి
బాధచే దీనయౌ భర్తృ హితను
పలలంబు తిను నాడుపులులందు మృగివోలె
రాక్షస స్త్రీమధ్యఁ గ్రాలుదాని
ఏకవేణిని దాల్చి యిలఁబండి హిమమునఁ
గమ్మలినిపలెై వాడు తనువు దాని

భర్తనే తలపోయుచు వగచుదాని
దనుజ కాంతలు భయపెట్ట వణఁకు దాని
రావణున్ ద్రోచి మదిఁ జావఁ బోవుదాని
హరిణ శాబాక్షి నెటొ సీత నరసినాఁడ. 1039

అట్టి రామపత్నిని యశంబలరుదాని
నరసి శింశుపాతరువందె యణఁగియుంటి
అపుడు గలగలమని గభీరాధిక మగు
నగలధ్వని వింటి రావణు నగరునుండి. 1040

పిదప నేను మిక్కిలిగ నుద్వేగమొంది
సరిగ నాస్వరూపము నుపసంహరించి
వెంటనే యట శింశుపావృక్షమందు
నాకసంబున పక్షి య ట్లణఁగియుంటి. 1041

ఘనబలుఁడు రావణుఁడును రావణుని సతులు
సీత యున్న చోటికిని వచ్చిరి రయంబ
అప్పు డాసీత రావణు నరసి తొడలు
ముడిచి చనులు బాహులఁ గప్పి వడఁకిపోయె. 1042

అటుల ముడిచి కూర్చుండి యట్టటులుగనుచు
సుంత మాత్రము రక్షణ చూడఁకుండి
ఎంతొ దీనురా లగుచుఁ గంపించి పోవు
వ్యధిత సీతను గాంచి రావణుఁడు పలికె. 1043

నేను తలక్రిందుఁ బడితి మన్నించు మన్న
రెచ్చి దర్పాన నను నీవు మెచ్చవేని
ఇదిగొ రెండునెలల గడు విచ్చుచుంటి
దాని పయి సీత! నీనెత్తురు త్రాగఁ గలను! 1044

అని దుష్టాత్ముఁడు రావణుం డనంగఁ గ్రోధావిష్టయై సీత యి
ట్లనె నర్థంబుగ; రాక్షసాధమ! యహో రాజస్వియౌ రాము భా
ర్యను, నిక్ష్వాకు కులేశుఁడౌ దశరథజ్యానాథు జ్యేష్ఠస్నుషన్
నను నీవిట్లనరాని మాట లన నీనాల్కేటికిన్ రాలదో. 1045

పతి లేనప్పుడు, నామహాత్ము నయుచాధ్వం బీవు తప్పించి ఆ
గతి, హాహా! నను నీవు దొంగిలితివే యిట్టి నీవీర్యమున్
ధృతి యేపాటిది, రాముసాటియును నా,వీ రాము దాస్యంబు స
ల్పి తరింపంగ నరాధమా! యోగ్యుఁడవు నెట్లేన్గావు యోచింపుమీ. 1046

స. రఘు రాముండు సత్యవాది సమరమును శ్లాఘించు వాఁడు యుక్తియుఁడు అని సీత పరుషంబుగా మాటాడ దశకంఠుడు చితాగ్నివలె గోపమున మండి క్రూరముగు కండ్లు త్రిప్పి కుడి గుప్పిడి యెత్తి మైథిలిని జంపరాఁగా నక్కడి స్త్రీలు హాహాకారము చేసిరి. అంత స్త్రీల మధ్యనుండి ఎగిరి పడి వచ్చి యా మహాత్ముని భార్యయగు మందోదరి మదనపీడితుఁడైన యతనితో మధుర వాక్కులాడి మహేంద్రపరాక్రమా! నీకు సీతతో పనేమి దేవగంధర్వకన్యలతోను రాక్షసకన్యలతోను విహరింపుము సీతతో పనేమి అని చెప్పివారించి తనభవనమునకు, దీసికొని పొవ్వఁగా అంత వికృతముఖము గల స్త్రీలు క్రూర దారుణ వాక్యములతో సీతను బెదరించిరి. అపుడు సీత వారిమాటలు వారిగర్జితములు తృణమువలె లెక్కచేయక పోవుటచే నిరర్థకములయ్యె అపుడు వారిగర్జితములు చేష్టలు వ్యర్థము కాఁగా ఆ మాంస భక్షణలగు రాక్షసస్త్రీలు సీత పట్టుదలను రావణునికి నివేదించిరి. ఇంక వారుచేయునదిలేక బెదిరింపులుమాని ఆమెచుట్టుబడి నిరాశలై నిద్రావశమై పడిరి. అట్లు వారు నిద్రావశలు కాఁగా భర్తృ హితరతురాలగు సీత దీనముగా విలపించి దుఃఖించెను. అపుడు వారిమధ్యనుండి త్రిజట అనునామె లేచి యిట్లనెను. 1047

* మందోదరి = మందమైన చిన్న యుదరముగలది. మొదట ధాన్యమాలిని తీసికొనిపోయినట్లున్నది. చిన్న యుదరము గల ధాన్యమాలికి విశేషణ గ్రహింపవలెను.

అంతగఁ దినవలయును నెడ న
మాంతముగ వనార్యులార ! మఱి నను దినఁడీ
ఇంతి దశరథు ప్రియస్నుష
నింతటి జనకజను మాత్ర మింక దినకుండీ. 1043

తిలకించితి నొక ఘోరపుఁ
గల యది గగురుపాటు కడుఁ గలిగించెన్
కల యది రాక్షస నాశము
వెలంది జానకి పతికిని విజయమె తెలుపున్. 1044

వ. ఈమెయె రామునినుండి రాక్షసగణమును రక్షింపఁగలదు. ఇప్పుడు
మనము సీతను ప్రార్థింతము అని. నాకిదియే తోఁచుచున్నది. 1049

వ్యధిత యయిన యెవ్వతెఁ గూర్చి స్వప్న మరసి
తామె పలువ్యథల్ చన పొందె నమిత సుఖము
అట్టి సీత ప్రమొక్కఁ బ్రసన్నురాలె యగును
నాన గల యామె యలరి మీకామె శరణు. 1050

అట్టి సీత దారుణదశ నరసి విక్ర
మించి యెంచ నామనసు నిర్వృతిని పొందె
సీతతో మాటలాడు టెట్లని తలంచి
మొదలు పెట్టితి నిక్ష్వాకు పూర్వచరిత. 1051

రాజ ఋషి గణార్చితమైన ప్రథిత వాక్కు
దేవి విని యశ్రువులు కండ్ల దృష్టి నాప
పలికె నెవ్వఁడ విట కెట్లు వచ్చినావు
కపివరా ! రాముతో నెట్లు కలిగెఁ బ్రీతి. 1052

అనుచు నన సీత నేనిట్టులంటి నపుడు
దేవి ! నీపతికి సహాయుండై వెలుంగు
భీమబలుండు సుగ్రీవుండు విక్రమాఢ్యుం
డతని భృత్యుండ హనుమంతుం డనెడివాండ. 1053

ఎవరిం గష్టపెట్టని కర్మ సెసంగు నీదు
భర్త రాముం డంపంగ నిట్లు వచ్చినాండ
ఇదిగో నీయుంగరము శ్రీల సెసంగు దశర
థాత్మజుండు నీకిడియె నిట్టి యానవాలు. 1054

కనుక దేవి ! నీయాజ్ఞ గైకొని యెదియొన
రింతు, రాములక్ష్మణు దరి కేను నిన్ను
తీసికొని పోదునా నేండె తెలుపు మనంగ
నను గొనుత రాఘవుండు రావణునిజంపి. 1055

అని యాసీత వచింప దేవికిని సాష్టాంగ ప్రణామంబు నొ
య్యనం గావించి ముదంబు రామునికి నీయుంజాలు నేయానవా
లును గానీ యిడు" మంచుం గోరగనె వాక్రుచ్చెన్ వడిన్ సీత "దీ
నిని గైకొమ్మిది యుత్తమంబు, పతి దీనిన్ జూచి నిన్ మెచ్చెడున్. 1056

అని యాశ్చర్యకరంబ యౌమణిని నాకర్పించి యుద్వేగమున్
గని సందేశము దెల్ప నేనింక నమస్కారంబుం జుట్టున్ ప్రద
క్షిణమున్ జేయంగ నామె నిశ్చయముగాం జెప్పెన్ మరుత్సాత ! రా
మునికిన్ జెప్పి కపీంద్రుతో ననుజులన్ మున్ముందె పంపించుమీ. 1057

ఇట్టుగా దేనియు నివ్వి రెండునెలలే యౌనింక నాజీవితం
బిట నేదిక్కునులేక చావంగం గనండింకన్ ననున్ రాముం డం
ఛిటులన్ జాలిగ సీత చెప్ప విని నేనెంతో మదిన్ మండి పి
మ్మట నిద్దానికి నుత్తరంబుగ నింకం బాటించితిన్ గార్యమున్. 1058

తనువున్ శైలమువోలెఁ బెంచి కడు యుద్ధంబున్మదిన్గోరి యా
వనమున్ భగ్నము చేయసాగిన నటన్ భ్రాంతిల్లి వక్షుల్ మృగా
లును పాఱన్ వికృతాస్య రాక్షసనతుల్ ముందున్ ననుంజూచి వెం
టనె యారావణుఁజేరి చెప్పి రిటులన్ రక్షోజనాధ్యక్షుతో. 1059

వ. "రాజా! దుర్గమమైన నీవనమును దురాత్ముఁడైన వానరుఁడు నీవీర్యము నీమహాబల మెట్టిదో తెలియక విఱుగ గొట్టె. రాజేంద్ర! అ ప్రియము గావించిన యాదుర్బుద్ధి వానరుఁడు నశింప వానిని వధింప త్వరగా నాజ్ఞాపింపుము" అని. అపుడు రాక్షసేంద్రుఁడు ఆ పలు కాలకించి మిక్కిలి దుర్జయులైన హితులైన కింకరు లనువారిని పంపెను. అపుడు అట్లు వచ్చిన శూలముద్గర పాణులైన యెనుబది వేలమందిని అవనప్రదేశములోనే పరిఘతోఁ జావ మోదితిని. పిదపఁ జావఁగా మిగిలిన వారు పోయి సైన్య మంతయు నిహతమైనట్లు చెప్పిరి. అంత నాకు బుద్ధిపుట్టి చైత్య ప్రాసాదము నాక్రమించి యక్కడి నూర్గురు రాక్షసులను జంపి స్తంభముతోనే లంకకు అలంకార భూత మైన యాచైత్య ప్రాసాదమును ధ్వంస మొనర్చి రావణుఁ డాదేశించిన రణ కోవిదుఁడైన ప్రహస్తసుతుని జంబుమాలిని ఘోర రూపులును భయానకులు నైన బహురాక్షసులతో పాటు అతి ఘోర మగు పరిఘతో నలిపివైచితిని.

అది విని రాక్షసేశ్వరుఁడు మహాబలు లైన మంత్రి పుత్రులను పదాతి బలము పంపె. అపుడు నేను వారిని చూచి యందఱను పరిఘతో యమునిం టికిఁ బంపితిని. అది విని రావణుఁడు యుద్ధమున లఘువిక్రములును శూరు లును నగు సేనాపతులను పంపఁగా వారినందఱను సైన్యములతోఁ జంపివైచి తిని. అంత దశగ్రీవుఁడు మహాబలుఁడైన యక్షకుమారుని అనేక రాక్షసులతోఁ గూడఁబంపెను. పిదప రణపండితుఁడును మండోదరి పుత్రుఁడు నగు నక్షకుమా రుఁడు చర్మాసియై ఆకాశమున కెగురఁగా పాదములు పట్టుకొని నూరుసార్లు త్రిప్పి పిండి చేసివైచితి. అంత అక్షకుమారుఁడుపచ్చి భగ్నుఁ డగుట విని దశాననుఁడు రెండవ వాఁడుగా వచ్చిన కుమారుఁ డైన యుద్ధదుర్మదుఁ డైన యింద్రజిత్తును కోపించి పంపెను. నేను వాని బలము నంతను, ఆ రాక్షస

శ్రేష్ఠుని నన్ను జూచి నన్ను గలుగునట్లుచేసి ఎక్కువ యానంద మొందితిని. ఆ మహా బలుఁడును మహాబాహువు నగు ఇంద్రజిత్తు నందలి నమ్మకముతో మదోత్కటులైన శూరులను సాయ మిచ్చి రావణుఁడు పంపె. నేను స్థైవరాని వాఁడ ననియు తన బలము మర్దింపబడిన దనియుఁ దెలిసికొని మిగుల వేగము గలవాఁ డయి బ్రహ్మాస్త్రముతో నన్ను బంధించె. పిదప రాక్షసులు నన్ను త్రాళ్ళతోఁ గట్టి రావణుని సమీపమునకుఁ దీసికొని వెళ్ళిరి.

అంత నేను దురాత్ముఁడగు రావణునితో సంభాషించితిని. లంక లోనికి వచ్చుటను గురించి రాక్షసుల వధను గురించి నన్ను అడుగ నేను ఇదంతయు సీత కొఱకే యని యంటిని. ఓ విభూ! సీతను జూడఁ గోరి నీభవనము ప్రవేశించితిని. మారుతుని కన్న కొడుకగు వానరుడను. నాపేరు హనుమంతుఁడు నేనురాముని దూత నని తెలిసికొనుము. సుగ్రీవునిమంత్రిని రాముని దౌత్యము నకై నీదరికి వచ్చితిని. మహాతేజుఁడైన సుగ్రీవుఁడు నిన్ను క్షేమమడిగెను ధర్మార్థకామ సహితమైన హితమును పథ్యమునైనవాక్కు పలికెను. విశాల ద్రుమములు గల ఋశ్య మూక పర్వతమున నేను వసించుచుండఁగా రణ విక్రాంతుఁడైన రాముఁడు వచ్చి స్నేహితుఁడయ్యెను. నాభార్యను రాక్షసుఁడు అపహరించెను. మాకు అన్నివిధముల నీవు సాయము చేయవలయు నని యాతఁడనియె. వాలిని జంపుటలో మాకు సాయము చేయుదగుదువు. ఇందుకై శపథము చేయు మని యంటిని. అపు డతఁడు వాలిచే నపహరింపఁబడిన రాజ్యము గల సుగ్రీవునితో ఆ మహాప్రభువైన రాముఁడు లక్ష్మణునితో పాటు అగ్ని సాక్షికముగా స్నేహము చేసికొనెను. అతఁడు పిదప ఒకే బాణముచే యుద్ధములో వాలిని జంపి వైచి ఆసుగ్రీవుని వానరులకు రాజుగా చేసెను. అతనికి సర్వవిధముల సాయము చేయవలసి యున్నది. కనుక ధర్మమును బట్టి అతఁడు మీ సమీపమునకుఁ బంపెను. వీరులైన వానరులు నీబలమును త్రొక్కివైచు లోపలనే నీవు సీతను దీసికొని వచ్చి రాముని క్షమ్మింపుము. పిలువఁబడి దేవతల దగ్గఱకు గూడ పోవు వానరుల ప్రభావమును ఇదివఱ కెవరును ఎఱుఁగరు" అని వానరాధిపతి నిన్ను గూర్చి పలికినది నేను నీకుఁజెప్పితిని. అపు డతఁడు కంటితోఁ దగులఁ బెట్టు వాఁడువలె నన్ను చూచెను. రౌద్ర కర్ముఁడును దురాత్ముఁడు నగు రావణుఁడు నాప్రభావము నెఱుఁగక నన్ను జంప

నాజ్ఞాపించెను. అపుడు మహామతియైన యతని సోదరుఁడు విభీషణుఁడు ఆ రాక్షసరాజు నిట్లు నాకై ప్రార్థించెను. రాక్షసశార్దూల! ఇట్లు చేయరాదు. ఈ నిశ్చయము మానుము. రాజ శాస్త్ర విరుద్ధ మగు మార్గమును నీవు సేవించు చున్నావు. దూతవధను ఎక్కడ రాజశాస్త్రములందుఁ జూడము. హిత వాది యైన దూతవలన యదార్థ విషయము తెలిసికొనఁ దగును. అతుల విక్రమా! దూత మహాపరాధము చేసినను వానిని వికారుఁగా జేయుటయే గాని వధయెక్క డను శాస్త్రప్రకారము చేయరాదు అని విభీషణుఁ డిట్లు చెప్పగా" వీనితోకను అంటింపుడు అని రావణుఁడు రాక్షసుల కాజ్ఞాపించెను పిదప వాని మాటను విని రాక్షసులు జనపనార బట్టలను చిరిగిన నూలువస్త్రములను నాతోకకుఁ జుట్టిరి పిదప సిద్ధ సన్నాహులై చండ విక్రములగు రాక్షసులు వలుపాశములచే రాక్ష సులు కట్టిన నన్ను కఱ్ఱలతోడను పిడికిళ్ళతోను గొట్టుచు నాతోకకు నిప్పుఅంటిం చిరి. పిదప శూరులైన ఆరాక్షసులు కట్టఁబడి యగ్ని ముట్టించిన నన్ను రాజ మార్గమునకు తీసికొని వచ్చి వారు నగర ద్వారము దగ్గఱ ఘోషించిరి. అపుడు నేను నా బృహద్రూపమును సంక్షేపించి ఆ బంధమును విడిపించుకొని మరల నాప్రకృతియందుండి ఇనుప పరిఘనుతీసికొని ఆ రాక్షసులను పిండిచేసి వైచితిని. పిదప వేగముగా ఆనగర ద్వారమునకెగిరి, మండు చున్న తోకతో కంగారుపడక చూరులు వరాండాలుగల ఆపట్టనమును యుగాంతాగ్ని ప్రజలను వలె దగులఁబెట్టితిని. జానకి స్ఫుటముగాఁ దగులఁబడి యుండును. లంకలో దగ్ధము కాని ప్రదేశ మేదియు లేదు. పుర మంతయు భస్మమై పోయినది. లంకను తగులఁ బెట్టుచుండ సీత దగ్ధమై యుండును సంశయము లేదు నేనీ రాముని కార్యమంతయు వ్యర్థము చేసి వైచితిని. అని తలప ఇంతలో "జానకి తగులఁబడలేదు. అని ఆశ్చర్యోదంతము గల శుభాక్షరములు గలుగు భాషిత మును చారణుల నుండి వింటిని. పిదప ఆయద్భుత వాక్యను వినఁగా నాకిట్లు బుద్ధి పుట్టినది. నిజానికి దగ్ధకాలేదని యాశుభనిమిత్తముల వల్లఁ దెలిసికొంటిని. తోక కాలుచున్నప్పుడైతే నిప్పు నన్నుఁ గాల్చుటలేదు. హృదయము సంతోష ముతో నున్నది. గాలులు పరిమళము వెదజల్లు చున్నట్లు కనిపించు చున్న ప్రయోజనములు గల నిమిత్తములచేతను, సిద్ధార్థములైన ఋషివాక్యముల చేతను హృష్టచిత్తుఁడనైతిని మరల సీతను జూచి మరల నామెచే మరల

సెలవు పొంది యరిష్టాద్రిసెక్కి మిమ్ముఁ జూచుకోరికతో ప్రతి ప్రయాణమును సాగించితిని. పిదప గాలి చంద్రుఁడు సూర్యుఁడు సిద్ధులు గంధర్వులు మొద లగు వారిచే సేవింపఁ బడిన మార్గమును పట్టి యిట్లె మిమ్ములఁ జూచితిని. రాముని ప్రభావము చేతను మీతేజస్సుచేతను సుగ్రీవుని కార్యమునకై నేనంతను పూర్తిచేసితిని. నేను కూడ సరిగా నిది యంతయుఁ జేసితిని ఇంకఁ జేయవలసిన మిగిలిన పని యంతయు మీరే జేయుదురు గాక" అని. 1056

ఇటు సర్వంబు వచించి వాయుతనయుం డింకన్ విశేషించి చె
ప్పుట కీరీతి నుపక్రమించె; సఫలంబుల్ రాము యత్నంబు న
చ్చటి సుగ్రీవుని సంభ్రమంబు జనకక్ష్మాధీశు సత్పుత్త్రి యు
త్కట సచ్ఛీలముఁ జూచి నాదుమనసున్ దద్వశ్యమయ్యెం గదా. 1057

అతి గా వర్ధిలి సర్వదైత్య విభుఁడౌ నారావణుండున్ తపః
ప్రవతతిన్ లోకములన్ ధరించు, నలుకన్ భస్మంబుగాఁ గూడఁ జే
సి తపింపఁ గలఁడిందుచే జనకజన్ జేఁదాకియున్ దత్త పో
ప్రవతతిన్ తత్తనువున్ నశింపకయె యీ లాగుండె నీ రాతికిన్. 1058

ఎది యీజానకి క్రోధతప్తయయి యిట్టే తాకి గావించునో
యది యగ్నిచ్చట కూడఁ జేయఁ గలదే యీ జాంబవన్ముఖ్య భ
ద్రద సర్వప్లవ గోత్తమానుమతితో వర్తిల్లి మీకెల్లఁ జె
ల్పి దగన్ జానకితో నృపాత్మజుల దర్శింపంగ న్యాయంబగున్ 1063

లంకా పట్టణ మెల్ల రాక్షసుల శీఘ్రంబిట్టె కూలంగ ని
శ్శంకన్ రావణు శూరు నొంటి నయియున్ జంపంగ శక్తుండనే
ఇంకన్ నేర్చిన వీరులున్ బలియురై యేపారు మీవంటి శౌ
ర్యాంకోద్గ్రాత్మ జయైషులన్ గలియనేలా నేడు చెప్పన్ వలెన్ 1064

భట సేనా సహితంబుగా స్వతనయ భ్రాతృప్రాప్త యుక్తంబుగా
నిట నా రావణుఁ జంపఁ జాలుదును, నిక్లే బ్రాహ్మ మైంద్రంబు ను
త్కట వాయువ్యము వారుణంబు నిక రౌద్రంబాదులౌ శక్ర జి
త్పటు శస్త్రంబులు మున్నిరీక్ష మయినన్ తచ్ఛస్త్రముల్ గూల్చెదన్ 1065

అసురాళిన్ బడఁ జంపువాడ భవదీయాదేశమున్ బట్టి నా
యసమంబైన పరాక్రమం బతని వౌ ప్రాణంబులన్ దీయు, నే
నస లట్లేసిన శైలవర్ష మతులంబై దేవులంగూడ జం
పు సరే దైత్యులఁ జంపు నంచు నిక నిప్డున్ జెప్పగా నేటికిన్. 1066

తల్లిగట్టును సంద్రంబు దాటుగాక
భువిని మందరగిరి యూగి పోవుఁ గాక
జాంబవంతుని సంగరక్ష్మా తలాన
శత్రు సైన్యము కదలింపఁ జాల దింక 1067

సర్వ రాక్షస తతిఁ బూర్వు లేరుండిరో
వారిఁ జంపును నొక్క వాలిసుతుఁడె
* పనస నీలోరులవడి మందరమె చీలు
దితిజుల సంగతి తెలుప నేల
యక్ష గంధర్వ దేవాసురోరగ పక్షి
తతి మైందు ద్వివిదుని దాకఁ గలదె
అశ్విపుత్త్రులు వానరాగ్ర్యుల కాజిలో
ప్రతియోద్ధనొకనిని చూపంగఁ గలరె

* పనస, నీల= పనసనీలుల=ఊరుల తొడల వడిచే.

ఆ పితామహు వరమున నధిక దర్ప
మొంది యమృతాశు లగు వీరులుత్తమ కపు
లశ్వినులు గౌరవమునకు నఖిల లోక
తాత యెవరుఁ జంపక యుంట దాన మిచ్చె. 1068

వరగర్వంబున మత్తమౌచుఁ బ్రబలంబౌ సేన భంజించియున్
సుర పీయూషము గ్రోలు నీ కపివరుల్ చూడంగఁ గోపించి కుం
జర వాజి వ్రతతుల్ రథాలుగల యీ సర్వాగ్య్ర లంకాపురిన్
త్వరగా నాశనమున్ బొనర్చెదరు సర్వానీక మఝ్లుండుతన్. 1069

నేనే కూల్చితి లంక నెల్ల దగులన్ బెట్టించి తీశోకతో
నానామంబును రాజవీధుల వినన్ బల్మార్లు ఘోషించితిన్
జై నిత్యంబగు రామలక్ష్మణులకున్ జైరామ సంరక్షితుం
డౌ నావానరరాజు కేను హనుమన్నారాముకున్ దాసుడన్. 1070

అని ఘోషించితి, నా యశోకవనిలో నా దుష్టుఁడౌ క్రూర రా
వణు లంకాపురి శింశుపాతరు నధోభాగాన సైన్యంబుతో
జనకక్ష్మాపతి పుత్రి రాక్షస సతుల్ సంరక్షకై కాయుచుం
డ నితాంతార్తిని జిక్కిపోయియును కన్పట్టెం జుడీ యెంతయున్. 1071

ఒకటే వల్వను గట్టి ధూళియుఁ గరంబౌళ్ళంక మాయన్ గడున్
వికలాంగంబుల దీనయై పతి హితంబే కోరుచున్ సీత యా
వికృతాస్యంబుల రాక్షసాంగన లటుల్ భీ గూర్పగా నేలపై
నొకటే వేణిని తమ్మితీవ హిమ మందున్నట్టు లుండెను గదా! 1072

ఖలుఁడౌ రావణు నేవగించుకొని వేగన్ జావ లోనెంచు వి
హ్వలితై జాక్షికి నెట్లొ నమ్మకము నుత్పాదించి భాషించి య
వ్వల సర్వార్థముఁ జూప, రాఘవునిం బ్రాపించు సుగ్రీవ ని
శ్చలమైత్రిన్ విని సీత మానసములో సంతృప్తి ప్రీతిన్ గనెన్. 1073

సతి శీలంబు వరంబు, భర్తయెడ శ్రేష్ఠం బౌచు నెంతో సుభ
క్తి తగున్ గాని కృతాపరాధుని దశగ్రీవున్ వధింపంగఁ బో
దతఁడో యెంతొ మహాత్ముఁ డిందుకు నిమిత్తం బౌను రాముండు తా
నతనిం జంపుటకంచు లోఁదలఁపగా నౌ నింక నిప్పట్టునన్. 1074

ప్రకృతిచేతనె యామె తన్వంగి యిపుడొ
రామువిరహానఁ జిక్కి శల్యంబ యయ్యె
పాఠ్యమిని పఠించెడి స్వభావంబ గలుగు
ఛాత్రు విద్య యట్టులు చిక్కి సన్నగిల్లె. 1075

ఆ మహాభాగ జనకుని యాత్మజాత
అతిగ శోకపరాయణ యౌచుఁ గుములు
ఇప్పు డింకేమి చేయు నెంతొ మీరు
అది సమస్తము మీరె చేయుంగవలయు. 1076

హనుమంతుఁడు చెప్పిన వా
క్కును విని యంగదుఁడు వాలికొమరుండనియెన్
కనుఁగొనియు దేవి లేకయె
యనఘుఁడు రాము దరికేగ ననుచితమె యగున్. 1077

కనుఁగొంటిమి సీతను, గై
కొని రాలే దనుచు వీరకోవిదు లగు మీ
రనుట యెంతయు తగదని
ననుకొందును వానరాగ్ర్యులారా ! యెందున్. 1078

ఘనముగ దాటుటలో నై
నను విక్రమముననుగాని నరసుర రక్షో
గణముల నెవఁడును మీ
కును సాటియౌలే దనియనుకొందును జుండీ. 1079

వ. అంత తోక నంటి కొనియున్న నిప్పును వీచెడి గాలియు దేవికి స్వాస్థ్యము గలిగించుచు మంచుగాలి దేవికి స్వాస్థ్యము గలిగించుచు మంచు గాలివలెఁ జల్లఁగ వీచె. అట్లు తోక దహించుచున్నను ఈ అగ్నియేల నన్ను గాల్చకున్నది. మంట యైతే కనిపించుచున్నది కాని బాధ కలిగించుట లేదు. తోక చివర శిఖరము పడినట్లున్నది పోనీయిది యంతయు రాముని ప్రభావము వల్ల సముద్రములో మైనాక పర్వతము వచ్చినట్లు అగ్ని మాత్రము శాంతియేల కూర్చదు. లేక సీత దయవల్లఁగాని రాముని తేజస్సుచేఁగాని నాతండ్రికిఁ గల స్నేహముచేతఁగూడ అగ్ని నన్ను కాల్చదయ్యెనేమో అనిచింతించి, ఆకపి కుంజరు డిట్లు తలచి వేగముగా శైల శృంగము వలె ఎత్తయిన రాక్షస సంచారము లేని పురద్వారము మీది కెగిరి శైల సంకాశుడగు నాతడు మరల పొట్టి వాడయి త్రాళ్ళను విడివడి పర్వత సన్నిభుఁడగు నతడు ముక్తుడయి తోరణ మందున్న నల్లని యినుముతోఁ గూర్చిన పరిఘను చూచి దానిని గైకొని యక్కడి రక్షకులను జంపి మరల లంకను జూచుచు తోకపైగల నిప్పు మండుచుండ కిరణములతో నిండిన సూర్యుడు వోలె నతఁడు ప్రకాశించె. అంతట 936

లంకఁ గని కపి తన మనోరథము తీఱ
చెదను నుత్సాహమును పొంగ నింకఁజేయ
మిగిలినవని యేమంచునెంచి మిగుల నేది
చేసి దైత్యుల బాధింతు శీఘ్రముగనె. 937

అని చింతించుచు "నీవనిన్ విఱిచి ప్రాంతీయ సైన్యంబు లె
ల్లను నష్టం బొనరించితిప్పు డిఁక దుర్గ ధ్వంసమున్ జేయ నుం
డెను దుర్గంబు నడంచఁ బూర్తియయినట్లే నాదు యత్నంబు లె
ల్లను నీమీదట, వాలవహ్నిని గృహాలన్ తృప్తి పొందించనా. 938

అని తోకం గల నిప్పుతో మెఱపుతోఁ సల్లాడు మేఘం బటుల్
ఘన సౌధాగ్రములందు నాహనుమ లంకన్ సంచరించెన్ గృహం
బున నుండిన్ గృహమెల్లఁ బూవుల వనంబుల్ చూచి ప్రాసాదముల్
గని సంచారముచేసె నావయిని వేగన్ దూకె నిర్భీతితో. 939

వ. అట్లు దూకుచు హనుమంతుండు వాయు సమానబలుండై ప్రహస్తుని భవనంబున నిప్పు అంటించి యటనుండి యెగిరి మహాపార్శ్వుని భవనంబున కాలానలశిఖవంటి నిప్పురగిల్చి వజ్రదంష్ట్రుని గృహంబుపై కెగిరి మహాతేజుఁడై శుకుని యింటికిని, ధీమంతుడగు సారణుని యింటికిని నిప్పుపెట్టె. ఇంద్రజిత్తు సౌధము దహింపజేసి జంబుమాలి సుమాలి భవనంబులఁ దగుల బెట్టి రశ్మికేతు, సూర్యశత్రు హస్వకర్ణుల గృహంబులను, దంష్ట్రుని రోమశుని గృహంబులను అంటించి యుద్ధోన్మత్తుఁడు, మత్తుఁడునగు ధ్వజగ్రీవుని వేశ్మమును ఘోరుఁడైన విద్యుజ్జిహ్వుని హస్తిముఖుని కరాళుని పిశాచమువంటి శోణితాక్షుని కుంభకర్ణుని మకరాక్షుల భవనంబులను నిప్పుపెట్టి యజ్ఞశత్రు బ్రహ్మశత్రుల భవనములను నరాంతక కుంభ నికుంభుల భవనములను అంటించి విభీషణుని గృహమునుమాత్రము తప్పించి యన్నింటిని క్రమముగా దాటుచు నంటించె. ఇంక మహాసమృద్ధిగల భవనముల నంటించుచు రాక్షసేంద్రుఁడైన రావణుని భవనంబుచేరి నానారత్న విభూషితమై మేరు మందరముఁ బోలి సర్వమంగళ శోభితమైన ప్రాసాదమున నిప్పుపెట్టి ప్రళయకాల మేఘంబు వోలె విజృంభించి గర్జించెను. 940

గాలి తోడు కాఁగఁ గాలాగ్నివలె నిప్పు
మండి లంకలోని యిండ్లు లన్ని
కాలిపోవునంత ఁగాంచన జాలముల్
ముత్తెమణుల యిండ్లు బుగ్గి యయ్యె. 941

మేడలు విఱిగియు ధరిత్రి మీఁదఁ గూలె
పుణ్య మడఁగసిద్ధ భవనమ్ములును మింటి
నుండి ధరఁ గూలిన ట్లంతనులికిపాటు
రాక్షసుల యార్పు గంద్ర గోళంబు చేసె. 442

మనదు ప్రాణాలు తీయ నీ మాడ్కి నిట్టి
దయమె లేని కపినిప్పు దాపురించె
నయ్యొ యని యేడ్చుచును చంకయందు శిశువు
లేడ్వ విడుజుట్టుతోఁ గాలు నిండ్ల వెడలి. 443

మింట మెఱుపులట్టులు స్త్రీలు మెఱయుచుండ
స్వర్ణ విద్రుమ వైడూర్య వజ్ర రజత
లలిత ముక్తాది యుక్త హర్మ్యములనుండి
జాఱిపడుధాతువులఁజూచె సరగ హనుమ. 444

ఎండుగడ్డిఁ గట్టెల నిప్పు తృప్తిపడదు
ఎన్ని యిండ్లు గాల్చియుఁ గపి తృప్తిపడదు
శవము లెల్లెడఁగప్పినన్ క్షమయొ కాస్త
తృప్తిపొందక పడి యుండె నెల్లయెడల. 445

ఒకచో మోదుగు పువు లటు
లొకచో బూరుగు పువు లటు లురు కుంకుమరా
శికరణి వహ్ని శిఖలు పలు
రకములుగ వెలిఁగి మెఱసె రాక్షసు లిండ్లన్. 446

పడిగ మహాత్ముఁడు హనుమం
తుఁడు లంకాపురి దహింపఁదొచెను నపుడే
కడు కోపమ్ముతో శం
భుఁడు తగులం బెట్టు నాత్రిపురముం బోలెన్. 447

అవల లంకాపురపుఁ బర్వతాగ్రమందు
బయలు దేఱిన యాభీమ బలపు వహ్ని
వేగముగ భవనంబుల విడువఁ బడియు
జ్వాల వలయంబును జూపి చాలవెలిఁగె. 948

ప్రళయ కాలాగ్నివలె వహ్ని మండి
గాలితోపాటు మిగుల నాకాశ మంటి
పొగలు లేక రశ్ములతోడ ముఖ్యముగను
గేహములఁ గాల్చి దైత్యాంగ ఘృతము మాడ్చె. 949

కోట్ల సూర్యుల వెలుఁగు లాగున నెసంగి
ప్రకటతేజము గల యగ్ని లంక నెల్ల
చుట్టు ముట్టి పిడుగువంటి గట్టి ధ్వనులు
సలిపి బ్రహ్మాండము ప్రీల్చి చక్కి నలరె. 950

అందు మింటనుండి మహాగ్ని యధిక మగుచు
పెరిగి రూక్షార్చి మోదుగు విరులఁ బోలి
నిప్పు లాఱెడితటిఁ గ్రమ్మి నిండు పొగల
నల్ల కల్వలవలె మబ్బు లెల్లఁ దనరె. 951

ఇతఁడు వజ్ర మూనిన త్రిదశేశ్వరుండొ
యముఁడొ సాక్షాత్తు వరుణుఁడొ యనిలుఁ డొక్కొ
రుద్రుఁడొ యగ్నియొకొ యర్కుడొ ధనదుఁడొ
ఇందు వోయగుఁ గపిమాత్ర మేమి కాఁడు, 952

అఖిలమునకుఁ బితామహుఁ డయి, నమస్త
మగుచు నల్మొగముల బహ్మ యలుకె యిట్లు
రాక్షసులఁ గూల్పఁగా వానర స్వరూప
మొంది యరుదెంచెనో యన నొప్పుచుండె. 953

లేక వైష్ణవతేజ మీరీతి పెరిగి
వ్యక్తమును గాక యొకట్టె యనంత మయ్యు
రాక్షస వినాశమున కయి రయము యిపుడె
తనదు మాయతో వచ్చియుండెనొకొ యిటకు. 954

అనుచు నశ్వ రథాళి వృక్షాళితోడ
పక్షి తతితోడ దగ్ధమై పఱలు లంక
వెంటనే చూచి రాక్షసు వీరు లెల్ల
కపియొనర్చిన కృత్యంబు గనుచు ననిరి. 955

అకట! నాయన! హాపుత్ర! యకట! కాంత!
అకట! హామిత్ర! యకట! భోగాఢ్య పుణ్య
జీవితంబ! యనుచు నిట్లు చింతఁ గుమిలి
దైత్యు లేడ్చి చేసిరట శబ్దాలు మిగుల. 956

వ. అట్లు వహ్నిజ్వాలలు వ్యాపించి వీరులనుజంపి భటులను మరలింప లంకయంతయు శాపంబుచే నుపహత యైనది వలెఁ గాఁగా, నట్టి లంకను స్వయంభువు కోపముచే నుపహతయైన భూమినివలె హనుమంతుఁడు చూచి పిదప రత్నములచే నిండిన వనమును విఱిచి యుద్ధమున మహారాక్షసులఁ జంపి గృహరత్నములతోఁ గూడిన లంకను దగులబెట్టి త్రికూట పర్వతశృంగాగ్రమున మండుచున్న తోకయందలి జ్వాలలతోఁ గిరణ మాలలు గల సూర్యుని వలెఁ బ్రకాశించుచు రాక్షసుల భవనంబులకు నిప్పుపెట్టి హనుమంతుఁడురాముని మనసులోఁ దలపోసె అంత మారుత నమవేగుఁడైన వానరశ్రేష్ఠుని హనుమంతుని దేవగణంబులు స్తుతించిరి. దగ్ధ యైన లంకను జూచి ఋషిసిద్ధ గంధర్వులు పరమాశ్చర్యము పొందిరి. సకల భూతములు హనుమంతుని గాలాగ్నినివలె దర్శించిరి. మునిపుంగవులు నాగ యక్ష గంధర్వ విద్యాధరులులోను గాఁగల దేవతలు మహాభూతములు అతులంబైన ప్రీతిని పొంది. 957

వ. అంత హనుమంతుఁ డిదియుఁ జూచిలోనఁ దలపోసి తనతోక యందున్న యగ్నిని సముద్రజలంబులతో నార్పి వైచి యట్లు మండుచు ధ్వంసమైన లంకలో భయముతో పరిగిడు దైత్యులఁ గనుఁగొని లోన భయమును ఏవగింపును పొంది యిట్లు తలఁచె. 958

అవురా! లంకనుగాల్చి యెట్టిపని నాకై నేను గావించితిన్
మివులన్ మండెడి నిప్పుపై నుదకంబే పోసి చల్లార్చు న
ట్లవడిన్మండెడి క్రోధమున్ మనసుతోనే యాపి యుద్రట్టి సా
ధువులే ధన్యులు నట్టి వారలె మహాత్ముల్ సువిత్మ వీక్షించినన్. 959

ఏకోపి పాపము సలుపఁ
డేకోపి గురుల నయిన వధింపక యుండున్
ఏకోపి పరుష వాక్కులు
వాకొనుచును సాధు నింద సలువక యుండున్. 960

ఎది యనఁదగు నెది యనరా
దిది కుపితాత్ముఁ డెఱుఁగడ యెన్నఁడుఁ గానీ
మది నలుగువానికి సలుపఁ
గఁదగనిది పలుకఁ దగనిది కలదే యెందున్ 961

కలిగిన కోపము నెవ్వఁడు
సులువుగఁ గూసమును పాము చొప్పున విడుచున్
ఇలలోన మానవుఁడే
పలుకం బడుఁ బురుషుఁ డనుచు ప్రాజ్ఞుల చేతన్. 962

కుమతి నయి సిగ్గువిడి పా
పముచేసెడి వారిలోనఁ బ్రముఖుఁడ నగుచున్
విమలాంగి సీత క్షేమము
స్మమతిఁ గన లంకఁ గాల్చి చంపితి స్వామిన్. 963

ఈలంకఁ గాల్చి నప్పుడు
యేల యనఘురాలు సీతయిటఁ గాలదు నే
నీలా గాలోచింపక
కూలిచితిని స్వామిపనిని కూళనె యగుచున్. 964

ఎందుకయి యింత యత్నము
పొందుగఁ జేసితినొ యది సమూలము పోయెన్.
ఇందును లంకను గాల్చుచు
పంద నగుచు సీతఁ గూడ వడిఁ గాల్చితినే. 965

ఇంక సలుపంగ వలసిన యు
ది కొంచెమే మిగిలి యుండఁ దిన్నక యదిచే
యక క్రోధ వశుఁడ నయి స
ర్వకార్యము సమూలముగను పాడొనరించితిన్. 966

జనకజ యవశ్యముగ న
గ్నిని బడి నష్టయయియుండు నిజముగ నెదియై
నను లంకలోన నిటు కా
లనిదే యుండదు సమస్త లంకయుఁ గాలెన్. 967

నా తెలివి తక్కు వగు పని
చేతను నీకార్య మెల్లఁ జెడి పోయినచో
ఈతరిఁ బ్రాణత్యాగము
చేఁతయొ తగు నిట ననుచు రుచించును నాకున్. 968

నేనిప్పు డగ్నిఁ బడుదున
యీనీళ్ళ బడుదున లేక యిచ్చోటి సము
ద్రాసను జంతుల కయి నా
మేనిని నర్పింతునొక్కొ మేలుగ నిపుడే. 969

వని సర్వము భ్రష్టము చే
సిన నేను కపి విభుదరిఁ జేరియు నన్నున్
గనుపింపఁ జేతు వరవరు
లను గనువాఁడ నిటువంటి భ్రష్టుఁడ నగుచున్. 970

నే నిపుడు రోష దోషము
చే నభిలంబిది జడతను జేసితి నిటులన్
ఈ నిఖిల జగములఁ గపి
జ్ఞానము చాపల్య గుణము ఖ్యాతము లేగా. 971

ఛీ యీ రాజస భావం
బీ యెడను నిరంకుశంబ యిటుల నెసంగెన్
ఈయెడ శక్తుఁడ నయ్యును
ఈయనువనిజఁ గాలిచితిని నసురుల యులుకన్. 972

సీత నశియింప నశియింత్రు క్షితిప సుతులు
క్షితిప సుతులు నశింప సుగ్రీవుఁ డడఁగు
ఎఱిఁగి యిది భ్రాతృవత్సల భరతుఁ డడఁగు
నింక శత్రుఘ్నుఁడును గాని యెట్లు బ్రతుకు. 973

వర ధర్మంబున నలరెడు
వర మైక్ష్వాకుల కులంబు పాడయి పోవన్
కరము వ్యథా పీడితులై
వర జనమెల్ల మిగులఁ దావము చెందున్. 974

కనుకన్ నిర్భాగ్యుఁడనై
మనమగు ధర్మార్థములను గడు లోపింపన్
మనసున రోషపు దోషం
బనఁ గూడి జగత్క్షయమునకు మూలము యౌదున్ 975

అమిత తేజస్వి ధర్మాత్ముఁడైన యతని
భార్యను స్వశీల రక్షితన్ వహ్ని తాక
లేదు, రాము మహిమ సీత శ్రేష్ఠ సుకృత
మెపుడుఁ గాల్చు వహ్ని-నను దహింప నీవు. 976

క్షితిని భరతాది సోదర త్రితయమునకు
ఎవతె దేవత యట్లు భావింపఁ బడియె
అట్టి రాముని ప్రియభార్య యెట్టు లిపుడు
నాశ మొంది యుండును మదిన్ దలఁచి చూడ. 977

పోని యన్నిటిఁ గాల్చుచుఁ బూర్తిగాను
అవ్యయుఁడు ప్రభు వైనట్టి యగ్నిదేవుఁ
డెంత మాత్ర మీతోకన్ దహింప లేదె
యెట్టు లీపూజ్యురాలిన్ దహింపఁ గలుగు. 978

హనుమ యప్పుడె యాశ్చర్య మొంది మరల
ఆ హిరణ్య నాభాద్రిని నంబు మధ్య
ఆ ప్రదర్శనమును గూర్చి యాత్మలోన
చింత చేయసాగెను నిట్లు సంతతంబు. 979

అధిక తపసుచే సత్యవాక్యంబుచేత
భర్తయం దనన్యప్రేమ వఱలి యుండి
ఈమె యగ్ని నైనను దహియింపఁ గలదె
యీమె నగ్ని మాత్రము దహియింప లేదు. 980

అనుచున్ దేవి పవిత్ర ధర్మమహిమన్ స్వాంతానఁ జింతించుచున్
హనుమంతుండు మహాత్మ చారణుల వాక్యా లిట్లు లాలించె నీ
హనుమంతుం డిటుదైత్య గేహముల నిప్పంటించి యౌరౌర! లం
క నిటుల్ గాలిచి యెంత దుష్కర మహాకార్యంబు గావించెఁగా 981

వనితల్ బాలురు వృద్ధులున్ వరువిడన్ పాటోంది లోకుల్ కరం
బును కోలాహలముల్ పొనర్చ గుహలన్ మోమెత్తి రోదింపఁ దో
రణ ప్రాకారపు సీమలున్ గలుగు నీ లంకాపురం బెల్లఁ గా
లెను నా సీతయొ యేమి చెక్కుచెదరన్ లేదెంత యాశ్చర్యమో. 982

అని యా మారుతిచారణోక్తులను నిట్లాలించి, కన్పించు శో
భనమౌ సత్శకునంబులున్ గని ఋషుల్ వాక్రుచ్చు వాక్యంబులన్
వినుచున్ సీతాకుశలం బెఱింగి సకలాభీష్టాలు తీరన్ మఱిన్
గని సీతన్ గని స్వప్రయాణమును కిచ్చన్ నిశ్చయించెన్ మదిన్. 983

హనుమ శింశుపా తరు మూలమందు భద్ర
గను గూర్చున్న సీతకు మ్రొక్కి యనియె
నా యదృష్ట వశమున క్షేమముగ నిన్ను
కన్నులారఁ గన్గొనుచు నుంటి గాద దేవి! 984

అని హనుమ యన బైల్దేఱు హనుమ నపుడు
మఱి మఱి కని భర్తృ స్నేహ మునీకి పొఱ
యాంజనేయుని తోడుత నంత సీత
యిట్టులనె శ్రద్ధ హనుమ యాలించుచుండ. 984

నీవొకండవె పూర్తిగ నిట్టి పనిని
సలుపఁగల వరిదమన! యాశక్తి గరిమ
నీకు యశ మిడు శరమ్ములన్ వేసి లంకఁ
గూల్చి నను గొనన్ దగును కాకుత్థ్సునికిని 985

అరి శూరుఁడౌచు మహాత్ముఁడై యొసంగు
నతని విక్రమంబున కర్హమైన యట్లు
ఒనరుపన నర్థయుతము సయుక్తికంబు
నయిన సీతోక్తి నాలించి హనుమ యనియె. 983

తొరగఁ గపి ఋక్ష ముఖ్యులతోడ నింక
రాఘవుఁడు లంక మీఁదికి రాగలండు
ఆజి సర్వశత్రువుల క్షయంబు చేసి
యతఁడు నీ దుఃఖమును వేగ నణఁగఁ జేయు. 987

అని యా మారుతి, సీత యూరడిల నొయ్యంజెప్పి పైల్దేరి తా
ప్రణతుండై విభుదర్శనోత్సుకత శీఘ్రంబే యరిష్టాచలం
బును నెక్కెన్ మఱి తుంగ పద్మరుచులన్ బొల్పొ వనశ్రేణి వ
ల్లను నొప్పెన్ శృంగలంబి జలదాలన్ సోత్తరీయుంబటుల్. 988

వ. మరియు నాయరిష్ట పర్వతము

మేలి సూర్యకరాల మేల్కొను నదివోలె
కొంత ధాతుల కండ్లఁగను నదివలె
జలపూర మంద్రధ్వనులఁ జదువునటుల
సెలయేళ్ళ ధ్వనిఁ బాడి యలరు నటుల
ఊరు దేవదారుల నూర్ధ్వ బాహువువోలె
గిరి నిర్ఝరధ్వని నఱచు నటుల

అలుగు పాముల బుసకొట్టు నదియువోలె
హిమ సుపూర్ణ గుహలను ధ్యానించు నటుల
మబ్బుకొళ్ళఁ బోల్ చఱియల మసలు నటుల
మిన్నొరయు శృంగముల విజృంభించి పఱలె. 989

ఎత్తై చెదరి యున్న యెన్నొ యెన్నొ గుహల నొప్పి
సాల తాళాది వృక్షాలఁ దనరి
పువ్వులున్న తీవెలఁ బొలిచి సింగారించి
మృగ పూర్ణమై ధాతు స్రుతులనలరి

సెలయేళ్ళఁ బలుజాళ్ళఁ జెలఁగి గంధర్వ మ
హర్షి యక్షోరగాఢ్యంబు నగుచు
తరులతా నిబిడమై తగి వ్యాఘ్ర సింహాల
స్వాదు మూల ఫలరసాంచితమయి

యలరు నాయరిష్టాద్రిని హనుమ యెక్కి
రాముఁ గను వేడ్క ముదము శీఘ్రంబు చేయ
వేయు నడుగుల రమ్యమౌ వివిధ తటులఁ
జప్పు డొనరించి హడియౌచు నొప్పుచుండె. 990

వ. మారుతపుత్త్రుఁ డగు నాహనుమంతుఁడుఆపర్వతము నెక్కి శరీరము పెంచి దక్షిణ దిక్కున గల లవణసముద్రము నుండి యుత్తర దిక్కున గల యవతలి గట్టును పొందఁగోరి మీనోరగ సేవితం బయిన భీమసాగరమును జూచి మారుతమువలె దక్షిణ దిక్కున ఆకాశము చేరెను. 991

హనుమ తొక్కిన కొండ ప్రాణ్యాళితో మ్రోసి
పడుదరుల చెట్లతో నట నడఁగె ధరకు
అతని యూరు జవాన నలరుఁ జెట్లు విఱిగి
వజ్రా హతిని బోలెఁ బడియెఁ గ్రింద
గుహల సింహాలు గగ్గోలు పడి యొనర్చు
సింహ నాదాలచేఁ జీలె నభము
జాతి వల్వాలు పడన్ సకల భూషలు రాల
విద్యాధరీ తతి వింటి కెగిరె

పెద్దపాములు నాలుకల్ వెడల తలలు
బిట్టు వ్యథ చెంద వెంటనె చుట్టుకొనియె
యక్ష గంధర్వ నాగ విద్యాధరులును
వడలి గిరి వదలి యెగిరి పడిరి మింట 992

పది యామడ వెడలుపు, ము
ప్పది యామడ పొడుగు, గల పర్వత మిటులన్
చెదరి పడె ధరకు సమమయి
పిదప హనుమ యలల జలధి వేగమె యెగిరెన్. 993

తెలికల్వ శశి కాఁగ జల కుక్కుట మెరలి
హంసలు శ్రవణ తిష్యములు కాఁగ
పచ్చిక నాచు నభ్రమువోలె తోచఁగ
ఆపునర్వసువు ముత్యంబుకాఁగ
ఘనమైన మొసలి యంగారకమే కాఁగ
ఐరావతము ద్వీపమటుల వెలయ
సారస లీలయొ స్వాతి నక్షత్రంబు
వలెఁ బ్రకాశంబు సలుపు చుండ

అనిల కల్లోల చంద్రాంశు లమలజలము
ఉరగ గంధర్వ యక్ష లబ్జోత్పలములు
గాఁగ వఱలు వ్యోమాబ్ధిని గడచె హనుమ
మేదినౌక సముద్రమున్ దాటినట్లు. 994

నభమున్ మ్రింగుచు నున్న యట్లు శశిమేనన్ రాయుచున్నట్లు సూ
*ర్య భ విభ్రాజిమహాంబరం బొరయులీలన్ మేఘముల్ శైలస
న్నిభుఁడున్ లాగుచు నంత పాండుర హరిన్నీలారుణ స్వర్ణస
న్నిభ మేలఁ బదేపదే శశి యటుల్ నిల్చున్ మఱిన్ మాయుచౌ 995

హనుమంతుండు నభంబునన్ గరుడుఁ డట్లుంబోద పంక్తిన్ విదా
రణ గావించుచు, మాటిమాటికిని విభ్రాజిల్లి కన్పింపకన్
నినదంబుల్ కడుఁ జేసి, రాక్షసులఁ బున్కిన్ జంపి స్వీయాహ్వయం
బును విన్పించి సునాభకాద్రిఁ గనె జ్యాముక్తాస్త్రమట్టుల్ వడిన్. 996

* భ=నక్షత్రము, సునాభకాద్రి=మైనాకపర్వతము.

అటు మైనాకమునుండి కొంత దరిగా [illegible] ఓటం బోయి యు
త్కట శైలంబు మహేంద్రమున్ దరి[illegible]న్ గర్జించి నల్దిక్కు లం
తట మార్మోయగ సింహనాదములఁ [illegible]ంబులం జేసి తా
నట మిత్రేక్షణ లాలసుం డగుచు న[illegible]కన్ గడున్. 997

గరుడుం డేగెడి మింటిపైఁ బదెపదే [illegible]ఘోషింప నా
నా యురుఘోషంబుల నాకసంబు [illegible]గాడుచున్ ప్రీలు చు
న్న రకంబై కనిపింప నుత్తర తటిన్ [illegible]చి యున్నట్టి వా
నరులెల్లన్ హనుమంతుఁ గన్గొనఁ గ[illegible]క్షించి వీక్షించుచున్. 998

అనిలోద్ఘట్టిత మేఘ గర్జితము లా గా[illegible]పుత్రోరు వే
గ నినాదంబున భీతచిత్తులయి యాక[illegible] మూర్తి ద
ర్శన కాంక్షన్ హనుమంతుఁ జుట్టుకొని [illegible]ప్లవంగుల్ కరం
బును నౌత్సుక్యముతోడ నుండిరి కడున్ [illegible]మెత్తి వార్తల్ వినన్.
999

హరిముఖ్యుం డగుజాంబవంతుఁ డపుడున్ హర్షించు చిత్తంబుతో
హరులన్ బిల్చియు నిట్లనెన్ "హనుమ [illegible]గావించె క్రి
చ్ఛుఱ, సందేహము లేదు కార్యము నెఱవేర్చెంబోని యివ్వాని కం
ఠ రవం బిట్టుల నుండఁబో దన మదిన్ హర్షించి రాత్మన్ గపుల్. 1019

వ. పిదప నావానర ప్రవరులు ఒక చెట్టుచివరనుండి యింకొక చివరకును ఒక శృంగము నుండి మరియొక శృంగము మీది కుఱుకుచు నుప్పొంగి హనుమంతుని జూడఁగోరి సమీపించి చెట్ల చివర పుష్పించిన కొమ్మలను వసనంబులనువలె నాడింపసాగిరి. అపుడు హనుమంతుఁడు కందరములో నణఁగి ప్రతిధ్వనిచేయుఁ గాలివలె బలవంతుఁడైన మారుతి గర్జన చేసి మేఘమువలె దగ్గఱకు వచ్చుచున్న మారుతిని జూచి వానరు లందఱు ప్రాంజలులై చూచుచుండ

గిరివంటి యా హనుమంతుఁడు చెట్లతో నిండి యుండిన మహేంద్రగిరి శిఖ
రము మీఁది కుతికె. సంతోషము పట్టఁజాలని యా మారుతి యాకాశము నుండి
తెక్కలు తెగిన పర్వతమువలె సెలయేళ్ళతో నిండిన యా పర్వతమున వ్రాలె.
అంత నావానరు లందఱు హనుమంతుని జుట్టు ముట్టి సంతోషముతో మూల
ఫలంబులును కానుకలుగాఁ దెచ్చి సమర్పింప నా హనుమంతుఁడు జాంబవం
తుఁడు మొదలగు పెద్దలకు వాలి కుమారుడైన యంగదునికి నమస్కరించె
నంత. 1003

అర్చ చేయఁదగు హనుమ నంగదుండు
జాంబవంతుఁడు కపులు నర్చనము చేయ
హనుమ యనెఁ 'జూచితిని సీత" ననుచు నతఁడు
నెంతొ సంగ్రహముగ నివేదించి మించె. 1004

వాలి సుతు నంగదుని తనపాణిఁ బట్టి
యామహేంద్రాద్రి రమ్య వనాంతరమునఁ
గూరుచుండి కపివరుఁ గగ్గొనుచు నపుడు
నీవిధంబుగ హనుమంతు డింకఁ బలికె. 1005

చూచితి నేను జానకి నశోకవనంబున, ఘోర రాక్షస
స్త్రీచయ మామెఁ బావన చరిత్రను గాచుచునుండె, రామునే
చూచెడి వెంగఁ బస్తుపడి స్రుక్కుచు నేకవేణియై
శౌచము లేక యుండెఁ గడుజాలిగ నట్టులు కట్టు జుట్టుతో. 1006

అని యమృతోపమానము శుభార్థము నౌనటు లిట్లు వాయుజుం
డన విని పొంగిపోయి కపులందును గొందఱు సింహనాదముల్
పొనరిచినారు కొంద ఱటఁ బూర్తిగ గర్జనచేసినార, లి
ట్లనె మఱికొందఱున్ గిలకిలల్ ప్రతిగర్జన చేసి రెంతయున్. 1007

కొందఱు కపికుంజరు లా
నందము పట్టంగ లేక నయముగ పాడగ్రై
యందం బగు తమ తోకలు
పొందుగఁ బైకెత్తి నృత్యములు చేసి రటన్. 1008

కొందఱు పర్వతశృంగము
లందుండి యెగిరి కరినిభు హనుమంతుని దా
కందొడఁగి, రంత వానరు
లందఱు ముందఱ వచించె నంగదు డపుడే. 1009

బాగుగ విస్తీర్ణం బగు
సాగరమును దాటి తిరిగి చనుదెంచితివే
ఏగతి శక్తిని బలమున
వేగమునను నీకు సాటి వేరును గలరే. 1010

ఏమీ నీ వీర్యంబును
ఏమీ నీ స్వామిభక్తి యేమీ ధృతియున్
రాముని పత్ని యశస్విని
నీమెయి నదృష్టవశత వీక్షించితిగా. 1011

రాముం డదృష్ట వశంబున
నామైథిలి విరహబాధ త్యజియించు నటం
చామోదంబునఁ గపు లని
యాపయి జాళ్ళపయి హనుమదాదుల దరిగన్. 1012

కూరుచుండి సముద్రమున్ గూడ దాటి
చనుటయును లంకఁ జొచ్చుట జనకసుతను
గనుట రావణు దర్శనంబును నెఱుంగ
ప్రాంజలు లయి యుండిరి యెంతొ శ్రద్ధతోడ. 1013

హనుమంతునిచే వీరులు
ననిలో నిటుచంపఁబడఁగ నాసీతను గై
కొని వచ్చుటకంటె నికన్
పని యేదియు లేద యనుచు భావింతు మదిన్. 1080

ఇటువంటి భావములె యు
న్నటువంటి కపివరుఁ జూచి యర్థయుతుండై
నటువంటి జాంబవంతుం
డిటువంటి సమర్థ వాక్య మిట్టుల పలికెన్. 1081

నృపపుత్రా ! నీవన్నటు
లిపు డిటుల నాచరింప నెంతయుఁ దగదే
ఇపు డా రాముని యాశయ
ము ప్రకారము కార్యసిద్ధి ముమ గను మీవున్. 1082

అవల జాంబవంతుని వాక్కు లంగదాది
వీరవానరుల్ హనుమయు వెస గ్రహించి
ప్రీతితో మహేంద్రాద్రిని విడిచిపెట్టి
మిగుల నుత్సాహ మొప్పఁగ నెగిరినారు. 1083

మేరు మందరములో మేలి యేన్గులో యన
    మేలి కాయబలాల మిన్ను గప్పి
ప్రాణులు గొలువ నాత్మాఢ్య వేగబలాఢ్య
    హనుమఁ జూపుల మోయు పట్లు తనరి
యశ మర్థ సిద్ధిని ననఘు రాముని కీయఁ
    జేరి సంపదఁ గర్మసిద్ధిఁ బెరిగి
ప్రియమాడి యని చేసి వెసరాము నుపకృతి
    పలుప మనుస్వులై నిలువఁ బూని

మింటి కెగిరి దూకుచు  గప  వెంటఁ దగిలి
వృక్ష వర నందన పవ  ‌ ‌ ‌ ‌ ము
మహితదధి ముఖ క  క్ష్మ  ధువనంబు
దుర్గమముఁ జేరి య  మహోత్సుకులె యైరి. 1084

పదపన్ సుందరమౌ  హానుధువనం బెల్లన్ నిరీక్షించుచున్
మధువ త్పింగళ వర్ణమై మధువులన్ మైఁబొంగి గ్రోలంగ నం
గదుఁ బ్రార్థించి యను  ొందియుఁ గొనంగా జాంబవమ్ముఖ్యసో
న్మదులౌ వానరులెల్ల  ంతసమెదన్ రాజిల్లఁ గ్రీడింత్రటన్. 1085

కొందఱు పాటపాడెదరు కొందఱు చేతులు మోద్తు రింకిటుల్
కొందఱు నృత్య మాడెదరు కొందఱు హాసముచేతు రిట్టులే
కొందఱు గంతు లేయుదురు కొందఱు దూకెద రిట్టులట్టులన్
కొందఱు ప్రేలుచుండెదరు కొంచెము మై స్మృతిలేక యుత్తటిన్. 1086

ఒండొరుఁ గొందఱు తాల్చెద
రొండొరుఁ గొందఱు పయిఁబడి యూరకె విహరిం
త్రొండొరుఁ గొందఱు సణుఁగుదు
రొండొరుఁ గొందఱు సుఖింతు రుప్పొంగి యెదన్. 1087

తరునుండి తరు వుఱికెదరు
గిరిశిఖరమునుండి ధరకుఁ గ్రేళ్ళుఱుకుదు రా
ధరనుండి వడి నెగురుదురు
తరువు చివరనుండి వేగ ధరఁ బడెద రహో. 1088

ఒక్కడు పాడు నింకొకరుఁ డుద్ధతి నవ్వుచు వానిఁ బైకొనున్
ఒక్కఁడు నవ్వ నింకొకరుఁ డూరక యేడ్చుచు వానిపైఁ బడున్
ఒక్కఁడు నేడ్చు నింకొకరుఁ డూరడిలం గడు ప్రేలుచుండు వే
ఱొక్కఁడు ప్రేలుచుండ నొకడొక్క వడిన్ ధ్వనిచేయు బిగ్గఱన్. 1089

అటులన్ తత్కపి సైన్య మెల్ల మధుపానా త్యంతి కోన్మత్తమై
ఇటులట్టుల్ పరువెత్తుచున్ మిగుల నొళ్లే మర్చి చేష్టింపఁగన్
అటు నున్మత్తుఁడు గాని వానరుఁ డెవండైనన్ గనన్ రాఁడు నిం
కట సంతృప్తుఁడు గాని వాడయిన నందం దేని కన్పట్టఁడున్. 1090

అటు వనమంతయుఁ దినుచును
అట చెట్లన్నిటను పూలు నాకులు రాల్చన్
తటకునఁ గని కోపంబున
నట దధివక్త్రుఁ డనుకపి యదలిచెఁ గపులన్. 1091

రెచ్చి కపులు బెదిరింపఁగ
హెచ్చియు వనపాలకుండు నేపుననావన్
నిచ్చలు నుగ్రౌజంబున
నచ్చంచల కపులనుండి యావఁగఁ బూనెన్. 1092

కొందఱఁ బరుషము లాడెను
కొందఱ హర్షంబుతోడఁ గొట్టెను నక్తిన్
కొందఱితోఁ బోరాడెను
కొందఱ బ్రతిమాలి మిగులఁ గొంకక కనుచున్. 1093

వారి దరిసి ముదమునను న
పారబలమ్మున కపులను వారించిన న
వ్వారలు మానక పెఱవిడి
నేరము లేకయును వాని నిలఁబెట్టి కడున్. 1094

గోళ్ళను గీరుచు కఱచుచుఁ
బళ్ళను నఱచేతఁ గాళ్ళ బాధించి కడున్
మళ్ళకకపిఁ గొట్టుచు కపులు
చెల్లాచెదరుగను నార్చి చెఱచిరి వనమున్. 1095

* వ. పిదప నాకపులు చేసిన కృత్యమునకుఁ గోపించిన దధిముఖుని జూచి హనుమత్ప్రముఖులైన వానరులు వేగముగాఁ బరువిడిరి. అపుడు బాహువున వృక్షము దాల్చి వచ్చుచు మహాబలుఁడైన యార్యకుఁడు "వీఁడు నావాఁ డని తెలియుఁ" డని తలఁచి వేగముగా వానిని వసుధాతలమున ముద్దగాఁ గొట్టి వైచె. అంత – 1096

అవల తొడలు మోకాళ్ళు బాహువులు విఱుగ
ముఖము నెత్తుటఁ దడియుగఁ మూర్ఛవడియె
అంత నృపు మేనమామ సమాశ్వసించి
దండమున మత్త వానర తతిని నాపి. 1097

ఎటులొ కపులనుండి విముక్తి నెనసి యతఁడు
ఒంటిఁ దనభృత్యులను చేరి యొగి వచించె
మీర లిటనె యుండుఁడల సౌమిత్రి రాము
డధిప సుగ్రీవు డెట నుండె నటకె పోదు. 1098

అచట నంగదు దోషమ్ము నరయఁ దెలిపి
వత్తు, నంత రాజణఁచును వానరాళి
ఈ మధువనంబు సుగ్రీవుని కిష్టవనము
పూర్వు లది దివ్యము సురలున్ పొందలేరు. 1099

చావు మూడిన మత్తులఁ జావమోది
యధిప సుగ్రీవుఁ డింక రెచ్చి హతి నొనర్చు
ఈ నృపాజ్ఞ నుల్లంఘించు వానరులును
వధ్యులే మన యలుక సాఫల్య మొందు. 1100

* ఈ 61వ సర్గములోని విషయమే 25వ శ్లోకము నుండి పునరుక్త మయ్యెను. కొన్ని శ్లోకములు పునరుక్తమయ్యెనని వ్యాఖ్యాత.

అని దధిముఖుండు పలికి మహాబలుఁడు
వడిగ వనపాలురను గూడి ప్రభువుఁజేరి
రాము లక్ష్మణు సుగ్రీవు రయమ చూచి
సమ తలంబగు ధరపైని సరిగ నిలిచి 1101

దీన ముఖుఁడయి ప్రాంజలియై నయాన
నధిప సుగ్రీవు కాళ్ళపై నపుడె వ్రాల
అట్లు పడియున్న దధిముఖునరసి యపుడు
వ్యథిత చిత్తుడై సుగ్రీవుడనియె నిట్లు 1102

లెమ్ము లెమ్ము నాకాళ్ళ వ్రాలితివి యేల
అభయ మిచ్చితి నఖిలంబు నరయ దెలుపు
అనుచు సుగ్రీవుఁడటనమ్మ నట్లు పలుక
ప్రాజ్ఞుడౌ దధిముఖుడనె వ్యథను బాసి. 1103

ఋక్ష రజసుడుగాని వాలియును గాని
స్వేచ్ఛ విహరింప రిట విహరింత్రు కపులు
ఈ వనము కాయు వారెల్ల నెదురు కొనిన
వ్యథను లెక్కింపక మధులానెదరు తింద్రు. 1104

తినినయది తిని కడమ పాడును పొనర్చి
చొచ్చి యడ్డిన గనుబొమల్ చూపు చుంద్రు
కరము సరంభ పడువీరు కపుల చేత
నెదరు కొనబడి యుల్క వారింపఁ బడిరి. 1105

పిదప వీరలో కపులచే వ్యథల బడిరి.
కొందరట హస్తముల చేతఁ గొట్టబడిరి
కొందఱును మఱి మోకాళ్ళతో కొట్టబడిరి
గొప్పవారు యథేచ్ఛ గన్గొనిరి దివము. 1106

ఈవు ప్రభువుగ నుండిన నిట్లు శూరు
లైనవారలు హతులైరి యధిపవర్య!
మధువనంబంతయును గడుం బాడు చేసి
సర్వ విధంబుల భగ్నము సలిపి రంచు. 1107

విన్నవింపంగ నిటు వర వీర హంత
ప్రాజ్ఞుఁడౌ లక్ష్మణుఁడు విని ప్లవనాథుఁ
డైన సుగ్రీవుతో నిట్లు లనియె రాజ!
ఎదురు కొనఁబడు వనపాలుఁ డెవఁడు వీఁడు. 1108

ఎందుఁ గూర్చి దుఃఖితుఁడై వచించుచుండె
అనిమహాత్ముఁడౌ లక్ష్మణుఁ డడిగి నంత
ఈవిధిని వాక్య విదుఁడు సుగ్రీవుఁ డనియె
ఇదిగో వినుము లక్ష్మణ! వీఁడు దధిముఖుండు. 1109

దక్షిణపు దిక్కు వెదకి యుత్తటిని వచ్చి
యంగదాది వీరులు మధు వానినారు
వీరు కృతకృత్యులును గాక యూరకముగ
నెన్నఁడును ప్రవర్తింపఁ బో రెంచిచూడ. 1110

వచ్చి వీరు మధువాని సర్వంబు గూడ
అనుభవించి భగ్నము చేసి యలరినారు
వనము విఱచుటచూడ నీవానరులును
స్వీయ కార్యము తీర్పక చేయ రిట్లు. 1111

కనబడియె దేవి తప్పక హనుమ కిపుడు
హనుమకంటె నన్యుఁ డామె నరయ లేఁడు
ఇట్టి కర్మసాధింపఁగ నెందు హనుమ
యొకఁడె తగిన సమర్థుఁ డన్యుండు కాఁడు. 1112

అట్టి కపివరుఁ డైన హనుమ యందె
కార్యసిద్ధి పట్టుదల విక్రమము బలము
శ్రుతము సర్వంబు స్థిరముగఁ జూడఁ బడియె
అతఁడె నిగ్రహాను గ్రహచతురుఁ డెందు. 1113

పట్టి యెట నేతృతను జాంబవంతుఁ డుండు
ఎట మహాబలుం డంగదుఁ డెసఁగి యుండు
ఎట హనుమ యధిష్ఠాతృత్వ మెనసి వఱలు
దాని కింకొక గతియెందు కానఁబడదు. 1114

అంగదాదులు మధువన మంత విఱిచి
అడ్డువారిని మోకాళ్ళ నదిమినారు
అందుచే దధిముఖుఁ డనునతఁడు వచ్చి
మధుర వాక్కున నిది తెల్పనిదిగొ వచ్చె. 1115

కనఁబడియె సీత సుభుజ! లక్ష్మణ! యెఱుంగు
అరుగుదెంచి కపులు మధు వానినారు
వినుతు లగువానరులు సీతఁ గనక యిట్లు
బ్రహ్మ యిచ్చిన దివ్యపనంబు పాడొనర్త్రె?! 1116

అనఁగ ధర్మాత్ము డైన లక్ష్మణుఁడు రాముఁ
డపుడు చెవుల విందిడెడి వాక్యార్థ మెఱిఁగి
అధిక ముద మొంద దధిముఖు డాలకింప
నిట్లు సుగ్రీవు డనె నెంతొ హృదిని మెచ్చి. 1117

వనపాల! నీదువాక్యము
విన ముదము గలిగె కపు లిటు విహితపుఁ గృత్యం
బును నెఱవేర్చక యిట్టుల్
పొనర్పరిది సైపు కపులు పొనరింపు పనుల్. 1118

మృగపతులు వోలె దర్పితు
లగు హనుమత్ప్రముఖకపుల నారయఁ దలఁతున్
తగఁ గార్యము నెఱవేర్చు ప్ల
వగులను గనఁదలఁతు రాఘవాదులతోడన్. 1119

అని సుగ్రీవుఁడు పల్కినన్ దధిముఖుం డానందముం బొందీ వేం
టనె సుగ్రీవునికిన్ నృపాత్మజులకున్ దండంబు గావించి త
ద్వనముం జొచ్చి మధూన్మదంబు చన మధ్వంబుల్ విసర్జించు చుం
డిన యూథానఘులన్ గనుంగొనుచు నెంతే ప్రేమతో నాయంగదున్.
1120

వ. సౌమ్యా: వీరు నిన్నడ్డగించినందుకు రోషము చూపకుము. తెలియక వనపాలకులో మిమ్ము నిషేధించిరి. నీవు యువరాజవు ఓమహాబలా! ఈ వనమున కంతకు నీవు ప్రభువవు! మూర్ఖత్వము వల్ల ఇదివఱకు చేసిన రోషము మన్నింపుము. నేను వెళ్ళి నీపినతండ్రికి మీరంద రిక్కడికి వచ్చినట్లు చెప్పితిని. ఈకపీంద్రులతో నీవు వచ్చుట విని సంతోషించెను. వనము నెదుర్కొనుట విని కూడ రోషము పొందలేదు. నీతండ్రియు వానరేశ్వరుఁడు నగు సుగ్రీవుఁడు సంతోషించి మిమ్ములనందఱను పంపు మని చెప్పె. అని దధిముఖుఁడు చెప్పిన ప్రసన్న వాక్యము విని వాక్యవిశారదుఁడగు నంగదుఁడు ఆవానరులతో నిట్లనె. ఓవానరయూథపులారా! రాముఁ డీవృత్తాంతమును వినె నని యూహించుచున్నాను. ఇంక కార్యము నెఱవేఱి నపు డిక్కడ నుండుట తగినది కాదు యథేచ్ఛగా మధువు గ్రోలి వనచారులు విశ్రాంతి పొందిరి. సుగ్రీవుఁ డున్నచోటికి పోవుటకు ఏమి మిగిలియున్నది. మీవానర యూథపులు చెప్పినట్లు చేయుట నాకు కర్తవ్యము. నేను మీకు స్వాధీనుఁడను నేను యువరాజైనను నేనాజ్ఞాపింపనశక్తుఁడను. కృతకృత్యులైన మిమ్ము అనాదరించుట యయుక్తము అని యంగదుఁ డనఁగా అట్టి యన్యయమైన మాట వినిసంతుష్టాంతరంగులై వనౌకసు లిట్లనిరి. 1121

ప్రభువై యుండియు నెవ్వఁ డిట్లుపలుకున్ రాజా! మహారాజ్యమున్
విభవంబున్ గొని మత్తుఁడై సకలమున్ నేనే యటంచున్ నరుం
డభమున్ శోభన మెంచుఁ డిట్టి వచనం బర్థంబు నీబోటికే
శుభమౌ నమ్రత భావి భద్ర హితముల్ సూచించు నెల్లప్పుడున్. 1122

అందఱము మేమిదిగో తయార గుచునుంటి
మెచట నవ్యయ సుగ్రీవుఁ డెసఁగె నటకె
పోవసిద్ధమై యుంటిమి నీవు చెప్ప
కొక్క యుడుగైనఁ జన మిదొండె నిజము. 1123

అని కపులు చెప్ప నంగదుఁ డనియె నిట్లు
అయితె సరి మంచి దరిగెద మనుచు పలుక
అనినదే తడవుగ నింక నపుడు మింటి
కెగిరి యామహాబల కపు లేగిరంత! 1124

ఒగి నాయంగదుఁ బట్టి వానరులు యంత్రోత్క్షిప్త శైలాలటుల్
విగతాకాశము చేసి యాకస, మటన్ వేగంబ పోవన్ దిశల్
పగులుంబోయన్ ఘోషముల్ సలుపుచున్ నాతోద్ధతిన్ బోవు మే
ఘగణం బోయనపైకి పైకెగిరి వేగం బోయి రావానరుల్. 1125

అంగముఁడు రాఁగ సుగ్రీవుఁ డప్పు డెంతొ
కుందు కమలాక్షు రాముని గూర్చి పలికె
"ఊరడిల్లు భద్రమ్ము నీకొదవుఁ గాక
అరయుఁబడె సీత యిట సంశయుంబు లేదు. 1126

మన సమయమును దాటి వారును జరింప
శక్య మేమాత్రమును గాదు సరిగఁ జూడ
ఆమహా బాహువు యువరా జంగదుండు
కృత్యమే చెడిపోవుచో నిటకె రాఁడు. 1127

తాను కృతకృత్యుఁడే గాని తఱిని నిట్టి
వన్నులు చేయక దీనుఁడె భ్రాంతుఁ డగును
ముదము పొందని యెడల బూర్వులును గాచు
తాత తండ్రుల వన మిట్లు తాఁజెఱుపఁడు. 1128

ఊరడిల్లు కౌసల్యాకుమార! రామ!
అరయఁబడె సీత యిటు సంశయంబులేదు
హనుమ కంటె నన్యునిచేత నరయఁబడదు
హనుమ కంటె నన్యుండు చేయుండు దీని. 1129

అర్కు నందుఁ దేజము స్థిరంబైన యట్లు
కార్య సిద్ధియు బుద్ధియు వీర్యగరిమ
పట్టుదలయును నావాయుపట్టి యందు
స్థిరముగా నున్న వనియెంతుఁ జిత్తమందు. 1130

పట్టి యెట నేతృతను జాంబవంతుఁ డూను
ఎట మహాబలుఁ డంగదుఁ డెసఁగి యుండు
ఎట హనుమ యధిష్ఠాతృత్వ మెనసి వఱలు
దాని కింకొక గతియెందుఁ గానఁబడదు. 1131

అమిత విక్రమ ! యిపుడు శోకార్తి విడుము"
అనఁగ నింతలో నాకాశమందుఁ ద్వరగ
సిద్ధిపోలెఁ గిష్కింధకుఁ జేరుచున్న
హనుమదాదుల కిలకిల ధ్వనియు వినియె. 1132

అప్పు డాధ్వని సుగ్రీవు డాలకించి
ముదముతోఁ దోక సాచి యుప్పొంగి యుండ
అంగదాది వానరవరు లధిక మోద
మొందె రామ సుగ్రీవుల ముందు వ్రాల. 1133

ఆ మహాబాహు హనుమంతుఁ డడుగుఁబడి
దేవి క్షేమము కడు నివేదించి నంత
హనుమయెడఁ గపీంద్రుఁడు నిశ్చితార్థుఁ డయ్యె
లక్ష్మణుఁడు ప్రీతి ప్రీతు గౌరవము గనియె. 1134

వైరిదమనుండు రాఘవ వంశ రవియు
అతిగఁ బ్రీతిని హర్షంబు నంది యపుడు
ఎంతొ బహుమానమున నాదరించి బుద్ధి
బుద్ధిమంతుని హనుమంతు శ్రద్ధఁ గనియె. 1135

ప్లవగు లటఁ జిత్రవనిని ప్రస్రవణ గిరిని
రాము సుబలు లక్ష్మణు శీర్షమున మ్రొక్కి
ఎదుట యువరాజు నుంచి కపీశు మ్రొక్కి
జనకసుత సంగతిని చెప్పసాగి రపుడు. 1136

అటుల రావణు నింటిలో నడ్డగింపు
రాక్షస స్త్రీల బెదిరింపు రాము ప్రేమ
రావణుడు రెండు మాసముల్ గడువు నిడుట
చేరి రాము నెదుట గపుల్ చెప్పినారు. 1137

జనకజయు క్షేమముగ నుంట వినియు రాముఁ
డిట్లడిగె "సీత యెటనుండె నెట్లు సీత
నాయెడల నుండె నిదియెల్ల నాకు మీరు
సీతఁ గూర్చి సర్వము వచియింపుఁ డనఁగ. 1138

రాము మాటలు విని వారు రాము నెదుట
సీత వృత్తాంతము సరిగఁ జెప్పు హనుమఁ
దెలుపఁ బ్రేరేప సీత కాదిక్కు మ్రొక్కి
హనుమ చెప్పె సీతను గన్న యఖిలవార్త. 1139

“నేను నూఱామడలు పొడుగైన జలధి
దాటి సీతఁ జూచెడి కోర్కెఁ దరలి వెదుక
దక్షిణపు సముద్రపు గట్టు దరిని నాకు
ఖలుఁడు రావణ పురి లంక కానఁబడియె... 1141

అచట దుష్టుడౌ రావణు వంతిపురిని
రామ ! నీమీఁద తనమనోరథము నిలిపి
జీవములఁ దాల్చి సీత వీక్షించినాను
చుట్టు రాక్షస స్త్రీలును ముట్టియుండ. 1141

నీమీది ప్రేమచే నిన్నె భావించుచు
సెటో జీవముల నిల్పి యేడ్చుదాని
వికృతమౌ మోముల వెఱగొల్పు రాక్షస
స్త్రీలు రక్షణ చేయు దీనురాలి
వ్యథల కేమాత్రము నర్హమే కాకయు
మిగుల బాధలు పొంది వగచుదాని.
ఏకవేణినె దాల్చి యిలఁబండి హిమమునఁ
గమలినివలె వాడి కమలుదాని

నిన్నె తలపోసి దుఃఖించు చున్న దాని
దనుజ కాంతలు భయపెట్ట వణకు దాని
రావణున్ ద్రోచి మదిఁ జావఁ బోవు దాని
వెఱచు హరిణాక్షిఁ గాకుత్స్థ ! వెదకి కంటి. 1142

నియత మగు సదాచారము నీదు భక్తి
కల మహాభాగ జానకి కానఁబడియె
యుగ్ర తపసు చేయుచు నృపవర ! యొగిని నామె
చిత్ర కూట వాయస కథ చెప్పె గుర్తు. 1143

నీవిచటఁ జూచినది యెల్ల నిమ్మతి హనుమ !
పురుష శార్దూలుఁడైన రామునికిఁ జెప్పు
అనుచు నసె సీత" పూని దాచినది యిదియు
నిమ్ము సుగ్రీవుఁ డీమాట లెల్ల వినఁగ. 1144

ఇదె చూడామణి శ్రీకరంబ యిది యెంతో శ్రద్ధతో దాచితిన్
ఇదె నాగండపుఁ బ్రక్కఁగా మణి శిలన్నీ వుంచి తీచుక్క, య
య్యెడనన్ నీవిడినట్టి చుక్క చనఁగా నద్దాని గుర్తుంచుకో
ఇది నీ బెమ్మటచేతనే చెరిగిపోయెంగాద యోరాఘవా ! 1145

నిను బోలెన్ గని కష్టములయం దెంతో ప్రమోదింతు నో
యనఘా ! దాశరథీ ! యొకే నెలయె యీప్రాణంబులన్ దాల్చి యుం
దును నాపై నిఁక దాల్పఁ బ్రాణముల; దైత్యుల్ నన్ను లోగొంచునుం
టను నీవే యరుదెంచి శీఘ్రముగనే నన్బ్రోవుమీ రాఘవా ! 1146

అని యాజానకి ధర్మచారిణి కృశంబై యున్న యంగాలతో
నని యారావణు లంక నంతిపురి బద్ధాత్మాంగియా వేణి వో
లెను సుత్ఫుల్లపుఁ గన్నులన్ గనుచు నీరీతిన్ దగన్ జెప్ప నే
నును నంటిన్ దగు నట్లు సంద్రమున యందున్ సేతువుం గట్టుమీ. 1147

ఇటు లారాజకుమారు లాపడిల నీక్షించి యాయానవా
లటు శ్రీరామున కిచ్చి దేవి తనతో వన్నట్టి యావాక్కు ల
న్నిటి విన్పించియు వాయుపుత్త్రుడును నెంతే తాను సర్వంబు పి
మ్మట వాక్రుచ్చెను నానుపూర్విగను నేమాత్రంబు వర్జింపకే. 1148

హనుమంతుం డిటుచెప్పఁగన్ దశరథక్ష్మాధీశు పుత్త్రుండికన్
మణిఁ గేలంగొని గుండెపై నునుచుచున్ సౌమిత్రితో పాటు నే
డ్చిన నంతన్ కనులందు నీరువెడలన్ జింతిల్లి సుగ్రీవుతో
నసె నీరీతిగ పూర్వసంగతుల నామ్యన్ బోవ భావించుచున్. 1149

ఎటులన్ ధేనువు చూడఁ గన్గొనుచు నెంతే క్షీరధారల్ చేపునో
యటులే యీమణిఁ జూచి నాయెదను స్నేహంబు ధారల్ పడున్
అటు వైదేహికి నాదు మామ శిరమందా పెండ్లి కాలానఁ గ
ట్టుటచే రాజిలె, దీనిమున్ సురవిభుండున్ యజ్ఞమందిచ్చెఁజూ. 1150

ఇది వీక్షింపగఁ దండ్రిఁ జూచినటు, లత్తే మామ వైదేహునిన్.
మది దర్శించిన యట్లగున్ ప్రియతలన్ మాణిక్య వర్యంబ యీ
యది శోభిల్లును, దీని దర్శనముచే నాత్మేశ్వరిన్ సీత నా
యెదుటన్ జక్కగఁ బొందినట్లు గననయ్యెన్ వేగ సాక్షాత్తుగా. 1151

డప్పిక గొన్నవానికి జలం బడినట్టులు వాక్సుధారిచే
నిప్పుడు నన్నుఁ దడ్పి మిథిలేశుని పుత్త్రిక యేమి పల్కెనో
చెప్పుము మాటి మాటికిని జెచ్చెలి సౌమ్య! మణిగ్రహించి నే
నిప్పటికేని సీతఁగన, నింతకు మించిన దుఃఖ మున్నదే. 1152

మాసము బ్రదుకుచో మఱి చిరంబె మనుట
అసితాక్షి విడి క్షణమైన బ్రదుక
నాప్రియ కనఁబడ్డ నగరికిఁ గొనిపొమ్ము
ప్రియవార్త గని క్షణంబేని నిలువ
భీరుభీరువు నాదు ప్రియురాలు సుశ్రోణి
యుగ్ర రాక్షస మధ్య నున్న దెటుల
ఇరులేగ ఘనమధ్య శరదిందు వటు దైత్య
మధ్య నామె మొగంబు మనదు ద్యుతిని

సీత యేమనె మారుతి! చెప్పు సరిగ
మందుచే రోగివలె నింక మనుదు నిపుడు
మధుర మధుర భాషిణి నాదు మహిషి మద్వి
హీనయౌ నావరారోహ యేమి పలికె. 1153

వ. అని మహాత్ముం డగురాముఁ డడుగ హనుమంతుఁ డప్పుడు సీత చెప్పిన దంతయు రామునికి ట్లు నివేదించె. పురుషవరా! దేవి యగు జానకి యిట్లు చిత్రకూటమున జరిగిన వృత్తాంతము జరిగినది జరిగినట్లు ఆనవాలుగా నిట్లు చెప్పె. "నీతో పాటు జానకి సుఖముగా నిద్రించి నీకంటె ముందుగానే లేచినది. అపుడు ఒకకాకి వెంటనే యెగిరి స్తనమధ్యమున ముక్కుతో గీఱినది. భరతాగ్రజ! నీవు దేవితొడపైని పర్యాయముగా పరుండితిని. మరల నాకాకి వచ్చి దేవిని బాధపెట్టి మరలమరల ఎక్కువగా గీఱఁగా ఆమె రొమ్మునఁగాఱు రక్తము తడిసి నిన్ను లేపినది. నిత్యము వాయసముచే బాధింపఁ బడుచు దేవి సుఖముగాఁ బరుండి నిన్ను లేపినది కూడ. ఓమహాబాహూ! స్తనమధ్య గీఱఁ బడిన దేవిని జూచి పామువలె బుస్సనుచు నీవిట్లంటివి. భీరు! నీ స్తనమధ్య మును నెవ్వరు గాయపఱచిరి. పంచ వక్త్రములు గలపాముతో నాటలాడు వాఁడెవఁడు? అనుచు. 1154

వేడి నెత్తుటం దడిసిన వాడిగోళ్ళ
నెదురుగా వచ్చు కాకి నీక్షించినావు
అదియె శక్రుని సుతుఁడౌ జయంతుఁ డంద్రు
అవనికిన్ వచ్చె గతిలోన ననిల సముఁడు. 1155

అప్పుడో మహాబాహు! అలుకఁ దిరుగు
కనులగను నీవు కడుమండు మనసుతోడ
దర్భ చాపనుండియు నొక్క దర్భతీసి
వేగదాని బ్రహ్మాస్త్రమునఁ గూర్చి వేసినావు. 1156

అప్పుడా దర్భ కాలాగ్ని యట్లు వెలిగి
వేగ నా చెడు కాకిని వెంట నంట
నదియు నానాగతుల తోడ నాకసమున
తిరిగి యన్ని లోకాలకు నరిగె నంత 1157

తండ్రిగాని ఋషులుగాని దేవతలునుగాని
శరణిడని త్రిలోకములు తిరిగి మరల
నిన్ను శరణొందె శరణొంది క్రన్ననఁ బడ
వధ్యు వధియింపకరొ దయన్ వాని బ్రోతు 1158

అతుల ఆ విషణ్ణుని గాచి యుంటివీవు
యిట్టి బ్రహ్మాస్త్రము వ్యథగ నేగ దిపుడు
కనుక దీని గొట్టుదుఁ జెప్పు మనగ జూచి
కొట్టు కుడికంటి వని జెప్పెఁ గూళకాకి 1159

అపుడు నీవును కుడికంటి నరసికొట్టి
నంత కుడికంటి నిడి కాకి ప్రాట రక్ష
పొంది నిన్నును రశరథు మ్రొక్కి మిగుల
వీర! నిన్ను వీడ్కొని తన వేశ్మ కరిగె. 1160

శస్త్ర విద్వరుఁడును శీల సత్యయుతుఁడు
అతి బలుడు రాక్షసుల నేయు డస్త్రమేల
నాగులసురమరుతులు గంధర్వు లేని
సమరమున నీదు వేగమున్ పైన లేరు. 1161

వీరుఁ డతనికి నీమీద ప్రేమయున్న
ఘన శరంబుల చై త్వ్రల నణచ డేల
అనఘ లక్ష్మణుండే నన్ను యాజ్ఞచేత
ఏ నిమిత్తా వచ్చి రక్షింపడిపుడు 1162

అగ్ని వాయుసములు పురుషాగ్ర సరులు
పూన సురలే నెదుర్కొనరాని వారె
ఏలనన్ను పేక్షింత్రు నేనెదొ చెడుగు
చేసియుందు శక్తులయి రక్షింపకుంట. 1163

జాలిగా నిట్లు కన్నీరుజాఱ సీత
వలుక విని నేను అప్పుడే పలికినాను
దేవి! రాముడు నీ వ్యథార్తిని నివెల్ల
వీడి నిన్నెంచు సత్యము తోడె సుమ్ము. 1164

రాము దుఃఖము కని యేడ్చె లక్ష్మణుండు
నింక నీ ముహూర్తమున దుఃఖ మేగఁ గనెదు
పూరుష వ్యాఘ్రములు క్షితీశ పుత్రు లిద్ద
ఱింక నినుగాంచి మదిఁ బొంగి లంకఁ గాల్తు రి. 1165

పోరిలో సబాంధవముగఁ గ్రూరరావ
ణాసురుని జంపి నినుగొని యరుగుఁబురికి
అతడు నన్ను బ్రీతిని గూర్చు నానవాలు
ఇమ్ము వేగ ననింద్య! యం చేను పలుక. 1166

వ. అప్పు డామె యన్ని దిక్కులు కనుఁగొని వేణిని విప్పి వస్త్రము
నుండి యా మణిని నొసంగె అంత నేను రఘూద్వహ! ఆ దివ్యమణిని తీసికొని
ఆమెకు నమస్కరించి బయలుదేఱఁ దొందర పడితిని. 1176

బయలుదేరి వర్ధిలుచుండి వఱలునన్ను
నరసి బాష్ప గద్గద వాక్కు నని యె నామె
కీశ సుగ్రీవ వృద్ధుల క్షేమ మడుగు
హనుమ! కుశలంబు రామలక్ష్మణుల నడుగు. 1168

ఎటు మహాబాహు వగు రాముఁ డీవ్యథాబ్ధి
నుండి నన్ను దాటించు నట్లొగిఁ బొనర్పు
యశముగల రాముడును నన్ను బ్రాణసహిత
నగుచు నుండ సంభావించు నట్లు చేయు 1169

వ. ఓ వానరేంద్రా! నాకుఁగల యీ తీవ్ర శోక వేగమున రాక్షసుల
బెదరింపులు కూడ నీవు మరువక రామునికి దగ్గఱకుఁ బోయి చెప్పుము. నీ

మార్గము మంగళకరమగు గాక! అని సీత యార్యురాలు రాజసింహ! నీకు విషాదముతోఁ జెప్పె. ఇది యంతయు నీకుఁ జెప్పితిని. సీత పూర్తిగా కుశలముగా నున్నది. ఇంక నీవు నమ్ముము శ్రద్ధతో పనిచేయుము. అని పిదప మఱియు దేవి ససంభ్రమముగా ఓవానరవ్యాఘ్రమ! నీసౌహార్దమువలన నీస్నేహమును బట్టి గౌరవించి నాతో నిట్లనెను. శీఘ్రముగా రాముండు రావణుని జంపి నన్నెట్లు పొందఁగలఁడో యీవిధముగా నీవు బహువిధములుగా దాశరధియగు రామునితోఁ జెప్పుము. అనియు మరలసీత. 1170

అపుడు బయలుదేఱెడి నన్ను నరసి యరసి
భర్తస్నేహాన! సౌహార్ద ఫణితిఁ బలికె
వీర! యిటనుండఁ దలఁతేని విశ్రమింపు
మొక్క దినమొంటి, రేప యిందుండి పొమ్ము. 1172

అల్పభాగ్యనౌ నాకు నీయంతికమున
ఈమహాశోకము త్రుటి శాంతించెఁ జుమ్ము
తిరుగ వచ్చుటకై నీవె యరుగ హమము
నాకుఁ బ్రాణసంశయ ముగుం దప్పకుండ. 1172

నిను గనమి నాకు శోకముఁన్ బెరిగి కాల్చు
మొదటి వ్యథకంటె నీవ్యథ యొదవి పెరుగు
నీకు సాయమౌ కపి ఋక్ష నియుతిఁ గూర్చి
నాయెదుటనె యీసందేహమే యొపంగు. 1173

ఆ ప్లవగ ఋక్ష యోధు లాయనుజు లింక
దాటరాని యీజలధిని దాటఁ గలరె
భూతములలోన నీవు వాత మింక
గరుడి యీముగ్గురె వార్ధిఁ గడువఁ గలరు. 1174

కనుక దుష్కరమైన కార్యమందు
నేమి చేతొ చెప్పుము జాణ నీవ యెందు
అరిదమన! నీవ చాలుదు వన్నిపనుల
నీఫలోదయమునఁ గీర్తి నీకె దక్కు. 1175

సర్వబలములతో రావణుఁ జంపి నన్నుఁ
దీసికొని రాముఁ డేగుచో దీన నాకు
యశము గలుగు: బాణములతో నణఁచి లంక
నన్నుఁ గొనిపోవ సదృశమౌ నాదు పతికి. 1176

ఆహవమ్మున శూరుఁడౌ నామహాత్ము
విక్రమంబున కనురూప విధిని నీవు
సలుపఁ దగు" నని సనిమిత్త సార్థకముగ
సీత పలుక విని, హనుమ చెప్పె నిటుల. 1177

దేవి ! కపి ఋక్ష సేన కధీశ్వరుండు
వానరపతి సుగ్రీవుఁడు నీ నిమిత్త
మయి బలయుతుఁడై స్థిరబుద్ధి నసుర గణము
కూల్ప, వచ్చుఁ గపి సహస్ర కోట్ల తోడ. 1178

విక్రమము సత్త్వమును మనోవేగ మున్న
కపులు బలులు సుగ్రీవు నాజ్ఞను పొనర్ప
నందె సిద్ధమై యున్నారు క్రిందఁ బయిని
నడ్డముగ నేగ నవ్వారి కడ్డులేదు. 1179

అమిత తేజులౌ వారు కర్మములు చేయ
నలసిపోరు, మహోత్సాహు లౌచు వారు
సాగరము దాఁటఁ గల భువిన్ జాలసార్లు
అనిల మార్గమునన్ ప్రదక్షిణము చనిరి. 1180

నాకంటె గొప్పవారును
నాకీడౌ వారునగు వనౌకసు లున్నా
రాకడ సుగ్రీవు దరిని
నాకంటె నికృష్టుఁడౌ కనంబడఁ డెపుడున్. 1181

నేనో యిటు వచ్చితి నా
వానర వీరుల గుఱించి వాకొనఁ గలనే
హీనులు గానట్టి జనం
బేనాఁడును పంపఁబడర యితరులె గానీ. 1182

కనుకన్ వగ యింకఁ జాలును
వనట మనసునుండి తీసి వైపుము దేవీ!
క్షణకాలములో లంకకుఁ
జనుదెంతురు గంతు వైచి సర్వకపీంద్రుల్. 1183

కను నాపై నుదితార్క చంద్రులో యనంగా నోమహాభాగ! లీ
లనె యేతెంతురు, శక్రహంతకుని ధీరాత్మున్ బ్రియున్ రాము, ల
క్ష్మణు విల్కానిని వ్యాఘ్రసింహబల విక్రాంతాత్ములన్ తీవ్ర దం
త నఖాస్త్రోగుల వానరేంద్రుల నింకన్ దర్శింతు వీలంకలో. 1184

గిరి మేఘంబుల బోని వానరవరుల్ క్రేళ్ళుబ్బి లంఘించి యు
త్తతి లంకా మలయాద్రి సానుల మహాధ్వానంబులం జేయఁ గ
చ్చుఱ నాలింతు శుభాంగి! నీవు వనవాసం బిద్ధియున్ దీర్చి యి
ద్ధరలో నట్లభిషిక్తు రాముని నయోధ్యన్ వేగ నీక్షింతులే. 1185

నీదు శోకంబుచేతను నాదు ముందు
అట్లు దుఃఖించుచుండియు నపుడు సీత
దీనములు గాని శుభ మిష్టమైన నాదు
వాక్యముల నూరడిలి శాంతిఁ బడసె మదిని. 1186

ఇది

మహాకవి వాల్మీకి మహర్షి రచితమైన,
పితృ గురువర చర్ల నారాయణశాస్త్రి ప్రాప్త విద్యుఁడును
వెంకమాంబా పుత్రుడు నగు గణపతిచే
సరిగ దీర్చి దిద్దబడిన, రామాయణసుధ యందు
సుందరకాండ సమాప్తము.




— / ప్రచురణములు / —

| | |
|---|---|
| సాహిత్య సౌందర్య దర్శనము (సమగ్రాలంకార దర్శనము) | రు॥ 35-00 |
| గణపతిరామాయణసుధ – బాలకాండ | 15-00 |
| అయోధ్యకాండ | 25-00 |
| మిగతా కాండలు (ఒకొక్కటి) | 15-00 |
| రఘువంశలహరి (పద్యములు : కాళిదాసు) | 10-00 |
| కుమారస్వామి విజయము (పద్య గద్యములు) | 4-00 |
| బుద్ధభగవానుని చరిత్ర (పద్య గద్యములు) | 4-00 |
| బ్రహ్మమీమాంసాదర్శనము (వ్యాస మహర్షి) | 10-00 |
| న్యాయమీమాంసాదర్శనము (గౌతమ మహర్షి) | 4-00 |
| వైశేషికదర్శనము (కణాద మహర్షి) | 4-00 |
| సాంఖ్యమీమాంసాదర్శనము (కపిల మహర్షి) | 6-00 |
| సిద్ధాంత తత్త్వదర్శనము (వ్యాస మహర్షి) | 6-00 |
| మహాభారత మీమాంస (1వ భాగము) | 4-00 |
| మధుర శాకుంతలము (నాటకము) | 6-00 |
| ఉత్తరరామ ప్రణయచరిత్ర (నాటకము) | 5-00 |
| ఉపనిషత్సుధ 1వ భాగము (మూల తాత్పర్య పద్యానువాదము) (ఈశకేన కఠోపనిషత్తులు) | 5-00 |
| ,, 2వ భాగము (ముండ మాండూక్య తైత్తిరీయ ఐతరేయములు) | 5-00 |
| ,, 3వ భాగము (ఛాందోగ్యము) | 30-00 |
| ,, 4వ భాగము (బృహదారణ్యకము) | 20-00 |

చర్ల గణపతిశాస్త్రి,
33, కిర్లంపూడి లేఔటు,
వాల్తేరు-3.